# ఉమర్ ఖయ్యామ్.



ఇది

పారశీక మూలమునుండి

శ్రీ ఉమర్ అలీషా కవిగారిచే

నాంధ్రీకరింపఁ బడినది.

శ్రీ విజ్ఞాన విద్యా పీఠము
పి ఠా పు ర ము
తూ॥ గో॥ జిల్లా.

# శ్రీ ఉమర్ అలీషా కవిగారి
# జీవితసంగ్రహము

ఉమర్ అలీషా మహాకవిగారు పీఠికాపురమున క్రీ. శ 1885 వ సం॥లో జన్మించిరి. వీరితండ్రిగారు మహర్షి మొహియుద్దీన్ బాషా గురువర్యులు. వీరి జనని చాన్బియాంబ.

వీరి తండ్రిగారు అరబ్బీ, పారశీక, సంస్కృతాంధ్ర పండితులు. ఆ ధ్యా త్మి క విద్యాపీఠాచార్యులు, ఆత్మవిద్యాసారంగదులు. వీరి కుటుంబము పూర్వమునుండియు భాషాపాండిత్యమునకు, ఆధ్యాత్మిక విద్యా సంపత్తికిని ప్రఖ్యాతిగాంచినది. శ్రీకవిగారు చిన్ననాడే సంస్కృతాంధ్రములు విశేషముగా నభ్యసించిరి. తదుపరి అరబ్బీ పారశీకాంగ్ల భాషలు నేర్చిరి. వీరు ఆంగ్లమున వ్రాయుట, మాట్లాడుట యెఱుఁగుదురు; కాని ఆంగ్లపద్య కావ్యములందు ఎంతమాత్రము వీరికి ప్రవేశము లేదు. వీరు సహజకవులు. వీరి 14వ వర్షమున తెనుగున ధారాళముగా కవిత్వముఁ జెప్పిరి వీరి 18వ యేట"మణిమాల"యను నాటకము వ్రాసి అచ్చొత్తించిరి. అది షేక్స్పియర్ మహాకవి నాటకమువలెనున్నదని అప్పటి పత్రికలు కొనియాడినవి. వీరి కనేకచోట్ల ఉద్యోగములిచ్చెదమని ఆహ్వానించినను వాని కంగీకరింపక భాషాసేవ దేశసేవఁజేయుచు తమ జీవితమును గడిపిరి. వీరు 1934వ సంవత్సరము డిశంబరు నెలలో అఖిల భారత శాసనసభకు సభ్యులైరి. ఆ పదవి వీరి మరణము వరకు నుండెను.

వీరికి **International Academi of America** వారు 1936 సం॥న **Doctor of Literature** బిరుదు మొఁసగిరి శ్రీ కవిగారు వంశపారంపర్యముగా వచ్చుచున్న ఆధ్యాత్మిక విద్యాపీఠమునకు ఆచార్యులై పదహారు వేల జనమును శిష్యులుగా నొనర్చిరి.

వీరి యౌగికజ్ఞానమును కొనియాడుచు జ్ఞానసభాసభ్యులు వీరికి బ్రహ్మర్షి బిరుదు మొసంగిరి. వీరిసతీమణి అగ్బరు బీబీగారు వీరితో ఢిల్లీ నగరము వెళ్ళి ది. 5-4-35న దివి నలంకరించిరి. ఆ దినమున ఢిల్లీశాసన

సభ మూాయబడెను. వీరు గతించినప్పుడు వీరికి అయిదుగురు కుమార్లు యిరువురు కుమార్తెలు పెక్కురు పౌత్రపౌత్రికలుండిరి.

శ్రీ కవిగారి జీవిత చరిత్ర ప్రత్యేక పుస్తకముగా వ్రాయబడు చున్నది. వీరు రచించిన సూఫీ వేదాంతగ్రంథమందు వీరి జీవితము సంగ్రహముగా నిట్లువ్రాసిరి.

–♦ స్వీయము ♦–

క. ఆ మొహాయద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుఁడను నా
నా మహితాగమ హితవి
ద్యామత "ఉమ్రాలిషా" మహాకవి నేనున్.

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్యప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసిననాఁడను కల్పనాసక్త మతిపది
నాటకంబులను కర్ణాటుఫక్కి
కూర్చినాఁడను కళాకోవిదుల్ కొనియాడ
నవలలుపది నవ నవల లనఁగ
తెలిగించినాఁడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికులలర

తే. రసము పెంపార నవధానక్రమములందు
ఆశులవులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాస సీమలెక్కి
యవని "ఉమ్రాలిషాకవి" యనఁగ నేను.

ఉ. రాజులఁ జూచితిన్ సుకవిరాజుల నోర్చితిఁ బేరుమ్రోయ రా
రాజులఁ నోలగంబుల విరాజితపండిత సత్కవీంద్ర వి
భ్రాజిత మౌలవిబిరుద పట్టములందితి యూనివర్సిటిన్
దేజముమీాఱ సభ్యుడయితిన్ మతబోధకుఁడైతిఁ గ్రమ్మఱన్.

ఉ. వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వరసైక చారు వి
న్యాసములున్ మతాంతరమహాపరివర్తన తత్త్వరూపకో
పాసనముల్ పురాణములు వ్రాసితి భారతభూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాఁడను"ఉమ్రలిషా" కవీంద్రుఁడన్.

ఉ. వేలురచించి విద్యలనుబెట్టి గడించితి పారితోషికా
ద్యాళిని వేయినూట పదియార్లను సింహతలాటముల్ మహా
భీలకసత్కళాకనక విశ్రుతముల్ జయభేరి మ్రోయ హిం
తాల వనీనటత్కకవి తండము లేమిటి లెక్క మాకడన్.

సీ. సాధించితిని యోగసాధనంబులు హిమా
గమ మెక్కి మతిని చక్కాడియాడి ;
బోధించితిని జ్ఞానసాధనక్రమములు
చెవినిల్లుగాఁ జేసి చెప్పి చెప్పి ;
సవరించితిని పెద్దసారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివిచదివి ;
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్ల ప్రభు
త్వంబు ముంగరమోపి మోపి.

తే. ఇప్పుడప్పుడె నలుబది యేండ్లపైన
దాఁటిపోయెను వయసు నీనాటికైన
శాంతి గలుగదు నీ కళాధ్వాంతమందు
జీవితము తెన్ను సుడిబోవు నావబోలు.

మ. నను నీజ్ఞానమహాసభాసదులు నానందాన నర్థించి 'ఆ
దిని మీపూర్వపితామహుల్ గురువులై దివ్యత్వమేసారఁగా
మనవిజ్ఞానకళాప్రవృత్తి ప్రజహృత్కాంతారముల్ నింపి రా
మని మీరాకృతి బోధసేయఁదగు 'ఉమ్రాలీష' బాషాగతిన్.

మ. అని నెయ్యంబునఁ గోరఁగావిని మహాహర్షంబు సంధిల్ల నా
నని యా జ్ఞానమహాసభాకథన మత్యంతంబు కష్టంబు మే
దిని సంసారసమగ్న మానసులు నర్థింపంగ సాధ్యంబు గా
దని యున్నంత నెఱుంగసేతునని నే నారంభమున్ జేసితిన్.

ఉ. భారతదేశ శాసనసభా సభికత్వపదంబుఁ జేర నేఁ
గోరఁగ జ్ఞాన సభ్యులు నకుంఠితదీక్ష జగంబు మెచ్చఁగా
భూరితప స్సమాధి తమ బుద్ధిని నిల్పి జయంబుఁ దెచ్చినా
రారయ జ్ఞానశక్తికి నజాండము కంపిలుచుండుఁ జూచితే.

చ. కవిత నెఱుంగనట్టి పృథుకాలము వ్రాసితి పుస్తకంబు లా
కవిత నెఱింగి వ్రాయుటకు గంటుమురాదు, నుపన్యసించు నా
దినముల విద్యతోఁ గలసి తృప్తిఘటించెడు వాని సిప్పుడో
లవము నుపన్యసించుటకు లజ్జఘటించెడు నేమిచెప్పుదున్.

శా. ఢిల్లీ భారతశాసనైకసభ రూఢిన్ ప్రాతినిధ్యంబు సం
ధిల్లన్‌జేరిమహత్తరోజ్జ్వలకళాధిక్యంబురంజిల్ల వి
ద్వల్లోకంబున రాజకీయకలనావ్యాపార పారంగతం
బెల్లన్ వేట్కను నిర్వహించుచును నేనీగ్రంథమున్ * వ్రాసితిన్.

ఉ. ఏమహిమాలయంబుపయి కెక్కి తపస్వులఁ జూచి వారి వి
న్నాణములన్ గ్రహించి విజనంబగుచోట రచించినాఁడ నా
నా నవ కావ్యమార్గము లనంతముగా హృదయాంతరంగ వి
జ్ఞానము విశ్వరూపముగఁ గన్పడునట్లు దృశంబు మార్చుచున్.

శా. నాలోనున్నవి నేనుజూచినవి విన్నాణంబులై లోకమం
దాలోకింపఁగ రాని యీ యమరవిద్యాతత్త్వమర్మంబు లం
దేలోటున్ జనియింప దీశ్వర రహస్యైకైక మీమార్గమే
మేలా దాచెదమంచుఁ జెప్పితిమి మీరిద్ధాత్ములై తేరఁగన్.

కం. మా తాతయు మా తండ్రియు
ఖ్యాతిని ఆ ఖైలలీ మహాగురువర వి
ద్యాతత్త్వము నేర్చిరి త
ద్రీతుల వివరింతు యోగరీతులు తెలియన్.

## -◆ అ గ్బ రా ం బ ◆-

శా. ఆ ఢిల్లీనగరాంగ్ల శాసన సభాభ్యర్థిత్వ మర్థింపఁ డం
చాడన్ నేను కృతార్థుఁడై జనిన నాకై వచ్చి ప్రాణంబులున్
వీడెన్ నాసతి అగ్బరాంబిక చిలత్ విద్యుల్లతన్ బోలె ; యీ
నాఁ డే నశ్రులు 'గోరి' పైవిడుచుచు న్వర్తింతు నిర్జీవినై.

ఉ. ఏను రచించినట్టి కృతు లెన్నిఁటినో విని తల్లి ; తండ్రి నా
నా నవనాటక ప్రకరణంబులు నాఁడగ జూచినారు ; ఢి
ల్లీ నగ రాంగ్ల భారతమహీధవ శాసనసభ్య సత్పదం
బానఁగ గాంచి 'అగ్బ' రమరాలయమేగె వెలుంగుచుక్కయై.

---

* సూఫీవేదాంతదర్శము

శా. ఎన్నో బాధలు బొందుచుండు మని నన్నీభూమివర్జించి యా
పున్నెంపుంగని అగ్బరేఁగె దివికిన్ బూర్ణేందుబింబంబు వా
ర్ధి న్నిద్రింపగ బోయిన ట్లిఁక మహాంధీభూత మాలిన్య సం
ఛన్నాత్మన్మన్వనిషిద్ధజీవిత మభాసం బెన్ని నా ళ్ళుండినన్.

సీ. ఏమాట చెప్పిన నెదురాఁడగా లేదు
పరమసాధ్వీత్వంబు వరలుకతన
ప్రాణాల నర్పించి పరిచర్యలను జేసె
పరమహర్షంబు ముందరను నిలువ
కలిమిలేములను నొక్కటిగాఁగ గణియించె
నిత్యకళ్యాణంబు నెలకొనంగ
ఏవురు కొడుకుల నిద్దరు కూఁతుల
ననిశంబు దీవించి నాత్మశాంతి

తే. ప్రతిదినంబు చదువు ఖురాన్నమాజు
శౌచశీలాన నలువది వత్సరములు
ధరణి జీవించి స్వర్గాన కరిగె అగ్బ
రాంబ దివిజులు నీరాజనంబులిడఁగ.

చం. పరమపవిత్ర యీ వెలది పండితురాలు నితాంత సత్యసం
భరిత రసాత్మక ప్రకృతి వడ్డికిబారెడు ప్రేమమూర్తి సుం
దర సముపాసితం బయిన ధర్మపదంబును సంతరించి యీ
శ్వరునెద నగ్బరాంబ కడు ప్రార్థనసేయుచు నెల్లవేళనన్.

శా. పల్లెన్ బుట్టిన ఢిల్లిలో బ్రిటీషుసామ్రాజ్యంబు పాలించు వా
రెల్లన్ వచ్చి సమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
ఫుల్లాబ్జానన 'అగ్బరాంబిక' భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లన్ విచ్చిన కుండఁబోలె వెస నే జీరాడుచున్నా నిటన్.

చం. హృదయము ముక్కలౌనటుల నేడ్చుచుఁ గన్నులనీరు కాల్వలై
చెదరఁగ నిన్నులోకములఁ జేరుటకంటె సమాధితోంటి నీ
సదనము జేరుమార్గము విచారణజేయుట లెస్స యైహికా
స్పద విభవానుషంగభవబంధమువాసిన నిన్ను చూడఁగన్.

శ్రీ కవిగారు యిస్లాంమతస్థులు. వీరి మాతృభాషఉర్దూ. ఆంధ్ర భాష మాతృభాషగా కానివారు తెనుఁగున సరసకవిత్వముఁ జెప్పిన వారు ఈ కవిగారొక్కరే వీరు రచించిన మహాభారత కౌరవరంగ మను నాటకమున—

నాటకముల్ ప్రబంధము లనంతముగా రచియించి వాణి కా
వ్యాటవి భావవీధుల విహార మొనర్ప జయధ్వజంబు వా
గ్వ్యాటిని నిల్పినట్టి జనవిశ్రుత ఉం రలీషా కవీంద్రుడున్...."

అని వ్రాసిరి.

వీరు రచించిన గ్రంథము లేబదివరకున్నవి. శ్రీ కవిగారు తమ శిష్యులకు దర్శన మిచ్చుటకై నరసాపురము (పశ్చిమ గోదావరిజిల్లా) వెళ్ళి అచ్చట ది 23 జనవరి 1945వ నాటి సాయంత్రము 5 గంటలకు దివి నలంకరించిరి. వీరి భౌతికదేహమును పిఠాపురముఁ దెచ్చి 24వ తేదీ సాయంత్రము రైలుస్టేషనువద్ద నున్నవారి యరామములో సమాధి చేసిరి.

# ఉమర్ ఖయ్యామ్

## 1

ఈ "ఉమర్ ఖయాం" అనునతడు సుప్రసిద్ధుఁడైన పారశీక కవి. క్రీస్తుశకము 1018 సం. పెరిషియాదేశమున నైషాపూర్ అను గ్రామమున జన్మించెను. ఈతని తల్లిదండ్రులు లిస్లాము మతమునకు జేరిన వ్యవసాయదారులు. "నైష్" అనగా వెదురు. వెదురు బిడమును దొలగించి కట్టిన పల్లెయే 'నైషాపుర' మని ప్రసిద్ధి వహించినది. ఇది ఖురాసాన్‌దేశపు చక్రవర్తుల కాలమున బలఖ్, హిరాత్, షాజహానులతో పాటు నైషాపురమును రాజప్రతినిధినివసించుముఖ్యస్థానమైయుండెను. ఇందెన్నియో కళాశాలలు నిర్మింపబడియుండెను. బాగ్దాదులోని పెద్ద పెద్ద విశ్వవిద్యాలయములకన్న నీనైషాపురమున పెక్కు విశ్వవిద్యాలయములు నిర్మింపఁబడినవి. అందునిజాముల్ ముల్కుతూసి "బేహఖియా" నిజామియా నైషాపూర్, మహమూద్ గజినీ సోదరుఁడు "సైదియా" ఇట్లే ఆబూసెద్ బగ్దాదీ, ఆబూ ఇసహాఖ్ మున్నగు ప్రసిద్ధ పురుషులచే నెన్నియో కళాశాల లీనైషాపురమున నిర్మింపఁబడినవి. అందు అరబ్బీ మహావిద్వాంసుఁడగు "ఇమామెగజ్జాలి" నైజామియా విశ్వవిద్యాలయమునకుఁ బ్రధానాచార్యుడు (Chancellor) గాఁగొన్నినాళ్ళుండెను. ఉమర్‌ఖయ్యామ్ ఇందు తీర్ణుఁడగుటయేకాక లోకమున నెచ్చటెచ్చట గొప్పవిద్వాంసులున్నారని విన్నను అచ్చటకుఁ బోయి తర్కవ్యాకరణాదులు జ్యోతిషములు సంపూర్ణముగ నేర్చుకొనియెనని "ఇబ్నెఖల్ కాన్" అను చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. ఈతని సహాధ్యాయులు హసన్ బిన్‌సభా, నిజాముల్ ముల్కుఅను ప్రసిద్ధపురుషులిరువురుండిరి. వీరినిగూర్చి యొక విచిత్రకథగలదు. వీరు చదువుకొను కాలమున హసన్‌బిన్‌సభా 'మన ముప్వురిలో నెవరి కదృష్టము పట్టినను

తక్కినవారికి సమానముగాఁబంచవలెనని యొక ప్రమాణపత్రము వ్రాయించెను. కొంతకాలము గడచినతరువాత నిజాముల్ముల్కు బాగ్దాదు పరిపాలించుచున్న మలికానల్షాఖీచక్రవర్తులయొద్ద బ్రిధాన మంత్రిగానేర్పడియెను. వానియొద్ద కొకనాఁడు ఎక్కడికో పోవుచు మార్గశ్రముఁడై ఉమర్ఖయ్యాము వెళ్ళి దర్శించెను. నిజాముల్ముల్కు చూచిచాలగౌరవించి నీకేమికావలెనని కోరెను. నాకేమియునగత్యము లేదనిచెప్పివెళ్ళిపోఁజూచెను. కానినిజాముల్ముల్కు 'మనము చదువుకొను దినములలో నొక ప్రమాణపత్రము వ్రాసికొంటిమి. నీకు జ్ఞాపకము లేదా' యని యుగ్గడించి నీవు 'నావెంట రావలెను. నాయేలికతోఁజెప్పి నిన్ను నాయంతవానిగఁజేయుదును' అని మిక్కిలిప్రార్థించెను. కాని ఉమర్ఖయ్యామా మాటలకునవ్వి,

"ఎకనానె బదోరోజ గరషవద్ హాసిలెమర్ద
బరకూజషికిస్తాదమె అబెసర్ద
మామూరక సేదిగర్ చరాబాయెద్ బూద్
తాఖిద్మతె చూఖుదీచరబాయెద్ కర్ద."

అనగా,

ఉ. రెండుదినాలకైన నొక రేయొకరొట్టె లభించెనేని, నో
రెండినవేళ నింతజల మిచ్చెడు పెంకు లభించెనేని నే
నొండొరు వేఁడి, వాని కొలువుండను నాగతి మానవుండె భూ
పుడును వాని గొల్చుచును బొట్టను నింపుకొనంగఁ బోదు నే.

"ఎకజౌగమె అయ్యాంనదారేం ఖుషేం
గర్చాష్త బువద్ షాం నదారేం ఖుషేం

చూపొఖత చెమూమెరసద్ అజమద్బఖయిష్క
అజకస్ తమా ఖా నదారేం ఖుషేం."

అనఁగా.

మ. జగతిన్ దుఃఖమొకింత నామనసులోఁ జర్చింపఁగా లేదు రే
వగలం దెప్పుడో గుప్పెఁడన్నము లభింపన్ జాలు లేకున్నచో
వగపేలేదు మహానసగృహములోఁ బక్వాన్నమే చిక్కుచుం
డఁగ నన్యుంగని వేఁడ నేఁటి కది మూఢత్వంబు గాకుండునే ?

అని బదులుచెప్ప నాతనివివేకమునకు, స్థితప్రజ్ఞకు నెంతయు సంత సించి సంవత్సరమునకు (1200) పదిరెండువందల తోమానులు—తోమానననఁగా ఇరువది రూపాయలు; ఇరువది నాలుగువేల రూకలు (రు. 24,000)—నైషాపురమునం దాదాయమువచ్చు భూమి దానపట్టా వ్రాసి యిచ్చిపంపెను. ఇది గని యొక జిజ్ఞాసువు నేనడిగి దేవురించి నను నెవరును నా కొన కాసైన నియ్యరే నీ కింతధనమెట్లు వచ్చినది ? అని యడిగినాఁడు. వానితో,

మ. ధనవాంఛన్ దృజియించి యేఁగు ప్రతిపాదంబందు వేవేలుగా
ధనరాసుల్ లభియించు లేనియెడ నర్థం బర్థి రాఁబోవ దే
పనియైనన్ సమకూడ లేదని మదిన్ భావింప కీ దుఃఖ ముం
డిన దీర్ఘంబు ననర్థదాయకమునై డిందించు నీజీవమున్.

శా. రాగద్వేషము లాశ్రయించి విషయభ్రాంతిన్ బ్రవర్తింప ను
ద్యోగింపన్ దగునా జగాన విధి సంయోగంబుచే నెందఱో
భోగా పేక్షను వచ్చిపోయి రిటులే ముందిఁక రానున్న వా
రేగన్ జూతురుగాని యొక్కఁడిలపై నిష్టార్థముల్ పొందెనే.

అని బదులుచెప్పి వానికేదో కొంత ధనమిచ్చి పంపించెను.

ఈ "ఉమర్ ఖయ్యాం"యొక్క అసలుపేరు ఉమర్. కొందఱు ఉమురూ అనికూడా చెప్పుదురు గాని అది ముద్దుపేరు కానోపును. ఖయ్యాం అనునది బిరుదు (ఖయ్యాం అనగా గుడారపు నిర్మాత.) ఈ బిరుదునామములే అరబ్బీ,పారశీకవులు తమకావ్యములందు వాడు చుందురు. పూర్వసంస్కృతకవులకుఁ గూడ నిదే యాచారము. వ్యాస, వాల్మీకి, మయూర, బాణ, విద్యారణ్య, భవభూతి, కాళిదాసు, లనునవన్నియు బిరుదులే కాని యసలు పేరులుగావు అట్లే, హాఫిజు, సాది, మౌలానా రూమ్, గజ్జాలీ, ఖయాం అనియునెఱుంగవలయును. ఉమర్ ఖయ్యాం అనగా ఉమర్ అనే ఖయ్యాం అనియర్థము. ఈతడు విద్యారణ్యునివలెఁ బెక్కుగ్రంథములను వ్రాసిన ఋషి (నానృషిః కురుతే కావ్యమ్). అం దీతని మత సిద్ధాంత గ్రంథమునకు ఉమర్ ఖయ్యామని పే రిడినాఁడు. ఈతఁడు ఇస్లాముమతస్థుఁడైనను కపిలాది సాంఖ్యమతస్థులకును, విరోచనాది చార్వాక లోకాయతమతములకును సంబంధమైన యొక సిద్ధాంతమును ప్రతిపాదించినాడు ఈతడు జ్యోతిషమునకు ప్రధానాచార్యుఁడు. "తఖ్వీమెజలాలీ" అను గొప్పజ్యోతిష సిద్ధాంతగ్రంథమును వ్రాసినాడు. ఇప్పటి ఇంగ్లీషుకేలండ రీతిని సిద్ధాంతములోనిదే యం గిబ్బన్ మున్నగు చరిత్రకారులు వ్రాయుచున్నారు. మఱియు నిట్టిదే "జీచ్‌ముల్కెషాహి" అనునది జాతక సిద్ధాంత భాగములు వ్రాసిన నా డీగ్రంథము,

"అరాయిసన్‌నఫాయిస్" అను తత్త్వశాస్త్రము (Philosophy)

"అల్‌జబర్" (Algebra). దీనిని అరబ్బీభాషలో వ్రాసెను. ఇది యిప్పుడు ఫ్రెంచిభాషలోఁ బరివర్తింపఁబడినది.

"ఒఖిలీదస్" (Geomietry) లోన కఠినతరసమస్యలు ప్రస్తరించి చూపించెను. "ఇల్మె తబీయాత్" (Chemistry).

"దర్బారయే హుక్మతుల్ ఖాలిఖ్" ఇది వేదాంతశాస్త్రము. సంచీకరణ విషయముగలదు.

"రిసాలా" శారీరఆర్థికశాస్త్రము.

"రిసాలయెమౌనూమా" తర్కశాస్త్రము.

ఇట్టివే యెన్నియో కలవు. ఇవి యన్నియు నిప్పటికిని ప్రమాణ గ్రంథములుగ బండితులచేఁబరిగణించబడు చున్నవి. ప్రాశ్చాత్యులీ గ్రంథములన్నియుఁ తమభాషలలో తర్జుమా చేసికొనినారు.

ఈతని జీవితకాలములోఁగూడ నతనికి జగద్విఖ్యాతమైన యశస్సుండెడిది. నాఁటి చక్రవర్తులలోఁ బేరెన్నికగన్న షంషుల్ ముల్కఖాఖాని సుల్తాన్ సంజీద్మున్నగువారీతిని కర్ధసింహాసన మిచ్చి గౌరవించుచుండిరని, పల్లకి దండి చేతితోతాకి బోయీలకెత్తుకొనుట కనుజ్ఞ నిచ్చుచుండిరని,నాఁటి ప్రసిద్ధచరిత్రకారులగు దౌలిర్ షాసమార్ ఖంది. తారీఖుల్హూక్మ మొదలగు వారివలనఁ దెలియుచున్నది. నాఁటిసమకాలికులగు కవులు చరిత్రకారులగు "నిజామీ, ఉరూజీ" మున్నగు వారీతని పూజ్యపాదునిగ గ్రహించి పేర్కొనుచుండిరి. ఈతని కాగతానాగతజ్ఞానము గలదనుట కనేక నిదర్శనములు ప్రజల కగుపర్చుచుండెను. అవి యిం దుదాహరించుట గ్రంథవిస్తరమగును.

సంతచెప్పుటయందును అవధానము లొనరించుటయందును, తర్కవ్యాకరణాది జ్యోతిషవిషయములే కాక యెన్నియో కళలయం

దును ప్రవేశమున్నట్లు చరితల వలనఁదెలియుచున్నది ; తుద కీ మహానీయగుణగరిష్ఠుడైన ఉమర్ ఖయ్యాం నూట తొమ్మిదియేండ్లు జీవించి తన జన్మభూమియగు నైషాపురమున క్రీస్తు శకము 1127వ సంవత్సరమునఁ భౌతికశరీరమునువిడిచి దివినలంకరించెను. ఈతనిగోరి "హిరా" అను ప్రదేశమునఁ గలదు. ఒకసారి 'బలఖ్' పట్టణమున నేదో వేదాంత వివాదము వచ్చి తన గోరీపైఁ బ్రళయకాల పర్యంతము పూలుకురియుచుండు నని కొన్ని పద్యములు చెప్పెను. అది నేఁటికిని బ్రత్యక్షముగఁ బ్రక్కనున్న మసీదులోని పూలతీవ లల్లుకొని పువ్వులజస్రము కురియుచున్నవని తెలియుచున్నది. ఇట్టివే పెక్కువాఖ్యానము లీతని గూర్చి చరిత్రజ్ఞులు వ్రాసియున్నారు.

ఈతని మతిసిద్ధాంత గ్రంధములకు "ఉమర్ ఖయ్యాం" అని పేరిడినాడని పైనినుడివియుంటిమి. అసలుదాని పేరు "రూబాయియాత్ ఉమర్ ఖయ్యామ్" అనగా ఉమర్ ఖయ్యాంవ్రాసిన రుబాయి లని యర్థము. "రూబాయీ" లన శార్దూలాది వృత్తముల వంటి పారసీ వృత్తములలో నొకదానకిపేరు. ఈవృత్తములలోఁ దనభావములనువెల్లడించెను. ధారాపాతముపంటి యీతని కవిత్వమును, లోకాతీతమైన భావగంభీరతను, ఆలోకసుందరమైన ఉపమానవస్తువులను జూచి విషయమెట్టిదైనను లోకము మోహించి రససముద్రమున మునిఁగిపోయినది. ఇది తొలుత ఫెడ్జరల్డ్ అనునాతఁడు 1858వ సంవత్సరమున ఆంగ్లభాషలో 75 పద్యములలోని కనువదించియచ్చొత్తించినాడు; కాని దానిపైఁ దనపేరుకూడ వేసికొనలేదు. ఆపొత్తము లమ్ముడుకాకపోవుటచే 5 షిల్లింగులనుండి ఒక పెన్ని వెలకుతగ్గించి బుక్కాదుకాణములవంటి దుకాణదార్లమ్ముచుండిరి. అది తొలుతసర్ రిచెర్డుబర్టన్, సూన్‌బరన్,

డాంటి, గబ్రియల్, రూస్టుమున్నగువారుకొని చదివి వ్యామోహితులై తమయాప్తులకుఁబంపి విమర్శనములు వ్రాసి దానిప్రాశస్త్యమును వేనోళ్లఁకొనియాడుట కారంభించిరి. తిరిగి యీపొత్తము 1868వ సంవత్సరము రెండవసారి ముద్రింపఁబడినది. తరువాత 1872లో మూఁడవ ముద్రణమును జరిగినది. తరువాత 1879లో రెండు మూఁడుసారులు ముద్రింపఁబడి, యిట్లే యేటేట లెక్కలేనన్నిసార్లు వివిధములైన మాదిరులలో ముద్రింపబడుటయే కాక యనేకులనే కానువాదములుచేసియు వ్యాఖ్యానములు వ్రాసియు గౌరవింపఁజొచ్చిరి. ఒక్క యూరపు దేశమందే కాక అమెరికాలో నిదిలేనియిల్లే లేదనునంత వ్యాప్తినిగాంచినది. ఇప్పుడిప్పు డెల్ల దేశములలోను, ఎల్ల ఖండములలోను, ఎల్ల భాషలలోను ననువాదములు బయలుదేఱుచున్నవి.

ఈ ఉమర్ ఖయ్యాం గ్రంథమంతయు నొకచోట లభించలేదు. ఖండఖండములుగ దేశాంతరములయం దుండిపోయినది. ఇప్పటికి దాదాపు 1200 పద్యములు లభించినవి. అసలు కవివ్రాసిన పొత్తమెంతో తెలియదు. అది కాలగర్భమున మునిఁగిపోయినది. ఆ సమకాలికులు వ్రాసిన ప్రతులను నిప్పుడగుపడవు. మిక్కిలి పురాతనమని చెప్పదగిన ప్రతి 1460వ సంవత్సరమున వ్రాయబడినది. అది బోడ్లిన్ భాండాగారమునఁగలదు. ఇందు 158 పద్యములు మాత్రమే కలవు. దానిని 1898వ సంవత్సరమున ఎడ్వర్డుహీరన్ అయి ననువాఁడు లండనునగరమునఁ బ్రకటించినాఁడు. పేరీసు నగరమున 1530వ సంవత్సరమునవ్రాసిన ప్రతిగలదు. ఇందు 76 పద్యములున్నవి. బ్యాంకిపురమున నొక ప్రతి లభించినది. అందు 604 పద్యము లగుపడుచున్నవి.

ఏషియాటిక్కుసొసైటీ (కలకత్తా) వారిగ్రంథాలయమున నొక ప్రతిగలదు. అందు 516 పద్యములున్నవి.

వాన్‌హామిార్ తనయొద్దప్రతిలో 200 పద్యములు మాత్రమే కలవని వ్రాయుచున్నాడు.

లఖనోప్రతిలో 770 పద్యములు వ్రాయబడియున్నవి.

జాన్ పేన్ అనువానిప్రతిలో 845 పద్యములున్నవి.

మిస్ జే. సి. ఐ. కేడిల్ 1200 పద్యములు సేకరించెను. ఇంక నెన్నిపోయినవో తెలియదు. తొలుతఇంగ్లీషులో భాషాంతరీకరించిన వాఁడు ఎడ్వర్డు ఫిడ్జెరల్డు అనిగదాపైన వ్రాసియుంటిని. అతనికి లభించిన ప్రతి యిప్పుడెక్కడను అగుపడకున్నది.

ఈతని తరువాత 1872వ సంవత్సరమున ఐ. హెచ్. దన్‌ఫీల్డు అనునాతడును, 1898వ సంవత్సరమున రెచెర్డువీగేలిన్ అనువాడును, 1913వ సంవత్సరమున జాన్‌సన్‌పాషా అనునాతడు 762 పద్యములును, 1915వ సంవత్సరమున జాన్‌పాలిన్ 158 పద్యములును, 1920వ సంవత్సరమున షరబ్ మాల్ 346 పద్యములును ఇట్లే ప్రొఫెసర్ హెర్నిలిక్, మీకార్తిగారజ్ మున్నగు నెందఱో పూర్తిగ అనువదించినారు; ఇంకను ననువదింపనున్నారు. కాని అసలులోగల ధారాప్రవాహ రూపకమైన, శాంతియుతమైన కవితాప్రభావము, రసపుష్టి, ధ్వని,వ్యంగ్యాలంకారము లొక్కరవంతయు రాలేదు. వచ్చుటగూడ సంభవముగాదు. కేవలము భావము మాత్రమువచ్చును. భావము శైలితోఁ గూర్పబడినప్పుడున్న రసమిదమిత్థమని వచింపరాదు. అందుచే నొక ప్రసిద్ధుఁడైన ఇంగ్లీషు కవి ఉమర్ ఖయ్యాం మాతృక యొట్లుండునోయని యిఱువదియేండ్లు పారసీభాష లెస్సగ నేర్చి తరించినాఁడట. మొత్తమున నీగ్రంథరాజము చదువుచున్న నింక నేపొత్తముపైఁగూడ మనస్సు పోనేరదు.

ఇందు 35 విషయములపై ప్రసంగముగలదు. అవి భగవద్గీతాధ్యాయములవలె వేఱువేఱుచేయఁబడినవి. అత్యంత ప్రాచీనమనదగిన చార్వాకుల పొత్తములు పోయినను ఇదియొక టగుపడుచున్నది. ఇందు వేదాంతము, జీవన్ముక్తి, ప్రపంచము, ధ్యానము, యోగము, తపస్సు, సమాధి, కాలము, మానవప్రవృత్తి నివృత్తిమార్గములు, ఈశ్వర జిజ్ఞాస తత్త్వము, మధువు, లోకదుఃఖము, వైరాగ్యము, వివేకము,ఆనందము, సృష్టి, జీవుడు, స్వర్గము, నరకము, సదసత్తులు మాయ, భ్రాంతి మున్నగునవి ముఖ్యములు. మొత్తమన్నిటియందును. విశేషముగ ఆసవపానము, గానము, మానిని, ఏకాంతవాసము, సౌధారామముల గూర్చి పెక్కు భావము లలంకారములతోఁ దర్కించి సాధించి సిద్ధాంత పూర్వ పక్షములలోని నిగ్గును తేల్చి, పరమను దానిని మఱపించి, కైవల్యాదిపదవులు సాకులని యొప్పించి కేవల మైహికమే నిక్కమని పెక్కునిదర్శనము లగుపర్చి తనసిద్ధాంతము నయఃపిండమువలె దృఢతరమును స్థిరతరమును గావించి లోకముచే పాడించి విడిచినాఁడు. ఆ సంబంధమైన భావముల నిసుకతిప్పవలె చెప్పి గుచ్చియెత్తినాఁడు. భూమ్యాకాశమధ్యముననున్న యన్నివస్తువులను సోదాహరణముగఁ జూపించి, ఆస్తిక వాదమును చిందరవందర చేసి పటాపంచలు గావించినాఁడు. ఇది పాశ్చాత్యనాగరకుల కెంతయు సరిపోయినది. అందుచే నాతనిని వారత్యంతము గౌరవించుటయేకాక నాతని యీగ్రంథమును వేదతుల్యముగ సమారాధించుచున్నారు మొన్న నొకపాశ్చాత్యుఁడు ఫిడ్జెరల్డు మొదటి కూర్పుప్రతిని 600 పౌనులకు కొన్నాఁడట. అదిగాక యెందఱో పాశ్చాత్యులు నైషాపురముపోయి యీతనిగోరీనే యర్చించుచున్నారు. ప్రతిసంవత్సరమున చ్చట గొప్పయుత్సవము సాగుచున్నది.

ఇతడు నాస్తికుడని, వామమార్గావలంబుఁడని చెప్పుదురు. నాస్తికు లగు పాషండులకును సీతనికి విషయమునఁగూడ రవంతేనియు భేదమ గుపడదు. కాని యీతఁడు

శా. వైరుల్ నన్నుఁ బదార్థవాదియని సంభాషింతురే వార లే
తీరున్ గన్నుటులాండుచుందురొకో యర్థిన్ జెప్పి రూహింప సొం
పారన్ ధాత్రి కులాయమందు సృజింపన్ వచ్చితిన్ నేను నా
దేరూపంబని చర్చచేయవలదా యిందేమి తప్పున్నదో.

అనియును ఆస్తికులని చెప్పుకొనువారే వామమార్గావలంబు లనియు, మఱియొకచోట ___

ఉ కోవిదవర్య, శాంతి వినగోరెద నాపలు కీవు నేనునుం
బోవుచునున్న మార్గ మొకపోలికదైనను వామమార్గమం
దీ వొకదృష్టినిల్పితివి యెప్పటికైనను దిద్దుకొమ్ము నా
పై విరసోక్తులాడకు నెపంబులు వీడుమ యీశ్వరార్థమై.

అనియుఁ జెప్పుచున్నాఁడు.

జీవించినన్నాళ్ళు భోగించుటయే దారి. అదే జీవపరమావధి. అని పెక్కు విషయములచే సమగ్రమైన నాస్తికవాదము నిందు పూర్వ పక్ష సిద్ధాంతములచే వ్రాసియుందందు శృంగారరసస్వరూపములగు భావములచే పాఠకులహృదయమును మిక్కిలి యాకర్షించినాఁడు.

ఉ. ఆ రమణీమనోహర ముఖాబ్జము ముంగురు లుంగరాలసిం
గారము పెట్టి దిద్దితి వికాసముగుల్కెడు ముద్దరాల ! సొం
పారఁగఁ బొందరా దనెదవక్కట, నిండిననాఁటి పాత్రమున్
బోరలవేసి నేలపడఁబోలదు నీరును నట్టు లుండదే !

ఇట్టివే పెక్కులు గలవు. గ్రంథవిస్తరమని వ్రాయలేదు. ప్రతి పద్యమును భావపూరితమైన ప్రస్తావనమున కనుకూలించునట్లుండును. ఇట్లే రాజులనుగూడ నిందించినాఁడు.

ఉ. గాడిదవంటి యీనృపులకైవస మేమిఫలంబుగూర్చు నీ
తోడను నేల పొందితిని దోడ్కొనిపోయెదు వీరు విద్యకున్
బోడిమికిన్ వెలన్ ఒసఁగఁ బోవరు వత్సరమేడిపించి యే
నాఁడును చేరెఁడంబువుల నర్మిలఁ బోయరు దాహ మారఁగన్.

అసలీతఁడు విషయాసక్తుఁడే కాఁడని, ఈతని వేదాంతములోని మధువు ధ్యానామృతమని, కాంత ముక్తికాంతయని, విషయోపభోగములు సమాధినిష్ఠావిధానము లని తూచలు పొల్లు పోకుండ అర్థములు చెప్పువారును గలరు. వారీతనిగ్రంథము నుండియే యనే కోదాహరణములు చూపించెదరు. అవి :

శా. రాగద్వేషము లాశ్రయించి విషయభ్రాంతిన్ ప్రవర్తింప ను
ద్యోగింపన్ దగునాజగాన విధి సంయోగంబుచే నెందఱో
భోగాపేక్షను వచ్చిపోయి రిటురే ముందిఁక రానున్న వా
రేఁగన్ జూతురే కాని యొక్కఁడిలపై నిష్టార్థముల్ పొందెనే.

ఉ. నీవు ధరిత్రి కామ విషయేచ్ఛలకై జనియించి తంచు నీ
భావమునన్ దలంపకుము వ్యర్థుఁడవై నశియించి పోదు వే
తావుననుండి వచ్చితివొ తథ్యము నీవన నేమివస్తువో
నీవిపు డేమొనర్చుటకునెంచితివో పరికింపు మెంతయున్.

మ. విషయాసక్తికి లొంగిపోషక మహావేగంబుతోఁ బోవునా
విషరాశింబలె తీవ్రవహ్ని విలసత్ విస్ఫూర్తిమైఁదాల్చి పౌ
రుషలీలన్ మనఁజెల్లు గాని రజమై రోదోంతరాళంబునన్
దృషవాతాహతిఁ బోవునట్టి బ్రతు కిందేలా విచారింపగన్.

అని యెన్నియో జితేంద్రియత్వమును గూర్చిన మహా విజ్ఞాన విషయములను గూడ వ్రాసినాఁడు. ఈతడెప్పుడును ఆసవపానాది దుర్విషయములుగాని కామినీస్వచ్ఛందనాది విషయలంపటుఁడుగాని కాఁడని చరిత్రజ్ఞులు వ్రాయుచున్నారు. ఔరంగజే బీతని గ్రంథమును, హాఫేజు (ఈత డొకసుప్రసిద్ధుఁడైన పారసీకవి) ప్రబంధమును, దేశస్థులెవరును చదువరాదని నిషేధించినాఁడు. జేబున్నిసా (ఔరంగజేబు కుమార్తె) ఈ గ్రంథముల నిరంతరము పారాయణము సేయుచుండెడిది. ఈవిషయమునుగూర్చి ప్రజలౌరంగజేబునడుగ మీారవి యర్థముచేసికొనఁగలిగితిరే చదువవచ్చునని చెప్పి పంపినాఁడు. దీనినిగూర్చి అగ్బరు చక్రవర్తి తన ఆయినీఅగ్బరి అను గ్రంథములో మిగుల ప్రశంసించి 'ఈ మహాగ్రంథములోని యుద్విషయము లనన్య సామాన్యములు; ఎల్లవారు గ్రహించుటకు సాధ్యముగావు' అని వ్రాసినాఁడు. మొత్తముపై నీ పొత్తము చదువుచున్నంతసేపు మనస్సునుచాలా నాకర్షించుచుండును. రసస్వరూప మెదుట దాండవమాడుచున్నదాయని తోఁచక మానదు. ఇట్టి పరివర్తన మింకొక గ్రంథమువలన రానేరదు.

[శ్రీ ఉమర్ అలీషా కవిగారు వ్రాసిన వ్యాసమునుండి-
'భారతి' ప్రభవనామ సం॥ వైశాఖ మాసము]

11

ఋషిసత్తముడైన ఉమర్ ఖయ్యామ్ తత్త్వమును ఫెడ్జిరాల్డు ఆంగ్లమున వ్రాసిన నూఱు రుబాయీలు చదివిన మాత్రమునఁ దెలియ నేరదు. ఇతని తత్త్వమును గ్రహింపవలయునన్న నితని యావద్గ్రంథము పూర్తిగాఁ జదువవలెను. ఇతడు నాస్తికవాది యని కొంద ఱభిప్రాయపడుచున్నారు. కాని యితఁడు అల్లాను, శ్రీ మహమ్మదువారిని అభివర్ణించు పెక్కు రుబాయీలను వ్రాసినాఁడు. వాటి నన్నిటిని శ్రీస్వామి గోవిందతీర్థ (హైదరాబాదు) తన ఆంగ్లానువాద 'ఉమర్ ఖయ్యామ్' గ్రంథమునందు మొదట పేర్కొనినారు. ఉదా॥

**"He is, and nought but Him exists, I know,**
**This truth is what Creation's book will show,**
**When heart acquird perception with His Light,**
**Atheistic darkness changed it to faithly glow,"**

మఱియు,

ఆయీశ్వరుని రహస్యంబు ప్రశ్నోత్తరముల చేత నెన్నఁడు దెలియఁబడదు
వెలలేని ధనమును వెచ్చించి సాధింప సాధ్యంబు గాదు నిస్సంశయంబు
బహువత్సరంబులు ప్రాణంబు లరికట్టి నెత్తురు తపసున నీరుఁజేసి
కష్టముల్ పడకుండఁ గాంచనేరవు బ్రహ్మ వస్తువు నాస్తికాభాసమందు.

ప. 31

ఏను ప్రపంచ పాపములకెల్ల నిదానమునైన, నీదయా
స్థానము నన్ను బూతచరితాత్మునిఁ జేయునటంచు నమ్మెదన్
దీనుల నీవు ప్రోతువని తెల్పితివే యిఁక నింత కంటె నా
దీనత యేమి యున్నది? త్వదీయదయన్ గురిపింపు మీశ్వరా! 300

తలుపులు విప్పవచ్చినను తథ్యము నీవయి వచ్చి విప్పఁగా
వలయును, దారిచూపునెడ బాంధవుఁడై చని నీవె చూపఁగా
వలయును ; గాన నేనెవరి పంచలఁ జేరను ; వారలెల్ల రీ
యిల నశియించి పోయెదరు నీవె స్థిరంబు సతంబు నీశ్వరా. 317

స్థావరజంగమస్థ వసుధాతలమున్, నభమన్, త్రికాలమున్
నీవ ; త్వదన్యమొక్క యణువేనియు లేదు ; మహాత్మ ! నేను పా
పావిలవృత్తినైనను త్వదర్థము దాస్యము సేయుచుందు ; నా
దేవుడవీవు రక్షక ! త్వదీయుఁడ దోషము లేని నాకికన్. 674

ఇతడు నైతికజీవితముయొక్క యాధిక్యమునుగూర్చి కూడ విశేషము గాఁజెప్పినాఁడు. ఉదా॥

"పాపములాచరింపుఁడని పల్కెడు పామరులందు జ్ఞాన మే
రూపుననైన లేదని నిరూఢినెఱుంగుఁడు ; పాపమందు నె
వో పరలోకసిద్ధు లణిగున్నవటంచు వచించుదుర్మతుల్
కాపురుషుల్, మహావ్యసనగాఢతమస్సునఁ జిక్కకుందురే."

ఈతని గ్రంథము జనులను వామమార్గులుగాఁ జేయునని కొంద అభిప్రాయపడుతున్నారు. ఈ గ్రంథము జనసామాన్యమునకై వ్రాయ లేదని ఉమర్ ఖయ్యామ్ నుడివి యున్నాఁడు. ఈ గ్రంథమును ప్రజలు సరిగా నర్థము చేసికొనఁజాలరని ఔరంగజేబు చక్రవర్తి తన సామ్రాజ్యమున నెవరును జదువకూడదని శాసించెను. కాని యీ గ్రంథము నతఁ డెల్లప్పుడుచదువుచుండెడివాఁడు. ఈగ్రంథమునిష్ఠాగరిష్ఠులైనతత్త్వవేత్త లకై వ్రాయఁబడినది. ఇందలి మధువు దయారసమనియు,మానిని ఈశ్వ రుఁడనియు నర్థముచెప్పిరి. అట్లుగాక మధువు మానినులసహజార్థమును

తీసికొన్నను తత్త్వజ్ఞుఁడితని పద్యములందలి చమత్కారమును గ్రహించి యానందించునేగాని నాస్తికుఁడైన వామమార్గమందు బడిపోవడు.

ఇతడు మధువును గూర్చి చెప్పిన కొన్ని పద్యములు చూడుడు.

"ఈ సచరాచరావని వసించు జగంబొక చాయచిత్రమా
భాసము మాయ దీని నిజభావ మెఱుంగనివాడు జ్ఞాన మన్
వాసన లేనివాఁడె ; యిటువంటి యపోహల పొంతబోక నీ
వాసవపాన మత్తమతివై విహరింపుము సంతసంబునన్. ప. 22

ప్రేమార్గప్రతిపాదితంబయిన మాహ్పృత్పాత్రిలో సీధు వెం
తే మర్యాద వహించు ; మత్తనగ రానేరాదు ; కర్మిష్ఠియున్
ధూమాగ్నిన్ సురయుంతపోసిన నభంబున్ ముట్టగామండు ; రెం
డే మార్గంబులు వహ్ని, నీటబడమాయించున్ బృథుజ్వాలలన్. ప. 77

ఈతడు నిర్వదించిన ప్రేయసి యెట్టిదియో చూడుడు :

"చెలి ! భవదాననంబు 'జమషీదు' సుధాకలశంబు మించె ; నీ
తలఁపున జచ్చుతే సుధను ద్రావుటకంటెను మేలు ; నీపదం
బులఁబడుధూళి నాదు దినముల్ వెలుగొందఁగజేయు ; దత్కళా
కలితరజంబులో లవము కాంతిలు కోటిరవిప్రకాశమై" ప. 531

ఉమర్ ఖయ్యాం ప్రాపంచిక సుఖములనువేనోళ్ల పొగడినాడు ; కాని అతడు వాటిని మిక్కిలిగా నిరసించినాడు.

ప్రళయదినమున నీ నీలవదన మెటిగి
ప్రేళ్లఁ గఱచెద వపవర్గ విభవమెల్ల
నైహికసుఖాల కమ్మితని, "యుసూఫు"
నపుడు పది దీనారములకు నమ్మినట్లు. 314

వింటె యొక నీతి చెప్పఁగా నుంటి, నోరుల
మాయసేయకు స్వార్థంబు మాటుపఱచి
యిహ మశాశ్వత మిట్టి యైహికము కొఱకుఁ
బారమార్థికపదవి గోల్పడగవలదు. 556

నీవు ధరిత్రిఁ గాదువిషయేచ్ఛలకై జనియించినట్లు నీ
భావమునన్ దలంపకుము, వ్యర్థుఁడవై నశియించి పోదు ; వే
తావులనుండి వచ్చితివొ తథ్యము నీవననేమి వస్తువో
నీవిపు డేమొనర్చుటకు నెంచితివో పరికింపు మెంతయున్.

ఈ గ్రంథము చిన్ననాటినుండియు చదువుచు, నైతికజీవనము సలుపుచు, ఈశ్వరభక్తి పరాయణులై మహాజ్ఞానమును బడసినవారు కలరు. ఏది యెట్లున్నను జదువుతక్కువవా రీగ్రంథమును జదువుట సరికాదు. మావి చిగుళ్లు కోకిలకును వర్షబిందువులు చక్రవాకములకు నేర్పడినట్లు ఉమర్ ఖయ్యాం కావ్యము తత్త్వవేత్తలకై వ్రాయఁబడినది.

ఉమర్ ఖయ్యాం క్రీ॥ శ॥ 1048వ సంవత్సరము మెయి నెల 18వ తేదీ బుధవారమునాఁడు సూర్యోదయ సమయమున నైషాపురమున జన్మించినాఁడని శ్రీస్వామి గోవిందతీర్థ నిర్ణయించిరి. ఉమర్ ఖయ్యాం పూర్తిపేరు "గయాత్ ఉద్దీన్ అబుల్‌ఫతా ఉమర్ బిన్ ఇబ్రాహీం" ఇతని బిరుదు "హకీందస్తూర్ ఫిల్ సఫ్ ఇమామె ఖురేశాన్, మాలికల్ హుక్మ హాజ్జతుల్ హఖ్." ఉమర్ ఖయ్యామ్ ఆస్తికుడు, దీక్షాదక్షుఁడైన ఇస్లాం మతస్థుడు. (**'Omar was a true believer in Islam'**) ఇతడు అనేక భాషలు నేర్చినాఁడు ; అనేక శాస్త్రములు చదివినాఁడు. ఇతఁడు అరబ్బీ భాష కూలంకషముగాఁ జదివి యందు మహాపాండిత్యమును సంపాదించినాఁడు. ఇస్లాం మతగ్రంథమైన 'ఖురాన్' ను అనేక స్వరములతోఁ

జదివి యప్పటి అరబ్బీపండితులను గెల్చినాఁడు. ఆనాఁటి పారశీక చక్రవర్తియైన సుల్తాన్ మాలిక్ షా యితనిని 'నాదిమ్' గా నెంచుచుండెను. 'నాదిమ్' అనగా వివిధ భాషావిశారదుఁడు. సకలకలాకోవిదుఁడు, నానావిధశాస్త్రపండితుఁడు, సర్వజన పూజితుఁడు, నిష్ఠాగరిష్ఠుఁడు, మతాచారపరాయణుఁడు, చతురంగాది యాటలందాసక్తుఁడు, గానాదిలలితకళలందు నిపుణుఁడు, విశ్వసనీయుఁడు, అమాత్యపదవికి నర్హుఁడు, అయి యుండవలెను. ఉమర్ ఖయ్యాముసం దీవిశేషగుణములన్నియు కేంద్రీకరింపఁబడి యుండెను. ఇతడు జనులతో విశేషముగా సంపర్కము పెట్టుకొనక పవిత్ర జీవితమును గడపెను.

ఇతఁడు క్రీ॥ శ॥ 1100 సంవత్సర ప్రాంతమున మక్కా నగరమునకు 'హజ్' చేయుటకై వెళ్ళెను. అచ్చటినుంచి తిరిగి వచ్చునపుడతడు బాగ్దాద్ పట్టణమునకు వెళ్ళెను. అప్పటికే యతని కీర్తిచంద్రికలు దశదిశలు వ్యాపించుటచే నాపట్టణపు జన లితని రాకవిని పురమునంతయు నలంకరించి యితనిని మిక్కిలి గౌరవించిరి. ఇతఁడు 1103 సం॥ ప్రాంతమున యాత్రముగించుకొనివచ్చి ప్రాపంచిక వ్యవహారములతో సంబంధము విడిచి యేకాంతవాసమున శేషజీవితమును గడపెను. ఇతఁడు తనయంత్య దినమునవఱకు మిక్కిలి యారోగ్యవంతుఁడై యుండెను ఇతఁడు మరణించునాఁటి యుదయమున 'అవిస్సినా' యను అరబ్బి తత్త్వవేత్త వ్రాసిన'అష్షఫా'అను గ్రంథమును జదువుచుండెను అందు 'ఒకడు మఱి అందఱు' అనే ఘట్టము వచ్చినప్పుడు గ్రంథపఠన మాపి యుత్తములైన మతాచార్యులను బిల్వనంపి తనయాస్తి యావత్తు వారికప్పగించెను. ఆ దినమంతయు నతఁడు ఉపవాసమున గడపెను. ఆ రాత్రి 'నమాజ్' చేసిన తరువాత శిరస్సును నేలకుమోపి "ఓ ప్రభూ!

నాయీయాపచ్ఛక్తి నుపయోగించి నిన్నువీక్షించుచున్నాను. నన్ను క్షమిం పుము........" అని తుదిప్రార్థనలను సలిపెను.

ఉమర్ ఖయ్యాం హిజరి 516 (క్రీ॥ శ॥ 1122) మొహరం నెల 12న తేదీ గురువారమునాఁడు దివి సలంకరించెను. నైషాపురమున మహాత్ముఁడైన ఉమర్ ఖయ్యామ్ గోరీపై ప్రకృతి యెల్లప్పుడు పుష్పములను గురిపించుచుండెను.

.... .... .... .... .... .... .... .... .... ....

శ్రీ ఉమర్ అలీషాకవిగారీ గ్రంథమును 1926-28 సం॥ల మధ్య ఆంధ్రీకరించిరి. వీరి కప్పుడు లభించిన పారశీక మూలగ్రంథమునందు 720 రుబాయీలవరకుఁగలవు. అందు శ్రీకవిగారు 714 రుబాయీలు తెనిఁగించిరి. ఈ గ్రంథము వీరిజీవితకాలమున నచ్చుపడు భాగ్యము లేకపోయినది. వీరి జీవితకాలమున నచ్చుపడనిలోపము లేకపోలేదు; ఏలయన శ్రీకవిగారు తమ గ్రంథము లచ్చగునప్పుడుసవరించుచుండిరి. వీరీగ్రంథ మాంధ్రీకరించినప్పు డనేకపద్యము లనేకపత్రికలందు ప్రకటింపఁబడినవి. అందుకొన్ని బొంబాయి వాస్తవ్యులు, పారశీకులు, శ్రీ జంషీదు జీ. ఇ. సక్లత్ వాలాగారు చూచి శ్రీ కవిగారితో ఉత్తర ప్రత్యుత్తరములు నడపి కవిగారి ప్రియమిత్రులైరి.

ఉమర్ ఖయ్యామ్ వ్రాసిన పద్యములు రెండువేల వఱకు కల వందురు ఇప్పటికి 1360 లభ్యమైనవి. అందు 1096 సరియైనవని శ్రీ స్వామిగోవిందతీర్థ నిర్ణయించిచాటినన్నిటిని ఆంగ్లమునను, మహా రాష్ట్రమునను అనువదించిరి. శ్రీకవిగారి జీవితకాలమున తక్కిన రుబా యీలుగల పుస్తకము లభ్యము కాకపోవుటచే వాటిని తెనిగించు నవ కాశము లేకపోయినది.

శ్రీ ఉమర్ అలీషాకవిగారి ఆంధ్రీకృత ఉమర్ ఖయ్యామ్ పద్య కావ్యమును గూర్చి పెక్కురుమహామహులు విశేషముగా పొగడిరి. ఈ గ్రంథమును చదువునప్పుడు ఉమర్ ఖయ్యామ్ శ్రీఉమర్ అలీషా కవిగారి రూపమున వచ్చి ఆంధ్రీకరించెనా ! యనిపించును. ఉమర్ ఖయ్యామ్ తత్త్వామృతమును ఆంధ్ర ప్రజల కందజేసిన శ్రీ ఉమర్ అలీషాకవిగారు ధన్యులు.

కబీర్ షా
9-7-53



# టిప్పణి

పద్యము 54 ధైర్యంబుగా=(ఒప్పు) దైరంబుగా, దైర్=ఆశ్రమము
55 జంషీదు=పారశీక చక్రవర్తి, బైరాం=పారశీక చక్రవర్తి.
64 తూసుగోటు=తూసునగరపు గొప్పకోట
కైకావూస్=పారశీక చక్రవర్తి.
100 నూహునౌక=నూహు అను ప్రవక్త జలప్రళయము వచ్చినప్పుడు ఒక నౌకను నిర్మించుకొని రక్షించుకొనెను.
141 హాతిము=ప్రసిద్ధిగాంచిన దాత హాతిమ్‌తాయి,
రుస్తుము=పారశీక వీరుడు.
166 పోసన్=ఒక అందమైన పుష్పము దాని దళములు నాలుకలవలె నుండును.
176 కాబా=మక్కా ప్రార్థనాలయ మందలి పవిత్ర శిల.
202 బగదాత్, బలఖ్=ముస్లిం రాజ్యముల ముఖ్యపట్టణములు.
221 నమాజు=ప్రార్థన.
222 మహమ్మద్=గజనీమహమ్మద్. అయాజ్=గజనీమహమ్మదు బానిస (రాజు పేద అని అర్థము)
314 యూసూఫ్=యూసూఫ్ ప్రవక్త, ఇతనిని తండ్రాలు పట్టుకొని పది దీనారములకు విక్రయించిరి.
351 కైకుసరో=పారశీకదేశపు చక్రవర్తి, జమషీద్ చూ॥ 55.
మహమ్మద్=గజనీమహమ్మద్.
380 హసనెగావూదీ=(ఒప్పు) లహచెదావూదీ=దావూద్ ప్రవక్త ఇతని కంఠస్వరము మిక్కిలి మధురముగా నుండెడిది.
401 ఖిజిరు, ఇలియాస్=ప్రవక్తల పేర్లు.
436 షాబాన్, రజ్జబ్బులు=ముస్లిం నెలలపేర్లు. ఈమాసములు పవిత్రములుగా ఎంచుదురు. ఈ మాసములందు ఉపవాసము లుండెదరు.

456 బెనఫెషా=(బెనఫ్షా) ఇది ఒక అందమైన పుష్పము. కాని దీని మధ్య గులాబీకివలె పసుపురంగుగా ఉండదు. ఇది ముకుళించిన ట్లుండును.

464 బుల్‌బుల్=పిగిలిపిట్టవంటి అందమైన పక్షి.

487 సరు=సర్విచెట్టువంటి ఒకఅందమైన చెట్టు ఇది నిలువుగా నుండును.

512 పరహాద్, షిరిన్=గాఢముగా ప్రేమించుకొన్న పారశీక ప్రియులు.

532 నూహునౌక=చూడు. ప. 100

550 సీముర్గ్=ఆకాశముపై విహరిస్తు నివసించు ఒకజాతి పక్షి.

553 అబూసయీర్=ఇతడొక గొప్పఋషి, మరియాంబు=ఏసుక్రీస్తుతల్లి ఏసుక్రీస్తు జన్మసమయమున ఈమె ఒక యెండిన ఖర్జూరపుచెట్టు క్రింద కూర్చుండెను, అప్పు డావృక్షము చిగిర్చి, కాచి, పండిన ఖర్జూరములను ఆహారముగా ఆమెపై పడవైచెను.

555 మోమిన్=ఈశ్వర యేకత్వమున నమ్మకము గలవాడు.

559 మసీదుముతవల్లి=మసీదునందు ప్రార్థనములు చేయుటకై ఏర్పరచ బడ్డవాడు.

578 జంభూవరుపాత్ర=జంషీదు అను చక్రవర్తి పానపాత్ర. ఇం దితడు ప్రపంచమందు జరుగు విషయములను చూడగల్గెడువాడు.

610 సులేమాన్=ఇతడు గొప్ప చక్రవర్తి. పంచభూతములపై యితనికి అధికారము కలదని ప్రతీతి.

624 జమ్మను పానపాత్ర=చూ. ప. 578

634 యూసూఫ్=ఇతడు మిక్కిలి సౌందర్యవంతుడైన ప్రవక్త.

683 జమషీదుని రుక్కలశంబు=చూ. ప. 578

665 జీసస్=ఏసుక్రీస్తు. ఈయన మృతులను బ్రతికించెడువారు.

# పీఠిక

ఉమర్ ఖయ్యామ్ మొదటి కూర్పు 1949వ సంవత్సరమున జరిగెను. అప్పుడు ప్రభుత్వమువారి అనుమతిలేకనే కాగితములు లభ్యము కాకపోవుటచే 500 ప్రతులు మాత్రమే ముద్రింపబడినవి. అవి అచిరకాలముననే చెల్లిపోవుటచే తిరిగి ఈ సంవత్సరమున ముద్రించినాము. మొదటి ప్రచురణమునకై జ్ఞానసభాసభ్యులు మహాయోగిని శ్రీమతి అల్లూరి సత్తెయ్యమ్మగారు (లంకలకోడేరు) ధనసహాయము చేసిరి. ఈ రెండవ ప్రచురణము శ్రీ ఉమర్ అలీషాకవి గ్రంథప్రచురణ సంఘమువారిచే జరిగినది.

ఈ గ్రంథప్రచురణమందు తోడ్పడిన శ్రీ కవిగారి బాల్యస్నేహితులగు కవిరాజహంస శ్రీ వోలేటి పార్వతీశ్వరకవి గారికిని, మొదటి కూర్పునందలి అచ్చుతప్పులు సవరించిన శ్రీ బండారు తమ్మయ్యకవి గారికి మా కృతజ్ఞతా పూర్వకములగు వందనములు.

శ్రీ సరస్వతీ ముద్రణాధికారులగు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావు గారు శ్రీ కవిగారియెడల ఆదరాభిమానములు గలిగి ఈ గ్రంథమును జాగ్రత్తతో ముద్రించి యిచ్చిరి. వీరికి మా అభివందనములు.

శ్రీ కవిగారు తెనిగించిన రుబాయీలు 714, కొన్ని పాఠాంతరములున్నవి. వాటికి కూడా సంఖ్య ఒసగుటచే 720 పద్యములుగా ప్రకటింపఁబడినవి, వచ్చే ముద్రణమందు సవరించెదము.

ఇట్లు,

మదీన్ కబీర్‌షా

వారణాశి సత్యనారాయణశాస్త్రి

కార్యదర్శులు

శ్రీ ఉమర్ అలీషా కవి

గ్రంథ ప్రచురణ సంఘము

పిఠాపురము

9—7—53

మ. వరకళ్యాణ గుణుండు శ్రీ మొహియదీన్ బాష్యాగురుండాత్మవి
ద్యరహస్యేశ్వర జీవభావవిదు డధ్యాత్మైకయోగప్రభా
కరుకల్లోల వికీర్ణ ఘోరగుణ సంఘాతోరు సంసారసా
గరసంచార విదూరుడాతనికి సత్కళ్యాణి చాన్బీమహావరలక్ష్మి.



"బ్రహ్మ ఋషి"

శ్రీ మొహియద్దీన్ బాద్షా

శ్రీ చానిబియాంబిక

# BRAHMARISHI
# DR. UMER ALI SHAH
## TELUGU POET.

"A really great man has ideas always greater than himseif" This is more true of Dr. Umer Ali Shah, the immortal poet of the Telugu language, than anyone else. He was born in March 1887 in Pittapuram, a town in the Andhra State of India.

Though he had no proper education he developed a great taste for Telugu which was not his mother tongue, and began writing verse when he was a teenager. The qenius of the boy was at once recognized by Telugu scholars and his fame grew as a poet by the time he was 18.

He wrote plays in Telugu which can only find a parrallel in Shakespeare's. Many Hindu poets and scholars began to pay tribute to this Muslim poet of the Telugu language and regarded him as a itern-poet in the Carlylian senes of the word.

His writings took a new shape in all branches of literature. Besides poetry he wrote novels, plays and essays which excelled the writings of the renowned Telugu scholars of the twentieth century, and so on his works found a permanent place in the annals of Telugu literature.

Today he stands alone like a pole star guiding those who are interested in Telugu literature, and he is acknwledged as their great master who brought a change over literary forms in Telugu.

He also made fresh departures in almost every form of literature. His poetry has no parallel In Telugu, despite the great writers whose works no doubt come nearer to his standard, and yet, lack that charm and cadence, lucidity and masterly style both in narration and criticism.

His vast knowledge of Sanskit in which language also he was a scholar, contributed effectively towards his prodigious efforts in Telugu. With his contribution Telugu leterature would be nowhere as rich as it is today.

What Shakespeare is to the English, what Dante is to the Italians, what Dr. Iqbal is to Urdu speaking Muslims, Dr. Umer Ali Shah is to the Hindus of Andhra.

His writings have no other parallel, as I stated before, in any other literature of the world, becase they are the creation of one man. He had to his credit such a vast bulk of written work in all literary forms that no one author in English or any other language could have produced.

But alas ! It is confined to Andhra, and Andhra only, and its great merit lies hidden outside the state even in India, not to speak of foreign countries.

Yet his reputation, by a curious twist of fate, soared aloft.

In 1936 the International Academy of America confirmed upon him the degree fo doctor of literature for his thesis in Telugu. For a man with no university education to obtain such a high degree from the new world is certainly a matter of pride to the individual as well as to the province in which he was born

His was no ordinary intellent, thought he knew little English when compared to his ability in Telugu and Sanskrit.

His works in Telugu are clear evidence of what he struggled for, lived for and clied for. He was out and out a nationalist purposed to reform the people around him culturally, socially, economiclly and politically, and accordingly he rendered youngman service to humanity at large during that little span of his meteoric rice.

He did everything in his capacity. His School of thohght pervaded all his works and helped remove the dogmatic ideas and beilefs of the ignorant and the illiterate and led them to the supreme path of glory and virtue.

This won for him a saintly honour and he came to be regarded by all Hindus as a saint His writings spelled the qualities of a great seer

Though he was a Muslim, the magnanimity of the Hindus could not deprive him of what he was in truth, nor did they (the Hindus) leave him in the lunch, but nursed his genius tenderly till it gave them the best of the life they needed. And he did not disappoint them.

Dr Umer Ali Shah was alse a social reformer in his own environs He had reformed the Hindus' customs and manners by dint of his profound knowledge of Sanskrit and the Hundu philosophy which he had mastered.

He knew more them any Hindu scholar of his day. He could recite slokas so fluently and so correctly interpret them in Telugu that the pundits were stunned at his mastery.

All Hindus of Andhra admit that he had surpassed all in every branch of Telugu literature and he came to be regarded as the only eminent poet in modern times in that language.

His writings created a sensation throught Telugt speaking areas both within and outside Andhra State. Indian universities adopted his works in their curricular for degree classes and no library is without his books.

His political career overlapped his literery one and he was so engrossed in both that it is very difficult to think of the one without the other.

During the last decade of his life his literary fame was at its highest. while his political activities continued till his daeth.

He had to make mady trips every year from south to north to be presence in the Legislative Assembly at Delhi from the time when he was elected independently in 1935. From them on he used to repair to the hill-tops of Simla to invoke the muse and produce his master-pieces in Telugu literature, even in his political travails.

Apart from his literary activities, his political career was also remarkable. He was known as a good politician. Mahatma Gandhi accepted him as a man with sound political ideas when he was in Congress upto 1935.

He worked for the nation unhesitatingly during the Khilafat movement and was held in high esteem by all the national leaders of those times. His assemble speeches contained sound principles of integrity and magnanimity and therefore saw the press of his day.

Besides, he worked for the good of the country delivering lectures everywhere irrespective of religion, cast or creed with a

view to promoting goodwill amongst the people. for which he was adored by Muslims and Hindus alike.

When he was preoccupied with political affairs and when his literary fame was at its zenith, he was suddenly shaken by a tragic event. His beloved wife Akbarbebi died Delhi in April 1935 when he was attending the sessions.

This shock are into his vhry vitals and he breathed his last in January 1945 after a cerebral hemorrhage in a village of Narsapur.

His body was brought for burial to Pittapuram where every year congregational meetings are held for one week by his 20,000 disciples including eminent poets and scholars of Andhra State in honour of their great hero-poet and he lies forever enshrined in their hearts.

**—M. N. HUDA**



క. జగమున ధర్మము నెల కొ
ల్పఁగ నీశ్వరుఁ డొక్క దివ్యవ్యక్తినిఁ బంపున్
యుగ యుగమున నాతఁడె యీ
సగుణాత్మకుఁడైన సారసాక్షుఁడు గంటె.



# "బ్రహ్మఋషి" ఉమర్ అలీషా

చ. అణువులయందు సుందర యజాండమునందు హిమాంబు సూక్ష్మపుఁ
గణములయందు సూర్యశశికాంతులయందు పరాత్పరా భవ
ద్వినుత విలాసవైఖరి ప్రవీణతఁ దోఁచుచు నున్నదింకనిన్
గనుగొన లేనిచో కనులు గల్గిన నంధులుగారె మానవుల్.

# పరంజ్యోతి

పడిన కష్టాలు పాటువంబలతిగాక !
సడలిపోయిన సౌఖ్యాలు స్మరణ రాగ
మాశిపోయిన మాటలు మరపురాక
పాటపాడిన పదములు పలుకలేక
వెడలిపోయిన కాలంబు వెదకుచుంటి
వెతుకుచుంటి నామరుగునే వెతకుచుంటి
తెలుసుకొంటి నామరుగునే తెలుసుకొంటి
తిరిగి కాలంబురాదని తెలుసుకొంటి (జన్మ)
లేదు పరతంత్రమికనాకు లేనెలేదు ;
లేదు నాయన్న మౌఢ్యంబు లేనెలేదు
స్వార్థమున నీప్రకృతి నాకు స్వస్తి జెప్ప
భ్రాంతిలోగన్న విషయ విభ్రాంతిగాగ
పోవుచుంటి నాదారినే పోవుచుంటి
కాననంబులో పురములో కానరాని
ఆ అయోమయ మధ్వాన్నమైన దారి
ఆ ప్రళయకాల దంధయ్యమైన యట్టి
చిమ్మ చీకట్లు చెంగట చేరి చేరి
జరిగిపోయె నహస్సులు జగములోన
దాటిపోయెను మెన్నులా దారిలోన
స్వర్గ నరకాల వీధులాశ్చర్యముగను
దారులివ్వగ వాటిని దాటి నిలచి
చూచినా నది నిజముగ శూన్యజగము
కలతబడి మనో దుఃఖాన గలయజూడ
అంతదూరాన నేదియో నవతరించె
అందులో రూపమేదో నాకానుచుండె
అందు బ్రహ్మాండములును రూపొందుచుండె
ఎవరిదారూపు నాకపుడెరుక బడియె
అదియె నా గురుని స్వరూపమవధిగాను
అతడె అఖిలలీషుడు అది నిజంబు

అదియు ప్రేమైక రసరూప మవ్యయంబు
వెలువడెను గాదెనందుండి వెలుగదేదొ
నిండెనా వెల్గు జగముల నిండె నిజము
నిండె నావెల్గు నాలోన నిండె నిజము
నిండి నాలోన జతనావ మండిపోవ
నిలిచె సంతృప్తిం నాలోన నిలిచిపోవ
ఇమిడె ప్రమదంబు నాలోన నిమిడిపోవ
తెలిసె జగములు "నేన"ని తెలిసిపోయె
నేనె "విశ్వంబు" విశ్వంబు నేనె నిజము
నిజము యీ దృశ్యమంతయు "నేనె" నిజము
గగనములలోన నారూపె గానుపించె
భాస్కరునియందు నారూపె బరగుచుండె
సలిలమందును నారూపె సాగుచుండె
ఈ వసుంధర నారూపె యనగుచుండె
అరయ వాయువులో నిండినదిగొ దోచె
అదిగో వైశ్వానరుని నిండెనదిగొ చూడు
ఎన్ని చెప్పదు సర్వంబు "నేను" గాను
సృష్టినంతయు నాలోనె చూచినాడ
ఇదే పరంజ్యోతియన నొప్పు నీ వెలుంగు
ఇదియె యోగులు గన్నట్టి జ్యోతి సుమ్మి
నిలచిపోదు నీ జ్యోతి నేనెప్పటికిని
నిలచేపోయి నీ జ్యోతి నేనెప్పటికిని
రాను మిముజూడ వాంఛనే రాను రాను
తిరిగివచ్చెడి నాశలు తీరిపోయె
నెడలి వచ్చిన మాటలు వేరు లేవు
లీనమగుదు నీ జ్యోతిని నేనుగానె !
మరచిపొండింక నారాక మఱచిపొండు
వదలివేయుడు దర్భలు వదలునట్లు
విడచివేయుడు ధారను విడచునట్లు
ఇట్లు "హుస్సేనుషా కవి ఎరుక జెప్పె !



"బ్రహ్మఋషి" శ్రీ హుస్సేన్ షా
శ్రీ విజ్ఞాన విద్యా పీఠాచార్య
**పి ఠా పు ర ము**

# శ్రీ విజ్ఞాన విద్యాపీఠాశయము

శ్రీ విజ్ఞాన విద్యాపీఠమహర్షి జ్ఞానవేదమూర్తులు శ్రీశ్రీ హుస్సేన్ షాకవి కృతంపాతత్వసంహితము యీశ్వరవాణిగా పలికి ఈశ్వరవాణిగా విశ్వమానవకోటికి శ్రీ విజ్ఞాన విద్యాపీఠ మహాసభాసభ్యులకు అమితానందముగ చేయుచు భౌతికవిధానమందు అనేక జీవిత విశేషముల కులోనై విరక్తిభావము శారీరకముగా కలుగుటవలన మానసిక విశేషమును, పురస్కరించుకొని ధర్మప్రభోధమునుగావించి మానవుని మానవుడుగా మార్చుటయే యీ ధర్మముయొక్క లక్ష్యము. అనగా శ్రీ విజ్ఞాన విద్యాపీఠముయొక్క విశేషము. ఇది సృష్టివుద్భవించి, యుగయుగాలుగా, తరతరాలు సృష్టిలో శాఖోపశాఖలుగా ఏకేశ్వరోపాసనచేయుచు, కృతి, స్మృతిలో స్మృతిగాపాడుచు జాతిమత విచక్షణలేక యదార్థమైన రసస్వరూపము శ్రీపీఠాచార్యునిమంత్రప్రభావముచేత జీవిఆత్మపరిణామము అభౌతికమైనటువంటి దృశ్యరూపములో చిత్రించుటయే శ్రీ విజ్ఞాన విద్యాపీఠముయొక్క లక్షణము. దాని యదార్ధ ధర్మవిషయము. ఇదిఆచరించి అనుసరించినవారికి అనుక్షణము లోకవిషయవాంఛలను దూరముచేసి సంకల్పసిద్ధిఁజేయును.

## పద్యరత్నములు

1) సీ॥ తరతరంబులనుండి తాతతంత్రులుమున్న
విజ్ఞాన విషయంబు వివిధవిధము
మణులు మాణిక్యముల్ మదిని బడయునట్లు
సర్గపదార్థద్వయము సంగ్రహించి
వివిధదేశంబులు వెడలి సభ్యకులము
వినుతిగావించి రావిశ్వమూర్తి

ఆధ్యాత్మవిద్యల కాకరం బగు మహా
జ్ఞానశక్తిని తపశ్శక్తి బడసి

తే॥ గీ॥ ధర్మమననేమి యో దెల్పి ధరణికెగసి
అమృతకరులై బోధకాధ్యాపకులుగ
నుండి పీఠికాపురమందు నోలగముల
ప్రభువులైయుండి రాహి "షా" వంశభవులు.

2) ఉ॥ అన్నిటికన్న గొప్పమహిమాస్పదమైన మహత్మ్యముండు, నిం
దున్నది ఆ "షతత్వ"మనె నుత్తమగ్రంథము దైవదత్తమై
సన్నుతమై పవిత్రమయి శాసనమై సచరాచరంబులో
నున్న రహస్యముల్ దెలుపుచున్నది యీశ్వరవాణిసృష్టికిన్.

3) తే॥ గీ॥ ఇట్టి విజ్ఞానమతము నర్థించి ప్రేమ
పాఠములునేర్పి విజ్ఞాన ఫక్కి గూర్చి
మానవోద్ధార కుండన మహినివెలసి
మలినములుమాపె "హుస్సన్‌షా" మౌనివరుడు

4) తే॥ గీ॥ ఏదొవేవెల్గు షాతత్వ నేగుదెంచి
అందులోన హుసనుషా కృతవతరించి
వచ్చినిలిచె తేజంబుగ వసుధయందు
దెచ్చితిని నీకిదేయని తేటపరచె.

5) తే॥ గీ॥ వేలు లక్షలు శిష్యులు పాలుగూడి
ప్రజ, లజ్ఞానతిమిరంబు బారద్రోలి
భద్రమార్గమే కేశ్వరోపాసనంబు
ననుచు చాటిరి హృదయధకానుభూతి.

పంచరత్నములు సమాప్తము.

(పీఠాచార్య)



# శ్రీ విజ్ఞాన విద్యా పీఠాచార్య

## పి ఠా పు ర ము



భావి పీఠాధిపతి



# శ్రీ విజ్ఞాన విద్యా పీఠాశ్రమము

పి ఠా పు ర ము

# ఉమర్ ఖయ్యామ్.

౧

ఎక్కడనుండి వచ్చితిమొ యెక్కడి కేఁగుటకౌనొ యెవ్వరీ
నిక్కమెఱింగి చెప్పుటకు నేర్చినవారలుగారు ధాత్రియం
దక్కట దీనికిన్ మొదలు నంతము నిట్టిదటంచుఁ దోఁచ దీ
ఫక్కిని జీవయాత్రకయి వచ్చుచుఁ బోవుచు నుంటి మెంతయున్.

౨

ఎవ్వరివల్లఁ గాఁ దల యతీంద్రియమన్ దెర దాఁటిపోవ నిం
దెవ్వరు నీరహస్య మిదమిత్థమటంచును జెప్పలేరు ముం
దివ్యసుధాంతరంగ నిజ మృద్గృహ గమ్యతలంబు; కాని యీ
నెవ్వగ పెద్దగాథవలె నివ్వెఱఁగొల్పును జెప్పవచ్చినన్.

౩

ఇదియే సత్యమటన్న వాదతరు వెంతే వృద్ధికాలేదు; ఈ
పదమం దెవ్వరు నెగ్గఁజాల రొకపల్వాన్ శాంతి హస్తంబు మో
పి దినా లాఱడిఁబుత్తు నిన్నటివలెన్ విభ్రాంతి, ఆపైన నేఁ
టి దినం బట్టులెపోవు నీస్థితులు నిట్లేయుండు నెన్నాళ్లకున్.

౪

శరధినిబోలు విద్యయును జ్వాలనుబోలిన జ్ఞానదీప్తియున్
బరఁగినవార లీ నిశిత భాసుర గాఢ మహాంధకార బం
ధురతర మార్గమున్ గడచు త్రోవనెఱుంగక కల్పనా కథా
భరిత వివాదవీచికల పాలయి ప్రాణము వాసి రార్తులై.

౫

చదివితి రేఁబవళ్లెదఁ బ్రశాంత నితాంతక సంఘటింపఁ ద
త్పదములలోనఁ గొన్నిటి యథార్థముతోఁపక పెద్ద సంశయా
స్పదముగ నుండిపోయినవి భావమునం దవి పోల్చిచూడఁగా
మొద లోకటైన నేరవని బోధపడెన్, మఱి చెప్పవచ్చినన్.

౬

చుక్కలఱేఁడు చుక్కలును జూడ్కికి సొంపులునింపు నింగిపైఁ
జక్కని వేవెలుంగు విరసంబగు నీ ప్రకృతిస్వభావముం
దొక్కటియున్ యథార్థ మననోపదు నూహనుబుచ్చి చూచినన్
జిక్కదు భ్రాంతిజన్యములచేఁ జెడరాదు జడత్వ మేర్పడన్.

౭

సొగసు సువాసనాకలితా శోభితవైఖరి సౌకుమార్య మిం
పగు వదనాంబుజాత విభవాప్తి సలాకనుబోలు తీరుననున్
మిగిలినవన్ని వన్నియల మీఱెడు నట్టులనున్న నన్ను మృ
త్యు గరిత యేలదార్చి పెనుధూళి గృహాన నలంకరించెనో.

౮

నాకముజీవరాశి విడనాడి రయంబుగవచ్చి ధాత్రి మా
యాకృతి నాలు గైదులను నాటిటు నేడిటు విభ్రమించి తీ
వేకడనుండి వచ్చితివొ యేకడ కేఁగెదొ చెప్పలేవు నీ
కా కథలేల మద్యమును హాయిగఁద్రావుము నిత్యతోషివై.

౯

ఉసురువిడిచి పైలోకాల ముసుఁగునందు
మాయమై పోయెదవు గాన మధువుఁద్రావి
కలదినంబు లానందానఁ గడుపు, మెచటు
నుండివచ్చితొ యెటు కేఁగనుంటి వొక్కొ.

౧౦

పాఠాంతరములు:_

విను మును ప్రాణులుండిన పవిత్రతలంబును వీడి యోడి మే
దిని కరుదెంచి యీ తెరలు దీర్చిన యీశ్వరనాటకాన భ్రాం
తిని బడిపోయి తీ వెచటుఁ దేలెదొ యేమిటియానొ యావలన్
గనుగొనలేవు గాన కలకాలము మద్యముఁ ద్రావి పుచ్చుమా.

౧౧

అది నికేతనంబు విడనాడితివా పరమాప్తతత్త్వ వి
ద్యాదయితంబు నైన తెరకావలఁ బోయెద వంతెకాని నీ
వేది పరిత్యజించి యిటు కేఁగితివో యిటునుండి యేదిశన్
బోదువొ నర వీ మధువు పొంతను హాయిగఁబుచ్చు కాలమున్

౧౨

జీవ రహస్యమంతయు నశేష మెఱింగితి; చావులోన నే
దో విభవంబు నున్నటులు తోఁచె స్వతంత్ర సజీవుఁడైన నీ
వీవిషయం బెఱుంగక ముగించిన మృత్యువు తేపు వచ్చినన్
నీ వెటనుందువో బ్రతుకు నిష్ఫలమై చను నస్వతంత్రతన్.

౧౩

ఆ విధి నన్నుఁ దెచ్చి జగమందున లాభము పొందలేదు వా
పోవఁగ నన్నుఁజంపికొని పోయి గడించిన గొప్పలేదు దా
నీ విధి చావుపుట్టుకల నేటికిఁబెట్టెనో తెచ్చి తీసికోఁ
బోవుటలో రహస్యము ప్రబోధము సేయరు నేఁటి కెవ్వరున్.

౧౪

పాఠాంతరము :-

పాయక నన్ను ధాత్రి గొనివచ్చిన స్రష్టకు లాభమింత రా
దాయెను నన్నుఁ జంపి విగతాసువు జేసినఁ గీర్తి హెచ్చి పో
దాయెను నాతఁ డిట్లిశ్రమలయందు గడించెడిదేమి జీవు లీ
చాయను బుట్టుచున్ దిరిగి చచ్చుటలో ఫలమున్నఁ జెప్పుడీ.

౧౫

హతవిధి! తొల్లి యీతనువునం దిడి నాకొక యస్వతంత్రతా
స్థితి కడుఁగూర్చి; తీ బ్రతుకు చిత్రముతప్ప మఱేది నాకు స
ద్గతి గనరాక యుందె నిజ కాలముఁబుచ్చితి నెట్లు పుట్టుటన్
బ్రతుకుటఁ జచ్చుటన్ దెలియ వచ్చుటలేదు రహస్యమేమిటో.

౧౬

అవ్యక్తంబను నీట నాటఁబడె నా ప్రారంభ బీజంబు దుః
ఖ వ్యాజాగ్ని నొనర్చెనా యుసురు లోకంబందు నేనొక్క ఝుం
ఝూ వ్యామోహిత మారుతంబువలె సంచారంబుగావింతు మ
ద్దీవ్యన్మృత్తిక నేధరన్ గొసిరొ యుద్దేశింపరా దింతయున్.

౧౭

విధి చైదంబు లెఱుంగనేరని జనుల్ విభ్రాంతి మిథ్యల్ సుధా
మధురోక్తిన్ వివరించి ప్రాచదు వసంబద్ధంబుగావ్రాసి యా
విధి విజ్ఞాన రహస్యసంపదలు సుప్తిన్ద్రోసి కై చేసి, సీ!
వృథగా జీవముఁ బాసిపోయిరి ధరిత్రిన్రోసి నిద్రింపఁగన్.

౧౮

మరణ సుషుప్తిలోపల నిమగ్నతఁ బండినవార లింక నీ
మొఱ వినరా రదేదయిన మూర్ఖునికై వడిఁ జేరి గోరికిన్
శిరమిడి యేవరాలకొ యిసీ! మొఱవెట్టెదు వారలే యగో
చరు లయిపోయినారు, నిను సాకఁగ వత్తురె గోచరింపఁగన్.

౧౯

మరణ రహస్యమున్ దెలియుమార్గము కష్టమటన్న నింక ముం
దర కొకరైన దొర్లి సదనంబునుదాఁటి పదంబు మోపలే
రురుతర సాధకుండొ గురువో యగపించిన నీరహస్య మిం
తెఱుఁగక లొంగిపోయి రిదియే కనుఁగొంటి విచిత్ర మంతటన్.

౨౦

అక్కటు వీఁగిపోవ నిఖిలార్థము లెందఱో మిత్త్రిచేతిలోఁ
జిక్కి నశించినారు దివిఁజేరిన వారలలోన మచ్చుకై
యొక్కరు రారు వచ్చిన సదుక్తులఁ గోరమె వారి? 'మీరలున్
దక్కిన బాటసారుల విధం బెటులయ్యె' నటంచు వేడుకన్.

౨౧

బహు బలిష్ఠ మహామూలబంధ కలిత
చండమార్తాండ మండల చలన ముదయ
మస్తమానములను గల యవధి యేమొ
తెలుప లే దూహయను త్రాసు కొలిచి తూచి.

౨౨

ఈ సచరాచరావని వసించు జగం బొకచాయచిత్ర మా
భాసము మాయ దీని నిజభావ మెఱుంగనివాఁడు జ్ఞాన మన్
వాసనలేనివాఁడె; యిటువంటి యపోహలపొంతఁ బోక నీ
వాసవపాన మత్తమతివై విహరింపుము సంతసంబునన్.

౨౩

మంటికి మింటిమధ్యగల మంజుల విద్యలనెల్ల నేర్చియే
యుంటిని మాయలన్ని యెఱిఁగుంటిని జిక్కులనుండి తప్పుకోఁ
గంటిని యడ్డులన్ని తొలఁగన్ నిలుచుంటినిగాని మిత్త్రి నే
నెంటు జయింపలేనయితి విహ్వలచిత్తము సందడింపఁగన్.

౨౪

ఊహ లను కాచకుప్పెల నొప్పి కాల
చక్ర నిహతిఁ బరిభ్రాంతిసంచరించు
నవనియే కాచకుప్పె యీ యర్కుఁ డందు
వెలుఁగు దీపంబు తిరుగు బొమ్మలము మేము.

౨౫

ఆది యనాదిలోఁగల రహస్యము నీకును నాకుఁ దోఁచ దీ
భేద సమస్యలో ముడినివిప్పఁగ నీవును నేను జాల మీ
వాదములన్ని వట్టి తెరబైటివి యీ తెర లేచిపోవుచో
నేదియు లేదు కేవలము నీవును నేనును నుండ మచ్చుటన్.

౨౬

ప్రాఁతవి క్రొత్తమార్పులను బన్నెడి యీ విధికొంగునుండి యే
రీతినొ తప్పుకొమ్మొక సుహృద్వచనమ్ములచేత నీ మహా
ఘాత దురాగతార్ణవము కాలహతిన్ బడిపోకమున్నె నీ
చేతము మార్చు వాదములుచేయకు దీర్ఘములీ విచారముల్.

౨౭

వైరుల్ నన్నుఁ బదార్థవాదియని సంభాషింతురే వార లే
తీరున్ న న్నటులాడ నేర్చిరొకొ యర్థిన్ జెప్పరే కాని సొం
పారన్ ధాత్రికులాయమందు సృజియింపన్ వచ్చితిన్ నేను నా
దేరూపం బని చర్చ చేయవలదా యిం దేమి తప్పున్నదా!

౨౮

సొంపులు నింపు పాత్రల విశుద్ధమతిన్ రచియించి వానినే
త్రెంపుట కెవ్వరిష్టపడి తెంపరులై చనుదేర రీశుఁడున్
సొంపులునింపు జీవులను శుద్ధమతిన్ సృజియించి యార్తిమై
జంపుట కేమిహేతువొ నిజంబు వచింపఁగరాదె నేర్చినన్.

౨౯

మృతియను పెద్ద కాండపటు మేరును దాఁటినవారు లేరు త
ద్గతి విధిచోదితం బయినకైవడి చెప్పెడువారు లేరు స
మ్మతిఁ దమబుద్ధికిన్ దెలియుమార్గములన్ వచియింత్రు గాని ని
శ్చిత మిదియంచుఁ దోఁపదు వచింప రచింప నసాధ్య మీకథల్.

౩౦

ప్రకృతి తత్త్వజ్ఞు లాత్మధైర్యమను హయము
నాకసనంబునఁ బరువెత్త నంపినారు
ఆ పరాత్ముని రూపు వ్యోమాభమగుచుఁ
జుట్టియుండుట భ్రాంతులై సోలినారు.

౩౧

కొందఱు బుద్ధిమంతులగు కోవిదు లర్థపు మంచిముత్తెముల్
పొందుగ దండలల్లి యిడు పోలిక దేవునిగూర్చి చెప్పి మె
ప్పొందగలేక వాస్తవసమున్నతి యేదొ యెఱుంగలేక యే
మందిరి వ్యర్థవాక్యము లనేకము లాడి ప్రగల్భచిత్తులై.

౩౨

శోకాలోక పరీత భూతలము నాలోకించి యా యీశ్వర
శ్రీకళ్యాణ కళాకలాపముల నీక్షింపంగఁ జర్చించి భూ
మ్యాకాశంబుల మెట్టి కాన కొఁగి భగ్నాశావకాశాత్ములై
మూకీభావము నొంది రేమనఁగ మోమున్జెల్ల కల్లాడుచున్.

౩౩

గాలినై వాని చికురముల్ కదపలేను
వాని చింతాశ్వశృంఖలఁ బట్టలేను
వాని వీక్షింప నీకనుల్ పనికిరావు
పనికివచ్చినఁ జూడఁగా నను పడవు.

౩౪

ఆ యీశ్వరుని రహస్యంబు ప్రశ్నోత్తర
మ్ములచేత నన్నోఁడుఁ దెలియఁబడదు
వెలలేని ధనమును వెచ్చించి సాధింప
సాధ్యంబుగాదు నిస్సంశయంబు
బహువత్సరంబులు ప్రాణంబు లరికట్టి
నెత్తురు తపసున నీరుఁజేసి
కష్టముల్ పడకుండఁ గాంచనేరవు బ్రహ్మ
వస్తువు నా స్త్రీకా భాసమందు
ఈ యమూల్యమౌరత్న మదేదొ గనిది
ఈ లసన్మౌక్తికపు విధమేదొ వేఱు
ఈ కళాభేదములు దోఁచు నీకు నాకె
ప్రియుల కథలలో మాటలే వేఱుకాదె.

౩౫

పాఠాంతరము :-

ఈ రతనాలుగల్గు గనియెక్కడిదో యిది వేఱు శోభిత
స్ఫార రసాత్మకంబయిన చక్కని యీ తెలిముత్తెపున్ గళే
వేఱు వివర్ణమైన గుణభేదము మీకును మాకె కాని సొం
పారు ప్రియుల్ రచించు నిజభాషల కర్థమె వేఱు; చూడఁగన్.

౩౬

జగమె దేహంబు ప్రాణమీశ్వరుఁడు సురలు
తచ్ఛరీరస్థ ప్రకృతిభూతములు నవయ
వంబు లిదియె యేకేస్వరత్వంబు గాన
తక్కుగాథలన్నియును వ్యర్థములె సుమ్ము.

౩౭

ప్రేమ యను మధుశాలలోఁ బ్రేత నేను
మధువు సేవింతు నిందితమతిని నగుచు
ఆసవం బమ్మువాఁడ నాకనియే శ
రీర మేను జీవుండ నుర్వికి నిజంబు.

౩౮

ఓ సతి నీవు నే నల సముజ్జ్వలకాంతి రసస్వరూప సం
భాసిత సంపదన్ వెలయువారము మేనులు వేఱువేఱుగాఁ
బూసకుఁ గల్గు కన్నమటు పోల్చిన నొక్కటి కాకమాన మీ
భాసుర ప్రేమవీథి నెడఁబాయక యేఁగుచు నుంటి మొక్కటై.

౩౯

ఓ నా ప్రాణపదంబా
నేనే కల నీవు లేవు నీలో నేనై,
లీనంబుఁ జెందితిని మఱి
నేనే లే నీవె కల వసంతలీలన్.

౪౦

ఒకపరి నగపడ వెచ్చటు
నొకపరి స్వర్గస్వరూప కోజ్జ్వలకళలన్,
బ్రకటింపఁ బడెద వొకపరి
నకలుష దృక్ దర్శ్యద్రష్ట వయ్యెద వభవా.

౪౧

ప్రతిమ వచించెఁ దన్ను నిజభక్తి భజించెడువానితోడ నో
హితుఁడ మదీయపాదముల కేటికి మ్రొక్కెద నీవెఱుంగ వా
హితుఁడు భవన్ముఖంబునఁ ద్వదీప్సితసిద్ధికి నన్నుఁజేరెనా
కతమున నీవు నన్ గొలువఁగంటివి సుమ్ము సముత్సుకంబుగా.

౪౨

పాఠాంతరము :-

ప్రతిమ వచించెఁ దన్ను నిజభక్తి భజించెడువానితోడ నో
హితుఁడ మదీయపాదముల కేటికి మ్రొక్కెద వేనుఱాయినై
వెతఁబడి పెక్కు సమ్మెటలవేఁగి గడించితి దివ్యవ్యక్తిత
ద్గతి శ్రమపడ్డ నీపదయుగంబులు మ్రొక్కెద రెల్లవారలున్.

౪౩

ఓ వెలదీ! త్వ దాస్యశశి యుజ్జ్వలకాంతి జగజ్జనాళి ప్రా
ణావసథంబు; నాకుఁ బ్రణయాత్మక మందటి జీవగఱ్ఱ యో
దేవి! త్వదాననద్యుమణిదీప్తి ప్రపంచ తమో నివారకం
బై విలసిల్లు; *నీగతి మహాజనులెల్ల నుతింతు రర్థులై.

౪౪

పాఠాంతరము :—

నినుఁగని కరఁగని హృదయము
నినుఁగని మోహించనట్టి నేత్రంబులు లే,
వనఘా! నీకివి లే వెం
దును గాని త్వదాశలేని దుండదు ప్రియమున్.

౪౫

నీ యెడఁబాటుచేఁ గరఁగి నీరవనట్టి మనస్సులేదు; లే
దేయెడ నిన్నుఁజూచి భ్రమియింపని నేత్రపుటంబు లీ రసా
ధ్యాయమె నీకు లేదు; ప్రియమన్నది లేశము లేదు; గాని నీ
ప్రాయము ప్రేమపాశములఁ బాడనివారలు లేరు నెచ్చెలీ.

౪౬

తరుణీ! నీ విరహాగ్ని నెప్పు డెద దగ్ధంబందఁగా మచ్చ లె
ట్టి రసావేశత మాన్పివైచె నపుడే డిందెన్ బ్రపంచేచ్ఛ; లీ
తెలుఁగున్ దృష్టిఘటించె నీ వలపుదీప్తిన్ లోకకళ్యాణమై
పరఁగెన్ ద ద్రవిరేణు హస్తముల దీపం బిచ్చిన ట్లయ్యెడున్.

---

*నేనొకఁడ నాడుటగా దిటు లోక మాడెడిన్.

౪౭

కాలమ! నీవు నీ కపటు కారణమున్ బ్రకటించి యీ జగ
జ్జాలము మ్రింగుచుంటివి విషాదముఁగూర్చుచుఁ బ్రాయికంబుగా
ఖేలనమయ్యె నీ కవనిక్రింద సమాధుల నిద్రవోవు ర
త్నాలను బోలు కోవిదుల తాళముబట్టి తిరస్కరింపఁగన్.

౪౮

పాఱెడు నీటియొడ్డు పొలుపారెడు పచ్చని పైరు చూచి సొం
పారెడు నే మనోహరి ప్రపంచ శరీరమువాసి వాసిమై
మాఱెనొయంచు నెంచుము ప్రమాదమతిన్ దెగిత్రుంపఁబోకుమా
చారు సువర్ణమండిత ప్రశస్త కళా కలితాంగ మయ్యెడన్.

౪౯

కంటకరాశి నెల్లెడ మృగంబులు ద్రొక్కుచుఁ పోవుచున్న; వా
కంటక మేమృగేక్షణ వికాసపు ముంగురులందు భాగమో
పంటవలంతి సౌధములపై నిటుకల్ నృపమస్తకంబులున్
దొంటి విశీర్ణవృత్తి మృతి దొట్రిల నీగతి మార్పఁబోలదే.

౫౦

ఈ మధుపాత్ర నావలె మృగేక్షణనోర్తు వరించి పూర్వ మా
ప్రేమను నామె ముంగురుల టివ్వనఁ జిక్కి విశీర్ణమై యొగిన్
గామిని కంఠహారమయి క్రాలిన; దాని కరాలమృత్తుచే
నీ మహితాకృతిన్ బడసె నిం దనియున్నది దీని మోమునన్.

౨౧

వనముల నెఱ్ఱపువ్వులు నృపాల రణాంగణ వీరరక్త సం
జనితములేమొ శోభితదశన్ నన లెత్తిన లేఁత కొమ్మ కొ
మ్మను జివురాకులొప్పు నవి మానిని చెక్కిళులేమొ యింపు సొం
పొనరెడు వుట్టుమచ్చ లననొప్పెడు నందలి చుక్క రారయన్.

౨౨

మనకంటెన్ మునువున్న యిట్టి పగళుల్ మాపుల్ ప్రపంచించి యే
పనికో కాలము చుట్టుచున్నయది సర్పంబట్లు జాగ్రత్త! నే
లను గాలూదకు; నీ పదాహతిని లీలన్మీటు మన్నే లతాం
గి నట దృక్షణపంక్తిదో తెలియశక్యంబౌనె యెవ్వారికిన్!

౨౩

త్రుంపియుఁ బారవేయని యిదోషసుమం బొకనైనఁ జెప్పి సృ
ష్టింపదు కాల; మేవనముఁ జేరిన మేఘము నీళ్ళమాఱుగాఁ
దెంపున ధూళి గ్రుంగి చనుదెంచిన పాంథుల నెత్తుటేఱె వ
ర్షింపఁగఁజాలు; నెందరు నశింపరు మట్టయిపోయి యీగతిన్.

౨౪

"మూసా"లెందఱో వచ్చిపోయిరిసుమీ భూమిన్'కొహోతూరు'గా
"ఈసా" లెందఱో వచ్చిపోయిరిసుమీ యీధాత్రి ధైర్యంబుగా
"కేసర్లెం"దఱో వచ్చిపోయిరిసుమీ యీక్షోణి"కైసారు"గా
నా సర్వస్వము వీడిపోయి రిల యాతాయాత సంరంభులై.

౨౫

ప్రాఁతసత్రంబు నిజము ప్రపంచ మనఁగ
సంధ్యలు, నుషస్సు లనెడు నశ్వములనెలవు
శీధుసభ యిది పెక్కు "జంషీదు" లకును
ప్రణుతభవనంబు పెక్కు "బైరాము" లకును.

౨౬

నీవు జనింపక పూర్వం
బీ వసుధన్ స్త్రీలుఁ, బురుషు లెందఱో కల రా
జీవమె నీలో నున్నది
యీవును నశియింతు వెపుడొ యిఁక రా వేఁగన్.

౨౭

ఏ సౌధాళిని విశ్రమించి బెహరా మెంతే సురన్ ద్రావెనో
యా సౌధానఁ గురంగసంతతియు, సింహవ్రాతమున్ నిండి యెం
తే సుప్తిం గను; నాతఁ డేమృగములన్ హింసించెనో నేఁ డవే
గాసిన్ ద్రొక్కఁగఁ గోరి కిప్డు బలియై కైసాచెఁ గాలాహతిన్.

౨౮

నీరదనీలవేణుల ననేకల బూడిదపాలు చేసి శృం
గార రసప్రపూర్ణలగు కాంతల వాతెఱ నేలఁగల్పి యెం
తే రగిలించె దుఃఖ మెదఁ దీఱనిమచ్చ ఘటించె దైవ మ
య్యో రమణీయ సౌధముల నూరును బేరును లేక కూల్చుచున్.

౨౯

ఈరేడు జగములందును
పేరును గడియించినట్టి విబుధులు గల రీ
ధారుణి వచ్చుచుఁ బోవుచుఁ
జేరరు దేవుని పదంబో స్థిర శమపదమో!

౩౦

త్రాగెడు పానపాత్ర యధరంబున ముట్టినవాని కిట్లు చెన్
ఓగుణి! నాకు మున్ బెదవులుండెను; నీవలె నాశరీరమున్
భోగపరాయణత్వమునఁ బోయెను; దైవము మేలుచేసినన్
నీగతిగూడ నిట్టు లగు; నీవును నావలె నుందు వాపయిన్.

౩౧

కుమ్మరి మట్టిని గాలన్
గ్రుమ్మఁగ నది చూచి వానిగూర్చి వచించెన్
గుమ్మరి నీవలె మును నే
నిమ్మహి మానవుఁడ; గౌరవింపుము నన్నున్.

౩౨

పోయినవారు బూడి దయిపోయిరి; వారి శరీరలేశమం
దే యణువైనఁ గానఁబడ; దెట్టి సురన్ గొని మూర్ఛవోయి యా
కాయము వాసిరో ప్రళయకాలముదాఁక సుషుప్తిఁ జెంది రా
రాయెను; కర్మవాంఛఁ జనరాయెను వేనికి లెక్కసేయకే.

౬౩

ఆసఁ జషకంబుఁ బెదవులనంటి యాయు
వెంతొ యభివృద్ధిసేయఁగా నెంచ, నదియు
నిట్టు లనె ; నేను నీవలె నెపుడొ నరుఁడ
నన్ను సేవింపు మింకఁ గొన్నాళ్ళు నీవు.

౬౪

కాకంబొక్కటి "తూసికోట" శిఖరాగ్రంబందుఁ గూర్చుండి యా
"కైకావూస" ను చక్రవర్తి తలముక్కల్ సూచి యిట్లాడె ; 'నా
హో కాలంబ ! మదేభకుంభములపై నశ్రాంతమున్ మ్రోయు భే
రీ కల్పారవ మెందుఁ బోయె ? నిపు డీఱేఁడెట్టులయ్యెన్ గటా !

౬౫

అంబరచుంబితంబు, లమృతాభము లీధవళంబులైన సౌ
ధంబుల నేలు నేనృపుపదంబులపై భువనాధిపుల్ కిరీ
టంబులు మోపిమ్రొక్కిరో ! కటా ! యతఁడేఁడనిపల్కుచున్ గపో
తంబు కుహూకుహూకలరుతంబులు సేయఁగ వింటి నే నటన్.

౬౬

నిన్నఁ గులాలునింటను ననేక లసత్కలశంబు లూరకే
యున్నవి; కొన్ని పల్కెడివి యున్నవి యవ్వి నిమిత్తవాక్కులన్
జెన్నుగఁ బృచ్ఛచేసె ; మముఁ జేసినవారును, విక్రయించువా,
రెన్నఁగఁ గొన్నవారల లెటకేఁగిరి ? చూపు మటంచు నన్నటన్.

౬౭

మరణము నీకు, నాకు నొక మాఱుగ వచ్చిన వచ్చు; దేహ పం
జరమును వీడి ప్రాణములు సాగిన సాగును; నీవు నే నిలన్
నిరతము తృప్తులై నిలువ నేరము; సూర్యుఁడు చంద్రుఁ డెప్పుడున్
గిరణములన్ వెలార్చు మన కిల్బిషభూరజమం దజస్రమున్.

౬౮

ప్రాణమేఁగినఁ గట్టెను బాతి గోరి
యొద్దకును వచ్చి పోవుచు నుంద్రు జనులు
కాని, భూమిలోనున్న నీమేనిపైని
జరిగెడు నుదంత మినుమంత యెఱుఁగలేరు.

౬౯

మనతనువులలోఁ బ్రాణము
చనునెడ భువిఁబాతి ఱాళ్ళుచఱచెద; రట న
న్యనకై యిటుకలు మన మ
ట్టిని జేతురు కాళ్ళఁ ద్రొక్కి డిందుపఱచుచున్.

౭౦

అసువులు నేప్రమాదపథమందునో పోవును; దేహపంక్తులన్
వసుమతిఁ బాతి పెట్టెదరు; పాపము పుణ్యము లేదు దానికిన్;
వెస జనులెందఱో నడచి వెళ్లెద రా మనబూదిఁద్రొక్కి; యే
వ్యసనములేక మృత్తికయి పండి తలంపము రెండులోకముల్.

౭౧

చక్రమును డాసి కుమ్మరి చట్టి లెన్నొ
చేయుచున్నాఁడు; భూపతిశిరము భిక్షు
కరమె యైనను మన్నె; యీపరమగుహ్య
మరసినాఁడఁ గులాలమందిరమునందు.

౭౨

మదమున నేను బాపినయి మంజుల రంజిత కాచకుంభమున్
బదములఁదన్ని జాతిపయి బాదితి; న న్నది చూచి యిట్లనున్
"మొదటఁ ద్వదాకృతిన్ మనుజుఁ బోలినదానవె నేను; నీవునున్
దుద కొకనాఁడు నావలెనెదొర్లి నశింతువు నిక్క మిద్ధరన్."

౭౩

మానవ! మృత్తికన్ బిసుకమాను; ప్రయత్నము సేయవేమి వి
జ్ఞానమునకై; కులాల కరచాలిత చక్రమునందు నా "ఫరీ
దూను" కరాంగుళంబులును దోరపు "కైఖొసురూ" శిరంబు మ
న్నైనఁ దదీయమృత్తికయె యాగతి ముద్దయి యున్న దచ్చటున్.

౭౪

కుమ్మరి బెడ్డలన్ పిటిచి కుండలఁ జేయుచునుండఁ బెక్కు వ
ర్షమ్ములు చూచితిన్ బగలు రాత్రియు నాతనిచేతులందు ని
క్కమ్ముగఁ గ్రాలుమృత్తిక యొకానొకవీరునిదే; యతండు కన్
దమ్ములఁ జూడకున్నను యథావిధి నేఁ గనుచుంటి నీకథన్.

౭౫

కర్మిష్ఠులతో ప్రసంగము

కోవిదవర్య ! శాంతి వినఁగోరెద నాపలు కీవు నేనునుం
బోవుచునున్న మార్గ మొకపోలిక దైనను వామమార్గ మం
ది వౌకదృష్టి నిల్పితివి యెప్పటికైనను దిద్దుకొమ్ము ; నా
పై విరసోక్తు లాడకు ; నెపంబులు వీడుమి యీశ్వరార్థమై.

౭౬

ద్రాక్షరసంబులో రుచి యథార్థముగా నది త్రావుచున్న యా
దక్షుఁ డెఱుంగుఁ గాని ధనదాసులు, కుత్సితమానసుల్, వృథా
భిక్షుల కెట్లు తోఁచు ? నవివేకత వార లెఱుంగలేరు ; వి
శ్వక్షితి మర్త్యుఁడే మధురసంపు రసంబు తెఱం గెఱింగెడున్.

౭౭

పేర్మి మార్గ ప్రతిపాదితంబయిన మా హృత్పాత్రిలో శీధు వెం
తే మర్యాద వహించు ; మత్తనఁగ రానేరాదు ; కర్మిష్ఠియున్
భూమాగ్నిన్ సుర యింతపోసిన నభంబున్ ముట్టుంగా మండు; రెం
డే మార్గంబులు వహ్ని, నీటఁబడ మాయించున్ బృథుజ్వాలలన్.

౭౮

మాసభయందుఁ ద్రాగుడును, మంజులగానము, పానపాత్రతో
భాసిలుచుండు ; మేము మధుపానమదోద్ధతి నుందు మెప్డు ; నీ
వ్యాసము లిందుఁజెప్పకు మతాంతరవర్తి ! దురాత్మ ! యింక మా
యాసవమున్, మృగాక్షియధరాసవమున్ మముఁదేర్చు నెంతయున్.

౭౯

మదిరాపాదిత మత్తచిత్తతయె మా మార్గంబిఁకొం డేది మా
మదికిన్ నచ్చదు ; మమ్ము నిచ్చలును దుర్మార్గాళిగాఁ దిట్టుటల్
చదురే ? త్రాగెడువారు మత్తు లయి యశ్రాంతంబు తూగాఁడ కే
కుదురై యుందురె లోకమందు నిఁక సంకోచింపఁగ నేటికిన్.

౮౦

ఆప్తబోధ

ఎవ్వని నీవు మిత్రునిగ నెంచకు ; దూరము దూర ముండియే
యివ్వసుధన్ జరింపు ; మదియే హితమై సుఖ మిచ్చు నీకు ; నీ
వెవ్వనియందు మైత్రి నిడి యెవ్వనిఁ బెన్నిధిగాఁగ నెంచెదో
నెవ్వగ నాతఁడే పరమనీచపుశత్రు వగున్ దలంచినన్.

౮౧

జనసంఘం బను నగ్నిచేతను మహాజ్వాలావళీధూమ ద
ర్శనమే గాని ప్రయోజనంబు దలఁపన్ రవ్వంతయున్ గల్గదా
యెను ; గాలానికె కేలు మోడ్చి ఫలమెంతే దానియాచింతు ; మి
త్రునిగా నెంచినవానివల్ల ఫల మెందున్ దోఁచ దెన్నాళ్ళకున్.

౮౨

గాడిదవంటి యాజనుల కైవస మేమిఫలంబుఁ గూర్చు ? నీ
తోడను నేల పాండితిని దోడ్కొనిపోయెదు ? పీరువిద్దెకున్
బోడిమికిన్ వెలే యొసఁగఁ బోవరు ; వత్సర మేడిపించి యే
నాఁడును జేరెఁ డంబువుల నైనను బోయరు దాహ మారఁగన్.

౨౩

మిత్రు లేరి? జగాన నామైత్రి యేది?
ప్రేమ యేది? యా మోమోట విధ మదేది?
దొంగ లెల్లరు; వారల సంగ మేల
దూరమున నుండియే నమస్కార మనుము.

౨౪

చెలియా! ద్రాక్షరసంబు నాకొసఁగుమా సీసాముఖద్వారమున్
వెలికిన్ దీయుము; దీనికన్న హితు లీవిశ్వంబులో లేరు; ని
ర్మలమై రాగరసంబుతో నెనయుచున్ రాగిల్లు నీ శీధుపా
త్రలతోఁ బోలెడు మానసంబుగల మిత్రవ్రాత మెందొండునే.

౨౫

సౌందర్యము

ఆరమణీమనోహరముఖాబ్జము ముంగురు లుంగరాల సిం
గారముఁ బెట్టిదిద్దితి ; వికాసముగుల్కెడు ముద్దరాలిఁ గ
న్నారఁగఁ జూడరా దనెద వక్కట ! నిండిననీటిపాత్రమున్
బోరలువేసి నేలఁ బడఁబోవదు నీ రనునట్లు లుండదే.

౨౬

ఏరును మాననేరని దదేపని మానుఁడు దేవునాజ్ఞ నా
ధారుణిఁ గ్రుంగు ; నీపగిది ద్వంద్వములన్ జన మార్తిజెందు ; నే
డేరగు నన్యభావములఁ డెల్పిన ? నిండిన నీటిపాత్రమున్
బోరలవేసి నేలఁ బడఁబోవదు నీ రనునట్లు లుండదే.

౬౭

సోయగమున్, విలాసము, విశుద్ధమనంబుఁ, బ్రియం, బొయారమున్
బ్రాయము నింతయుండ ననురాగముఁబొందని స్వాంత మెంతయున్
కాయియొ రప్పయో యగును; రాగరసంబునఁదేలి యర్థియై
పోయి వరింపఁగాఁబడుటో పొంగి వరించుటో కర్జ మోర్తుకన్.

౬౮

తేరగ నీవు మూలప్రకృతిన్ నిదురించెడు నన్ను లేపియున్
ధారుణి కేఁగి పేర్వడు మనన్ జనుదెంచితి నీ యనుజ్ఞనే
యారభసంబుఁ జేసి తిట నేనిఁక దోషినె? నీటిపాత్రమున్
బోరలువేసి నేలఁ బడఁబోవదు నీ రనునట్టు లుండదే.

౬౯

విధినింద

ఓ విధి! స్వతంత్రతను గల్గు నొకనికైన
మేలుఁ జేసితివా? నీచపాళి కెపుడు
భాగ్యములఁ గూర్తు వెం తవిశ్వాసి వీవు
తెలివితేటలు నీ కింకఁ గలవె చెపుమ?

౭౦

తెలివితేటలచే నింత ఫలము లేదు
బుద్ధిహీనులకే సౌఖ్యములు ఘటించు
కాన యీ తెల్వి పోయెడు దాని నిండు!
ఇట్టులైనను విధి భాగ్య మిచ్చునేమో?

౭౧

నీచకాలంబ ! నీచాతి నీచరక్ష
యీ వెవనికైన మేలు గావించినావె
ఘనులఁ గూళలఁ, గూళల ఘనులఁ జేయు
టిదియె కలకాల మరయ ప్రాయకము నీకు.

౭౨

ఓ కాలంబ ! భవత్పరిభ్రమణ నా కుత్సాహమున్ గూర్పలే
దాకాంక్షన్ నను వీడు ; పట్టుకొన నే నర్హుండనే ? యారయన్
నీకున్ నీచు లవజ్ఞ లాప్తులు గదా నేనే మనల్పుండనా
నాకేమైనఁ దివ్రికాలవేద్యమగు జ్ఞానం బున్నదా చెప్పుమా.

౭౩

ఓ కాలంబ ! సతంబు నా కహితవై యున్నావు నీ వన్యులన్
సాకల్యంబుగ సాకుచుందువు ; ననున్ సాధింతు వీవెప్డునా
కైకయ్యానికి రానిమాటయును, నీకై నేనొగిన్ పంధికై
రాకేపోవనిమాట యెన్నఁడయినన్ రాజిల్లనే చెప్పుమా.

౭౪

నా కీకాలముపై స్వతంత్రతయె యున్నన్ దీనిఁ బోద్రోసి యిం
కో కాలంబు సృజించియుందు ; నటు స్వేచ్ఛోద్దేశస్వాతంత్ర్య భా
వై కారంభుల యీప్సితార్థతతు లత్యంతంబు నీడేర, న
స్తోకప్రక్రియ జీవితాళి గడవన్ దోడై విరాజిల్లఁగన్.

౯౨

ఈతమసావృతంబయిన హీనపుఁగాలము మాకొనర్చు హిం
సా తతి, నీచు లల్పులను సాకుటకై పడుపాట్లుఁ జూచి నా
చేతము రక్తకుంభమయి చిమ్ముఁగ నశ్రువు లాస్యమండలం
బాతతవారిపాత్ర మయి యార్తి ఘటించెడు నెల్లకాలమున్.

౯౩

బోర్లవేసినపాత్రను బోలె నభము
కాలరూపంబు సూచించు ; ఘనులనందు
దుస్థితిని బడఁద్రోసి ముద్దుల నొసంగు
కలశరసములవలె మైత్రి గలదు గాని
యందు నెత్తురు నిండి పొంగారుచుండు.

౯౪

ఏరుఁడు "రుస్తు" మున్న తన పీటిని గాఁపురమంచుఁ జెప్పరో
కూరపుఁగాలమా ! సతము కూళలకే కడుఁగూర్తువీవు పెన్
ధీరులనే యడంతుగగె ! నీ విఁక ముత్యమొ చిల్లపెంకువో
దూఱక చెప్పు నీ దురిత దుస్సహచేష్టల కీవె సాక్షివై.

౯౫

లోకదుఃఖము – మధువు

ఓచెలీ ! మమ్ము మ్రింగుటకు హుమ్మని కాలము వేచియుండ నీ
పాచిజగంబు మాకొక ప్రవాసనికేతన మట్టు లున్న దం
తే చషకంబు ద్రాక్షరస మీయెడఁ గైకొన త్రావనుండ సం
కోచము పొందనేల ? యిది కూడనికార్యమె యెట్టివారికిన్.

౯౯

మధువున్ ద్రావి యథేచ్ఛ నుండుటయె నామార్గంబు ; పూర్వైకస
చ్ఛ్విధులన్ సల్పుచు నొక్కఁ డీశుఁడని తృప్తిజెందుటే నామతం
బధినాథున్ డిటు లాడె నే నడుగ, నీ యానందమే నా దయా
వధి యంచున్ మఱి యేను ద్రాక్షరసమున్ వర్జింపఁగా నేటికిన్.

౧౦౦

మధువున్ ద్రావుము నిత్యతోషమునకున్ మార్గంబు గానోపు ; నీ
మధువే ప్రాణహృదంతరక్షతములన్ మాయించు ; నల్వంకలన్
వ్యధ జంఝూనిల మావరింపఁ దలక్రిందై పోయి దుఃఖావిలాం
బుధిలో మున్గిన "నూహు" నౌకవలె నిన్బోషించు సంభావ్యమై.

౧౦౧

నేనయి పుట్టలే దిలను నేనయి చావ నిఁకెట్టులున్ దుదిన్
మేనును వీడి పోవలయు మిన్నక ; నెచ్చెలి ! లెమ్ము ! కాసెతో
నీనడుమున్ బిగింపు ; మిఁక నేర్పున శీధువుఁదెమ్ము దానిచే
నీ నరలోకదుఃఖమలినేచ్ఛలఁ బోఁగడతున్ యథావిధిన్.

౧౦౨

ఈవసుధాతలంబు నివసింపంగఁ జోటును, నిల్వ నీడ యీఁ
బోవదు ; శిష్టులన్ వెతల ముంచును ధుష్టులఁ గావఁజూచుఁ గా
దే ! వగపేల ? యీ యనలమెల్ల జలాంజలి వీడి యార్పు మో
కోవిద ! పట్టిచేతులతొ గుందుచుఁ గాటికిఁ బోవనేటికో.

౧౦౩

కలికి! నామానసంబు దుఃఖమునె గాని
సుఖమెఱుంగదు ; తినెడు వస్తువులలోన
నాసవమె గాని యొం డేపదార్థ మెఱుఁగ
నోసి! మధ్వాసవంబు నాకోసఁగు మబల!
యీ యుషఃకాలమున శీధు విడిన నుసురు
నిలుపుకొందును ; నుసురులో విలువ యొక్క
క్రీస్తెఱుంగును నెఱుఁగ రికేలు పరులు.

౧౦౪

శీధువు పాత్రనుండిపడి చేయుకలధ్వని వేణుగానపు
న్మాధురి యెంతహాయినిడు మానిని కౌఁగిట నద్ది చారు సం
బోధనలన్ వెలార్చు నిజభోగపరంపర నాసవాప్తి సం
బాధము లాహహా యెటు ప్రపంచవిచారము మన్పెఁ జూచితే

౧౦౫

వ్యర్థవాంఛలఁ బడి జ్ఞాని వగవఁబోఁడు
మధువుఁద్రావుచు దుఃఖాన మనసు నుంచు
వానినెత్తి దుమ్మును గొట్టవలయుఁ గాదె
యేడ్చువాఁ డెప్డు మధుసేవ కేఁగవలదు.

౧౦౬

ఆసవ మెప్డుఁ ద్రాగవలె ; నాత్మ కృతార్థత నొందు ; దుఃఖపున్
వాసన మానసంబు విడఁబారగ శీధువు పానపాత్రలోఁ
బోసి యథేచ్ఛఁ ద్రాగుచును బూజ్యుల కిమ్మది తెల్లమేగదా
యీ సచరాచరావని వసించుట కొన్నిదినాలె కాదొకో.

౧౦౭

ఆనందప్రతిబింబమే కలదు నీ యాత్మన్, భవత్మాణిలోఁ
బానార్థంబగు శీధుపాత్ర గల దాపాత్రన్ విసర్జింప కో
జ్ఞానీ ! నీ కిల దీనికన్న నిఁక విశ్వాసార్హుఁడౌ మిత్రుఁడున్
లేనేలేఁడు సుమా యథార్థమిది వేలీలన్ వితర్కించినన్.

౧౦౮

చెలి యిలఁ జిల్కరించు ప్రతి శీధుకణంబు హృదంతదుఃఖ కీ
లలఁ బరిమార్చుచుండె నహ ! లాతిజనం బిది వట్టినీళ్ళుగాఁ
దలఁచు నపోహలం దవిలి దారుణ ఘోర హృదంతరాళ చిం
తలఁ దొలఁగించుచున్న దిది తథ్యము గాలికబుర్లి కేటికిన్.

౧౦౯

వృథగా దుఃఖముఁ జెందనేల విధి యీవిశ్వంబులో నెందఱన్
బృథివిన్ గూలిచి మన్ను చేసినదియో విశ్వజ్ఞ ! లే వేగమే
మధుపాత్రిన్ గొని నా కరాన నిడుమా మద్యంబునే త్రావెదన్
విధి యేరీతిని నున్న నాగతియగున్ వేయేండ్లు చింతించినన్.

౧౧౦

మద్యపానాప్తి ధనికులే మాయుచుండ్రి
వీరియార్భాటమునఁ బ్రజ విసుగు ; దాని
విడిచి, దుఃఖాపహ్రగుడ్డిదై వెడల హుళక్క,
వజ్ర పేటికలోఁ బచ్చవాడుచుంటి.

౧౧౧

విధి నాముందు శిరంబు వంపవలె నావిశ్వైకసంజీవితా
వధి యెంతే నభివృద్ధిఁ గాంచుటకు నైవాంఛింతు వశ్లైన నీ
మధువున్ నావలెఁద్రావ నేర్చికొని నామార్గాన వర్తించి దు
ర్వ్యథలన్ దోలుము నమ్ము నావచన మత్యంతంబు విశ్వాసివై.

౧౧౨

స్వర్గమునుండి యీధరకు వచ్చినవాఁడవె యున్ననాళ్ళు నీ
దుర్గతి దుఃఖసంకలిత దోషవివేచన మాని మిత్రుఁడా
భర్గుఁ డొసంగునట్టి మధుపానము సేయుము రెండులోకముల్
నిర్గతకర్మమై వెతల నీఱయిపోవుఁ దరింతు వన్నిటన్.

౧౧౩

మృతికోకదారి లేనియెడ నీ మధుపానమె సేయనిమ్ము జీ
విత మతి స్వల్ప మీవ్యవధి విహ్వలచిత్త విచారఘోర దు
ర్గతులను బొంది పొంది కలకాలము క్రుక్కి నశించి యేడ్వ నా
మతి సహియింపకున్న దిఁక మానిని! దీనిని మాన్పఁబోకుమా.

౧౧౪

అవనిని గొన్నినాళ్ళు బ్రతుకాశ వహించితివేని, నందులోఁ
బ్రవిమల చిత్తవృత్తి నిజభావమునన్ వ్యసనంబులేని యు
త్సవమును, సౌఖ్య మున్నతి నిజంబుగ నొందఁ దలంచితేని నా
సవమును ద్రావు మెప్పుడును సార్థకజన్ముఁడ వౌదు వాగతిన్.

౧౧౫

మధుమాంసంబులు వచ్చుఁబోవును ; లసన్మాధుర్యమై యాయు వా
పథమందే నశియించుఁ గావున సురాపానంబు గావింపు మే
వ్యథలం బొందవు ; దుఃఖమే విషము ; నిత్యం బా విషవ్యాధికిన్
మధుపానంబె మహౌషధంబు ; బుధు లీమార్గంబుఁ జూపింపరే.

౧౧౬

నీతి

దేనిచె వగ నీ కగునో
దానిని గని దుఃఖమొందఁ దగ దన్యులతో
మానసిక వ్యథ లడఁగిన
నానందించెదవు నీవె యతిధన్యుఁడవై.

౧౧౭

కష్టము దలిగిన నోర్చి య
భీష్టాప్తిని నొందు ; బుధుల వీక్షించినచో
సాష్టాంగమనుము ; పిన్నల
నిష్టంబుగఁ బల్కి సంతసింపుము సతమున్

౧౧౮

నీవు ధరిత్రిఁ గామవిషయేచ్ఛలకై జనించినట్లు నీ
భావమునన్ దలంపకుము ; వ్యర్థుఁడవై నశియించిపోదు ; వే
తావులనుండి వచ్చితివొ తథ్యము నీవన నేమివస్తువో,
నీవిపు డే మొనర్చుటకు నెంచితివో పరికింపు మెంతయున్.

౧౧౯

శత్రుమిత్రులయెడ మేలు సలుపవలయు
కోవిదుం డన్యులకుఁ గీడు కోరఁబోఁడు
మిత్రుఁ దిట్టిన నాతఁడు శత్రుఁడగును
శత్రుఁ బొగడిన నాతఁడు మిత్రుఁడగును.

౧౨౦

నాతప్పుల కేడ్తును ; బరు
లేతప్పులు సేయుచున్న నే నెగ్గింపన్
బాతకముసలుపుప్రజఁ గని
భూతలమును విడువ బుద్ధి పుట్టెడు నాకున్.

౧౨౧

నీ వాకాశము నెక్కి నిక్కినఁ బ్రజల్ నిన్‌భూమిపైఁ ద్రోతు రిం
కీవెంతో సొగసైనవాఁడ వని గర్వింపన్ గడున్ దీనుగాఁ
గావించున్ బ్రజ ; కాన నీవు ప్రజతోఁ గయ్యంబు వర్జించి యెం
తో వారిం గని తోడునీడగుము నీతో వారు తోడౌనటుల్.

౧౨౨

ఒరులు నిను నొవ్వనాడిన నోర్చుకొనుము
ఎదిరిచే హాని సతము సంధిల్లుచున్నఁ
గోవిదులచాటుఁ జొచ్చి దాఁగుటయ లెస్స
మన్ను జలవాయువహ్నులే మనుజకోటి.

౧౨౩

ఏ నొకనాఁడు నేల నిదురించుచునుండఁగఁ గోవిందుండు నా
తోనిటు లాడె ; "నీపగిదిఁ దొంగియె యుండెద వేల లోకమం
దే నిదురింప నీజగతి నీప్సితముల్ సమకూడఁ బోవు ; గో
రీ నిఁక ముందు పండి నిదురింతువు లేవవు పెద్దకాలమున్."

౧౨౪

నీమతి యింటికుక్కవలె నీల్గుచు నున్నది ; వట్టిబూతుకా
లే మొఱుఁగున్ ; సృగాలము వలెన్ గడు ధూర్త శశంబురీతి ని
ద్రా మహితఁబు వ్యాఘ్రము విధాన భయానకమాత్మ కాకృతిన్
దామసరాగరోషకలితం బయి యున్నది చూడు మన్నిటన్.

౧౨౫

శత్రుఁడే తోడుపడినచో మిత్రుఁడగును
మిత్రుఁడే హాని చేసిన శత్రుఁడగును
విషము వికటింపకున్న నావిషమె యమృత
మమృత మైనను వికటింప నదియె విషము.

౧౨౬

దుఃఖ మెదఁ జొరనీయ ; కేదో విధానఁ
దప్పకున్నెడ రానిమ్ము ; తరలనిమ్ము ;
హాయిగాఁ దిను ; మిడు మన్న్య లడుగునెడల
వేలు ధనరాసు లున్న నీ వెంటరావు.

౧౨౭

పూలను వాసనార్థమయి ముండ్లశ్రమన్ బడుట్రబమే యుష్ణ
కాల సుధారసార్థమయి కైపు భరింపఁగఁబోలదే ? యటుల్
బాలకురంగనేత్ర, శశిఫాల మనోహరికై తపింపగాఁ
బోలును నిక్క మారమణిఁ బొందిన సౌఖ్యము లెన్న శక్యమే.

౧౨౮

సుజనునకుఁ బ్రాణ మిడవచ్చుఁ జొక్కి వాని
చరణములకును జోహారు సలుపవచ్చుఁ
గాని కుజనునితో మైత్రిఁ గలుపరాదు
నరకకూపం బదే యెన్నినాళ్ళకైన.

౧౨౯

కోవిదులు పవిత్రాత్ములఁ గూడి మనుము ;
దుర్జనులఁ జూచి క్రోశముల్ తొలఁగిపొమ్ము ;
కోవిదుం డిచ్చు విషమైన గ్రోలు ; మల్ల
దుర్జనుం డిచ్చు పాలైనఁ దోసిపుచ్చు.

౧౩౦

పుణ్యపాపాల సంబంధమును దృజించి
వాంఛలను వీడు ; మృతి సులభంబె యగును ;
బ్రతికినన్నాళ్ళు సంతోషపడుము ; మిగిలి
యున్న కాలంబు గడచు నేదోవిధాన.

౧౩౧

ఒరులకు దాస్యమున్ సలుపకుండఁ గడిందిబలప్రతాపుఁడై
యొరులపయిన్ బ్రభుత్వమును నొందనిఫక్కిని బండఁబంచయున్
దిరిపెమునెత్తకుండఁ దినుతిండికినై కడియన్నమున్న యా
నరుఁడె కృతార్థుఁ డన్నిటు ననంత దిగంత పురాంతసీమలన్.

౧౩౨

వినుము నెచ్చెలి ! యీ కాల విధముగూర్చి
వగవఁబోవకు ; మేకాంతవాసి వగుచు
విధివిధానంబు నరయుచు వేళ వెళ్ళఁ
బుచ్చువలయును ; వేఱేమి బోధపడదు.

౧౩౩

విషయాసక్తికి లొంగిపోవక మహావేగంబుతోఁబోవు నా
విషరాశింబలెఁదీవ్రవవహ్ని విలసద్విస్ఫూర్తి మైఁదాల్చి పౌ
రుషలీలన్ మనఁజెల్లుఁ గాని, రజమై రోదోంతరాళఁబునన్
దృషితోద్వృత్తినిఁ బోవునట్టి బ్రతు కింకేలా విచారింపఁగన్.

౧౩౪

రాగద్వేషము లాశ్రయించి, విషయభ్రాంతిన్ బ్రవర్తింప ను
ద్యోగింపన్ దగు నీఱగాన విధిసంయోగంబుచే నెందఱో
భోగాపేక్షను వచ్చి పోయిరిటులే ముం దింక రానున్నవా
రేగఁన్ జూతురు ; గాని, యొక్కఁడయినన్ స్వేష్టార్థమున్గాంచెనే ?

౧౩౫

ధనవాంఛన్ ద్యజియించి పోవఁ బ్రతిపాదంబందు వేవేలుగా
ధనరాసుల్ లభియించు ; లేనియెడ నర్థం బర్థిరాఁబోవ ; దే
పనియైనన్ సమకూడలే దని మదిన్ భావింప ; కీదుఃఖ ముం
డిన దీర్ఘంబు ననర్థదాయకము నై డిందించు నీజీవమున్.

౧౩౬

తినుటకు సరిపడు ద్రవ్యం
బును దగు నార్జింపు మధికము గడింపఁగఁ గో
రిన వ్యర్థమునుమ ! జీవిత
మును వృథ గావింప కట్టి మూర్ఖత్వమునన్.

౧౩౭

చీకులు, రొట్టిముక్కలును శీధువు నొక్క రహస్యమందిరం
బో కమలాక్షి యున్న నిఁక నుజ్జ్వలరాజ్యపదంబు నొల్ల ; నా
నా కలుషావహంబయి, యనంత దురంతవిచారఘోర దు
ర్వ్యాకులమై తనర్చెడు ప్రపంచము నీగతినే తరించెదన్.

౧౩౮

రెండుదినాలకైన నొకరే యొకరొట్టె లభించెనేని, నొ
రెండినవేళ నింత జలమిచ్చెడు పెంకు లభించెనేని నే
నొండొరువేడి వాని కొలువుండను ; నాగతి మానవుండె భూ
వుండును ; వానిగొల్చుచును బొట్టను నింపుకొనంగఁ బోదునే ?

౧౩౯

పరు లుచితంముగా నొసఁగు పానకమైనను ద్రావినప్డు నా
కరుచి జనించు దాని శమనార్థము మద్యము ద్రావి తద్వ్యథా
భరమును బాపుకోవలసి వచ్చెను ; నన్యులయుప్పు రొట్టెలోఁ
దొరలు టసహ్య ; మా లవమె దుఃఖము దెచ్చి మనంబునేర్చెడున్.

౧౪౦

జగతీదుఃఖ మొకింత మామనములోఁ జర్చింపఁగా లేదు ; రే
బగ లెం దెప్పుడొ గుప్పెఁడన్నము లభింపన్ జాలు ; లేకున్నచో
వగపే లేదు ; మహానసస్థలములోఁ బక్వాన్నమే చిక్కుచుం
డఁగ నన్యుం గని వేఁడ నేటి ? కది మూఢత్వంబు ముమ్మాటికిన్.

౧౪౧

నీ తనువందు మాంసమును నెమ్ములు గల్గెడుదాఁక నెవ్వనిన్
జేతులు చాచి దేహి యని చేరకు ; ప్రాప్తము నమ్మియుండు ; మా
"హాతిము" మిత్రుఁడైన వినయంబునుజూపకు ; "జాలు" "రుస్తుము"
వ్రాతము శత్రులైనఁ దలవంపకు భీతిలి యెన్నఁడేనియున్.

౧౪౨

విజిగీషన్, నిజబాహుసత్వమున నీ విశ్వప్రపంచంబునన్,
బ్రజచే నెచ్చిన క్రూరఘోర కుటిలవ్యాపార కాలాహతిన్
రజమైపోయినఁ బోదు గాని, యనలవ్రాతంబులోఁ గాలుచున్
గుజనుం డిచ్చు జలంబు నుంత గొన నీకున్ జెల్ల దేనాఁటికిన్.

౧౪౩

మనుజకోటిలోఁ దెలివిగా మసలవలయు
నెల్లపనులందు శాంతిమై నెసఁగవలయు
శ్రవణనయన జిహ్వేంద్రియ శక్తు లెంత
గలిగియున్నను లేనట్లె మెలఁగవలయు.

౧౪౪

ఎంతవఱకు వాసన, రంగు నిచ్ఛయింతు
వేల పుణ్యపాపాలకై యేగుచుంటి
వరయ విషపాత్రమైన నీ వమృతకలశ
మైనఁ గాటి కేఁగుట తథ్యమని యెఱుంగు.

౧౪౫

జనులు నిను దారిఁగని పూజ సలుపరాదు;
లేవఁగారాదు, నిను మ్రొక్కఁ బోవరాదు?
ఈవు "మస్జిదు" కేఁగిన నెన్నఁడేని
గురువుగా నుండ నిను వారు కోరరాదు.

౧౪౬

తెలివి గలదేని, తెలివినే తెలిసికొనుము;
మంచి గలదేని చెడ్డ వర్జింపు; మీవు
గౌరవించినఁ బ్రజ నిన్ను గౌరవించు;
నగుచునే యుండు; నిను నీవు పొగడుకొనకు.

౧౪౭

ఈవు గొప్పవాఁ డగునెడ నెవనికైన
సరియె యిబ్బంది రానీయఁ జనదుసూవె
చావునకు వెఱఁగంద శవమునకును
వగవఁబో; కవి వేళకే వచ్చుచుండు.

౧౪౮

ఉర్విఁ గష్టాలు పడి శ్రమ కోర్వకున్న
భోగములు, నిష్టసిద్ధులు పొందలేవు
కంకతిక వంద బ్రద్దలు కాకయే ప్రి
యాలకంబులు దువ్వగాఁ జాలఁగలదె?

౧౪౯

పరు లాడు తిట్లు చెల్లవు
పరులకు మన మొక్కకీడుఁ బఱపిన నూఱై
చెఱుచును గావునఁ బూనికఁ
ఒరులకు నుపకృతులె సేయవలయును సతమున్.

౧౫౦

నీవు పరుల మేల నెంచిన, వారలు
నీదు కీడు సతము నెంతురేని
వారు మేలు చూడనేరరు; నీవెప్డు
కీడు జీవితానఁ జూడఁబోవు.

౧౫౧

పగవాఁ డాడెడునింద లెప్పుడును భావంబందుఁ జింతింప ; కా
పగతుం డెప్పుడు బాహ్యచక్షువులు లేవన్ నిన్ను వీక్షింపఁ ; డా
వగ హృద్దర్పణమందు వాని మృతరూపంబున్ విలోకించి మా
ఱుఁగ నారోపణ సేయు నొడ్లపయి రౌద్రావిష్టుఁడై క్రూరతన్.

౧౫౨

సజ్జనుల హింస సేఁత పైశాచికంబు
క్రూరమృగభావ మది మానుకొనఁగవలయు ;
కలిమి గలదని భ్రాంతిని గర్వపడకు,
విద్య గలదని తెగ విఱ్ఱవీఁగబోకు.

౧౫౩

అలసుఁడవుగాక, కర్మల నాచరింపు ;
మాగతికి నేను గాపౌదు ; నాసవమ్ము
తెమ్ము ; కలయంతలో నర్థికిమ్ము కొంత ;
అన్యరక్తంబు విత్తార్థ మాసపడకు.

౧౫౪

పురుషుఁడవు కమ్ము ; మమకారమును ద్యజించి
యీషణంబుల చెఱ వీడు ; మిచ్ఛ లెల్ల
బాధ లవి నీకు మార్గావరోధకములు
గాన యవి త్రెంచి చను విశృంఖలుఁడ వగుచు.

౧౪౪

అతిదూరంబు కృతాంతపీథిఁ జని యేర్తైనిందు రా లేదు ; త
ద్గతి గుహ్యంబులు చెప్ప లేదు ; క్షణమాత్రింబైన నీ జీవిత
ప్రతతిన్ నమ్మకుమా ! నిజాశయము జాఱన్ భ్రాంతి నాశాలతన్
క్షితిఁ గాసైనను దాఁపఁబోకు మది భక్షింపంగ రాలే విఁకన్.

౧౪౫

ఓ చెలి ! నిన్ను నేఁ గలియకుండఁగఁ జేతులు చాచి కోరికన్
నీ చెఱఁ గంటుకుండ, విడనేరను ; నీవఱ కేగుదారి యెం
తో చకితంబు, దూరమయి తోఁచిన నేఁ జనిపోదుఁ గాని రా
నోచక వెన్కకున్ మరలనోపఁ బథశ్రమ మెంతగల్గినన్.

౧౪౬

నరకాగ్నింబడు బెంగఁ బొంద ; వవమానంబన్న నీరంబులోఁ
బరితోషంబున స్నానమాడిన భవత్ప్రాయంపు దీపంబు దు
ర్మరణాక్తిశ్వసనంబు లార్పునెడ నిన్ మాయించు నీ భూమియే
శరణంబిచ్చునో లేదో చూడు ; మదియే శంకింతు నశ్రాంతమున్.

౧౪౭

కపట దురంతచింత లెదఁగాంచక మద్యముఁ గ్రోలి, తోషివై
విపులస్వతంత్రతన్ గని, దిగంబరివై, సురసేవనుండవై,
యపహృత వృత్తిఁ బూరుషుఁడవై తరియింపుము ముజ్జగంబు నీ
వెపుడును బూర్ణతత్త్వపద మీగతిఁ బొందెదు నిశ్చయంబుగన్.

౧౫౯

లోకవాంఛల రేవగల్ మునిఁగి యుంటి
వకట! మృత్యువు గల దని యరయకుంటి
హాహాఁ దెలియుము! నీ జగమొరులతోడఁ
బోవనున్నది చూడు! నీ తోవ రాదు.

౧౬౦

విశ్వకర్త నటంచు భావించియున్నఁ
దుదకు విడనాడె దీవు నందొఱును గూడఁ
గుయ్యిడఁగ; నిట్టి లేమిని గూర్చి నీకు
సిగ్గు రాదేమి? యింకేమి చేయఁ గలవు?

౧౬౧

నీవు ధరాధినాథుఁడయి యేలఁగ వచ్చితి వొక్కొ? నాశనా
భావ మెఱుంగ కెంతయును భ్రాంతుఁడ వయ్యెద వేల మేలుకో!
నీవు ననాది లేవు; తుది నీల్గిన నుండవు; సర్వశూన్యమై
పోవుదు వింక నేఁడె తలపోయుము చేసెడి దేమి యున్నదో?

౧౬౨

తెలివినిబట్టి జీవితవిధిన్ నడుపం దగుఁ గాని, నీవటుల్
సలుపఁగనేర వీ ప్రకృతిజాణ ప్రబోధినియై సతంబు నీ
తలపయిఁ దన్ని తిన్నని పథంబునఁ జేర్చుచునుండు; నయ్యెడన్
దెలిసికొనంగనేర్తు విది తీరని తీర్పరివై స్వయంబుగన్.

౧౬౩

సాంతముఁ బాపపుణ్య నిచయంబు నెఱింగిన ధీరులున్ గత
భ్రాంతిని దమ్ముఁ దాము ప్రపంచమునున్ మఱపొంది నిస్పృహ
స్వాంతులు నైనవారును, నిజంబుగ నీ ప్రకృతిస్వరూప దు
ర్దాంత దురంతజాల విషరాశిఁ దరింతు రభీష్టసిద్ధులై.

౧౬౪

మృగయుఁడ వీవు కానియెడ నే మృగయుండ నటంచుఁ బల్కఁగా
దగ ; దటు లేపదార్థము యథార్థ మెఱుంగవొ దానిగూర్చి చె
పఁగ వల ; దట్లె తత్త్వములు పాడకు నేరనిచో నెఱింగి చె
ప్పఁ గలుగుదేని నట్టి బుధవర్గముతోఁ గనుసన్నఁ జెప్పవే.

౧౬౫

త్యాగులఁ గన్నఁ దోడ్పడి సహాయముసేయుము ; వాదభేదముల్
లాగియుఁబాఱవేయు ; మకలంకుఁడ వైన "నుమర్ఖయాము" వా
క్యాగమ మాలకించి మధురాసవపానము, వాద్యగానముల్
భోగములెల్లఁబుచ్చుము ప్రపుణ్యులసేవ సతంబు చేయుచున్.

౧౬౬

ఈ జగతీరహస్యము నెఱింగినవాఁడు సుఖంబు దుఃఖ మే
యోజఁ దలంపఁ ; డీసుఖములో వ్యసనంబులొ వచ్చి పోవు సం
యోజితలీల నీవిల సుఖోన్నతిఁ దేలెదొ, లేక దుఃఖ సం
భాజన మయ్యెదో జడము భంగిని సంసృతిదావకీలలన్.

౧౬౭

వ్యసనములందు నిన్ను బలియై చనుమంచు వచింతురేని, నా
వసతి వియత్తలం బనుచు వాడెదరేని, త్వదీయవాస మీ
వసుధ తిరంబుగా దిఁక నుపాస్యము మిథ్యగదా ! త్వదాత్మలో
బొసఁగఁ దలంపు మీవనలె పుట్టఁగలేదని ; గిట్టు టుండునే !

౧౬౮

ఈవు ధరిత్రి నస్థిరుఁడవేని గృహంబులు కట్టి గర్వివై
పోవుదు వేల ? దీనులను బూర్వులలీలఁ దలంచెదేల ? ఝం
ఝానిలజృంభణంబున నిజంబుగ దీపముఁబెట్టినట్టు లా
శైవలినీప్రగర్భమున సౌధము గట్టినయట్లు గాదొకో !

౧౬౯

"సోసను" నా "సరూ" తరువుఁజూచి స్వతంత్ర లటందు రాద్యు లా
సోసను పెక్కు వాక్కులను శోభిలుచున్న వచింపబోవ దెం
తో సొగసైన నాసరువు తోరపు హస్తములున్నఁ జూపకే
వాసము సేయుఁగావునఁ బ్రపంచము మెచ్చును వానిఁజూచినన్.

౧౭౦

తురగంబుల్, రణ రంగవస్తుచయముల్, తోరంపురత్నంబు, లం
బరపంక్తుల్, నడుమంత్రపుం గలుములున్ భావించి గర్వించి సం
బరమున్ బొందకు ; కాల మేరి నయినన్ మన్నించెనే ? నేఁడు సుం
దర భాండంబును, జేపు దాకను ద్రుటిన్ దన్నున్ రజంబైచనున్.

౧౭౧

ఈ దుష్కాలము పెక్కుమంది బలి గావించెన్ దయాశూన్యయై
భూదేవిన్ జనియించుపుష్పచయ మా బూదిన్ రజంబై చనున్
గాదే యో యువకాగ్రణీ ! సొగసుకై గర్వింపఁగాబోల ; దా
లేదవ్వన్ వికసించి యెన్నివిరు లోలిన్ రాలెనో చూచితే.

౧౭౨

శక్తివంచన లేకుండ, సాధుసేవ
నప్రమత్తుఁడవై చేయు ; మస్థిరంబు
మహిత సౌందర్య మనెడు సామ్రాజ్యపదము
నిన్ను విడనాడి పోవు దాకొన్ననేని.

౧౭౩

ఎల్లవారిచే నుతిఁగాంచ నెంచెదేని
పూని "యూధు" వైనను, "ముసల్మాను" వైనఁ
"గ్రైస్తవుని" వైనఁ జాతునఁ గానియేని
తిట్టఁగా రాదు వానితీ రెట్టిదైన.

౧౭౪

కామార్థము నీ ప్రాణము
వేమాఱును గష్టపెట్టి వేచెద వేలా
నీ మాయాసంసారము,
కామితము లొకప్డు నిన్నుఁ గడతేర్చుఁ జుమీ.

౧౭౫

ఎల్లలోకంబు తగ సంస్కరించు ఫలము
సాధుహృదయార్తిఁదీర్చిన సాటి గాదు
వేయి బానిసలను విడిపించు ఫలము
ఒకని దయ నోముఫలమున కోప దనఘ.

౧౭౬

ఈశ్వరునిఁజెప్పుగురుని నార్జింపు, మెపుడు
మృత్స్వరూప "కాబా" ల నూటింటి కంటె
సాధుహృదయంబె పూజ్యంబు సాధుసేవ
సేయు మెపుడు "కాబా" యాత్ర సేయ నేల.

౧౭౭

మనసులో గర్వవాంఛలు మానుకొనుము
దర్వి ఫలసిద్ధి తనజన్మఁ గాంచలేఁడు ;
అంగనలముంగురులభంగి వంగనేర్చు
మనువుతంతువులు తెగి మ న్నవకమున్నె.

౧౭౮

పరుల వంచించి సంతోష పడెదవేని,
పుడమి బ్రతికినన్నాళ్ళు నీ బుద్ధికొఱకు
వగచుచుండెద ; విట్టి నీ బాధ చూచి
కుమతి వీవని జను లనుకొందు రెపుడు.

౧౭౯

ఏటి కుషస్సునందు నెలుఁ గెత్తి పదేపదె కుక్కుటంబు జా
కోటలు మాఱుమ్రోయఁగను గోక్కొరొకోయని, కూయుచుండె నా
నాఁటికినాయు వొక్కొక దినంబు నశించు నటంచుదాని కా
పూటను నర్థమున్ దెలుపఁ బోలుఁ బ్రమత్తతనేర పీ వదిన్.

౧౮౦

ఏవి యెన్నాళ్ళ కయినను గావొ యింక
నామనోరథములు సిద్ధి యగుట కల్ల
అట్టిజిజ్ఞాస వృద్ధుఁడ వగుటకంటె
వాని వర్జించి వ్యసనంబుఁ బాయు టొప్పు.

౧౮౧

శత్రు విడుబాధలను జెప్ప మిత్రునొద్ద
కేగి తనకష్టములు చెప్ప సాగినప్పు
డతఁడె బాధింప పరుషోక్తు రాడెనేని
చేయఁగలకార్య మున్నదే చెప్పు మింక ?

౧౮౨

స్వేచ్ఛోపభోగము

మా మధుశాలనుండి యొక మాఱు ప్రభాతపువేళ శీత వా
తాముఖమైనయొక్కపలు కల్ల వినంబడె "ఓవిరాగి ? యో
ప్రేమరసస్వరూప ! నిదురింపకు లెమ్మిఁక నాసవంబుతో
నీమధుపాత్ర నింపు ; బ్రతు కింకముగింపకముందె" యంచొగిన్.

౧౦౩

జీవికి నూత్నజీవకళఁ జేర్చెడు నీమధు వెంతొ పాత్రలో
నీవిఁక నింపి తెమ్ము ; విసిఁగింపక నాకరమందుఁ బెట్టు ; మీ
భూవలయంబు మిథ్య త్రుటి బోయినఁ బోవును జీవితంబు రాఁ
బోవదు వెండియున్ బగిలి పోయిన భాండచయంబు కైవడిన్.

౧౦౪

జేపున కేరుఁ బూటుపడి రిక్తులు గా రటుగాన నేఁడె సం
తాపములన్ద్యజింపుము సుధాంశునిభాస్య ! సుధాంశుఁడున్నయీ
మాపు విలాస మేర్పడఁగ మద్యముద్రావుము ; చంద్రుఁ డెప్పుడున్
గాఁపుర ముండు మింటను ప్రకాశముతో మన ముండినేర్తుమే.

౧౦౫

ఆ మధుపాత్ర నాకరములందిడు ; నాహృదయంబు తప్తమై
యేమియుఁ దోఁచుకున్నది ? యిసీ ! రసమట్టుల పోవు నాయు ; వీ
భూమిని గల్మికై వగవఁ బోకుము ; లెమ్మిది స్వప్నతుల్య మో
భామిని ! యౌవనంబు మధుపానముచేతఁ బ్రశస్తి గాంచెడున్.

౧౦౬

లెమ్ము మనోహరాంగి ! నటు లీల భవన్ముఖకాంతిఁ జూపి తా
పమ్ము శమింపఁజేయు మధు పాత్రను గైకొని రమ్ము ! త్రావి హ
ర్షమ్మునఁ బాడుకొందము ; శరత్సమయం బిది జాగు చేయుచో
నిమ్మెయి మట్టిలోఁ గలిసి యేకలశమ్ములో యౌదు మావలన్.

౧౭౬

బ్రతుకు రెన్నాళ్లు మధువును ద్రావుమింక
జరిగిపోయిన కాలంబు తిరిగి రాదు
నీ చెడుగుఁగోరు నీధాత్రి నీవుగూడ
తేయుఁబగలును ద్రాగు మైరేయ మరసి.

౧౭౭

చెల్లనిడబ్బు మాకడను జెల్లదు మానిలయంబు పొచి రా
గోల్లసమన్నఁ జీపురుగ నూడ్చుచునుండు నుషస్సులందు మై
ఝల్లన నొక్క వృద్ధు మధుశాల కవాటము విప్పిచెప్పె నీ
కల్లును ద్రావుమీవు చిర కాలము లేవవటంచు నిద్దురన్.

౧౭౮

కడుపు నిండఁగ నీవు కాదంబరిని ద్రావు
మావల నిది యలభ్యంబుచూవె
సహచరులను రోసి సతులతో జతఁ బాసి
వసుధను నిద్రింప వలసివచ్చుఁ
గావున జాగ్రత్త! కడురహస్యం బిది
యెవ్వారికిని వినిపింపరాదు
ఏమన్న నిది విన్న నిల నన సైతము
వికసించుటకు నెద వెఱచుచుండు.

౧౮౦

లెమ్ము తొలకరివాన పూరెమ్మ లెల్ల
క్షాళనముఁ జేసెఁ గైకొమ్ము చషక మింక
నేఁడు నానంద మిడు సస్య నిచియమెల్ల
జేపు నీగోరిపై మొల్వ నోపుగాదె.

౧౯౨

ఒక ముహూర్తంబులోఁ బాపి యొందు సుకృత
మొక ముహూర్తంబులో మూర్ఖుఁ డొందుఁ దెలివి
నట్టి యీ ముహూర్తమె సుఖ మందుఁగడపు
మొక ముహూర్తంబె గద మన కుర్వి బ్రతుకు.

౧౯౩

కాలము నిన్నుఁ గష్టముల కైవసమున్ బొనరించి యెఁదొ యే
వేళనొ ప్రీతియౌ నుసురు పీల్చును నచ్చెరువంద నీవు నా
నాలుగునాళ్ళు శాద్వలమునన్ విహరించి సుఖింపుమోయి నీ
కాలముదీఱి గోరిపయి గడ్డి జనింపకమున్నె మానివై.

౧౯౪

తొలకరులన్, వసంతములఁ దొయ్యలులన్ జతగూడియున్ గులా
బులు గొనునట్లు పాత్రలను బోసినమద్యము వేడ్కతోఁ గరం
బులఁ గొని త్రావు మీక్షణము పోయిన మృత్యువునిన్ను మట్టిలోఁ
గలుపఁగ వేచియున్న దనుకంపఁ దలంప దొకించు కేనియున్.

౧౯౫

శారద చంద్ర చంద్రిక, ప్రశాంతనిశాసమయంబు ప్రేమ యే
పారెడు నేఁడు కాంత! మధుపాన మొసంగుము! జాగు సేయ కా
ఘోరవిదగ్ధ మృత్యు వదిగో! జ్వల దగ్నికణంబురీతి నే
దారినొ వచ్చి మీఁదఁబడి దగ్ధ మొనర్చు; నెఱుంగుమీ మదిన్.

౧౯౬

సుమములు పూచి, విచ్చి కడు సొంపులుగుల్కుచునున్నయట్టియీ
సమయముఁజార్పకే మధురసంబును ద్రావుము ; పెక్కునాళు లీ
సుమములు నిల్చి యుండ వటు చూచుచు నుండగ రాలి నేలపైఁ
గమరును ; మున్నె యేరికొనఁగాఁదగుఁ గాదె సరోజలోచనా !

౧౯౭

ప్రేయసిలేని ప్రపంచము
గాయకతతి లేని వాద్యగణమును, సుఖమున్,
హాయియు, లేనివయన్ను వృ
థాయగు లోకప్రవృత్తిఁ దర్కించునెడన్.

౧౯౮

నీ తపఃపుష్ప మిటు వికసించి యుండ ;
నేల నీచేత మధుపాత్ర యెసఁగలేదు ?
మధువు త్రావుము ; తిరిగి యీ పథము రాదు
పొంచి యీకాల మెపుడొ వంచించు నిన్ను.

౧౯౯

నెల యీయామినికొంగు చించి ధరణిన్ వీక్షించు నీరేయి వె
న్నెలలో శీధువు ద్రావు మిట్టితటి రానే రాదు నీకింక నీ
నెల గోరీల వెలుంగువెన్నెల నొగిన్ నీరాంజనం బిచ్చెడిన్
గలకాలం బటుగాన నీవది యెఱుంగన్జాల వావంతయున్.

౨౦౦

ఆమని నభ్రములే గురియ నా జలధార నెడార్లుఁగూడ శో
భామహితంబు లయ్యె ; వరవర్ణిని నొక్కతెఁ గూడి శాద్వల
శ్యామలసీమ శీధుకలశంబులఁ ద్రావుము ; నీసమాధి నీ
సోమలతాళియే మొలుచుఁజూవె యెఱుంగక జాగుచేసినన్.

౨౦౧

కాలమును వృథ సేయఁడు జ్ఞాని యెపుడు
ధ్యాననిష్ఠనో, యిష్టాప్తిఁ దనరుకొఱకో
వైభవంబుల స్వేచ్ఛానుభవముకొఱకో
సురను ద్రావుటలో వ్యయ పఱచు నతఁడు.

౨౦౨

ఆయువు పోవుచుండ "బదదాదు, బలాఖుల" రాజ్య మేల నీ
ప్రాయము నిండుచుండ మధురంబని చేదని భేద మేల మై
రేయము ద్రావి హాయి నిదురింపుము ; నీవెనుకే సుధాంశుఁ డే
రేయిని వచ్చి క్షీణతను వృద్ధిని జెప్పుఁ ద్వదర్థ మారయున్.

౨౦౩

ఈవు నశించి పోక మునుపే సుర ద్రావుము ; దానికైపు నీ
భావవికారదుఃఖములఁ బాపును ; నీముడి జాఱిపోకముం
దే వనితాలలామనొ వరించి తదీయవరాలకంబులన్
బూవులు చుట్టి జుట్టుకొనముళ్ళను విప్పుము మోద మందుచున్.

౨౦౪

సొగసుల కాలవాలమయి చూచెడు నీజగ మంధకారమై
తెగువను వచ్చి ఱిచ్చవడఁ దీసుకపోవును ; నిట్టు లెందఱో
యెగిరి నశించినారు ; మఱియెందఱొ రానయి యున్నవార లీ
వగ సహజంబు గాన మనవంతు సుఖంబుల మాను టొప్పునే.

౨౦౫

మృత్యువు గంతువేసి నిను ద్రింగక పూర్వమె మద్యపాత్ర నౌ
చిత్యము మీఱఁ దెమ్మని వచింపుము ; నిద్దుర పోదువేల ? యా
ద్ధత్యముతోడ నిన్నెపుడొ ధాత్రిని బూడ్చి సమాధి సేతు రా
కృత్య మెఱుంగవో ? తిరిగి యెన్నఁటికైనను బైకి వత్తువే ?

౨౦౬

నాకన్నీళ్లు సముద్రగాములయి నన్ ముంచె ; నాయేడు ప
య్యాకాశంబున కంటె దేబవలు ; కాంతా ! యెందు దాఁకొంటి వ
య్యో ! కల్పాంతముదాక శీధువును నీతోఁ ద్రావవాంఛింతునా
హా ! కాలం బొకపూటయైన గడుపీయంబోవ దర్శించినన్.

౨౦౭

ఆయువు నమ్మి గర్వపడ రార్యులు ; చచ్చిన నేడొ, ఱేపొ నీ
కాయము మట్టిలోఁగలిసి కైవసమౌను, బ్రజల్ ద్వదీయ మృ
చ్ఛాయను జేతు రెన్నొ కలశంబులఁ గావున శీధుపానమున్
జేయుము బంధమోక్షములఁజెందవు హాయిగ మోదమందుమా.

౨౦౮

కోపము నిన్నుఁ బట్టుకొనకుండఁగ దుఃఖము నిన్ను జన్మసం
తాప దవాగ్ని ద్రేల్చఁగ వ్యథన్ జెడకుండ, ధరిత్రికొంగులో
గాఁపుర ముండుకోఁ దలఁచు కాలము పైఁబడకుండ, శీధువున్
రేపవ లారగింపుము సరిత్తట శాద్వలపుణ్యభూములన్.

౨౦౯

ఱేపె వియోగ మాఱును ; సదృష్టసుమంబులు వీడనున్న వీ
మాపు ప్రశాంతమై వెలయు మద్యము ద్రావెడువేళ వచ్చె నీ
వైపు ప్రసన్నయై వెలఁది పాడుచు నున్నది యిట్టిసౌఖ్య మి
ప్డే పడయంగలేనియెడ నెప్పుడు పొందెదవో వచింపుమా.

౨౧౦

పువ్వులఁబోలు నట్టి పువుబోణులనే జతగూడ నెంతు ; నే
రవ్వయినన్ సురాసవము గ్రోలెడుపాత్రలఁ గేలఁ దాల్తు ; నీ
జవ్వన మీశరీరమున జాఱకమున్నె ప్రపంచసౌఖ్య మే
వెవ్విధినైన నేఁ డనుభవించెద ; ఱేపు నశింపకుండగన్.

౨౧౧

చారు నదీతటంబులను, సైకతసీమల, శాద్వలంబులన్
జేరి, జగంబు మై మఱచి శీధువు గైకొని సంచరింపు ; మీ
ధారుణి జీవితంబు సుమదామముకైవడి మూడునాళ్ళదై
జాఱును గాన నవ్వుచునె సాగుము ఫుల్లసుమాళిఁ బోలుచున్.

౨౧౨

ఆయువు చెల్లిపోవు పవనాహతి నున్నది మిత్తిచేతిలోఁ
గాయము వాయుకాల మురగంబయి పైఁబడనున్న దిఁక నో
తోయజనేత్రి ! సంతసముతోఁ జషకంబునఁ దెచ్చి యిమ్ము మై
రేయము ; జాగు చేసినను మృత్తిక కానయియుంటి మియ్యెడన్.

౨౧౩

వయసను దుస్తు నవ్యమును భవ్యము నై యలరారఁబోవ దా
రయ జగ మెప్డు నీయవసరంబులు కోర్కెలు దీర్పఁ బోదు ; ని
శ్చయ మిది, దుఃఖశాంతి కలశంబులఁ ద్రావుమి మద్య మింక నీ
మెయికలశంబు బ్రద్దలయి మృత్తికతోఁ గలశంబు లయ్యెడున్.

౨౧౪

ఏ నొక భూబిలంబున వసింపక పూర్వమె నాశరీరపున్
రేణువులెల్ల మట్టియయి రేగక పూర్వమె యో సురా ! ఘటా
ధీన సమాధి వీడి చనుదెమ్ము ! నినున్ గని చచ్చియున్న యీ
మానసజీవముల్ బ్రదుకు మార్గము లేర్పడునేమో చూచెదన్.

౨౧౫

రేయను నీలచర్మము హరించె నుష స్సిది ; నిద్ర లేచి నీ
తోయజపత్ర నేత్రములతోఁ గనవేమి, మనోహరాంగి ! మై
రేయముఁ దెమ్ము ; ముందు నిదురింపగవచ్చును బెక్కునాళ్ళు వా
పోయి సమాధిలో నిటికి భూబిలమందు శవంబు పేరిటన్.

౨౧౬

కాలము పోవుచున్నది ; సుఖంబుగఁబుచ్చుము ; ప్రాణిప్రాణ మే
వేళను బోరుతో విసిఁగి వేసరుచుండు ; సతంబు ధాత్రిపైఁ
గ్రాలు ప్రజాశిరఃకలశరాజి యొకానొకనాఁడు భిన్నమై
రాలి కులాలుపాదయుగళంబుయి ద్రొక్కెడు మట్టియౌఁ జుమీ.

౨౧౭

ఆనందింపుము నేఁడె ; దుఃఖములు రానైయున్న వీపైని ; నీ
మేనున్ మిత్తికిఁ జిక్కి మృత్తికయగున్ మేల్కొన్నరెన్నాళ్ళ నీ
వానందించుచు నాసవంబుఁగొని దుఃఖాసక్తి వర్జింపు మీ
ప్రాణుల్ నిక్క మటన్నవారలకె దుఃఖాసక్తి నీకేటికిన్ ?

౨౧౮

లెమ్ము ! ప్రభాతకాలము చెలీ ! యిది ; మద్యము గాజుపాత్రతోఁ
దెమ్ము మనోహరాకృతినిదీర్చి ; ధరిత్రి వినాశనాలయం
బిమ్మెయి నీకు నిందు సుర నిచ్చుట చాల ననుగ్రహించియే
సు మ్మిది వ్యర్థపుచ్చునెడఁ జూడవు నీ విఁక నీవిలాసముల్.

౨౧౯

కలశము నిండ మద్యమును గైకొని రమ్ము ; సదా స్వతంత్రతల్
గలిగినవారి కీ మధువు గౌరవమిత్రము ; మర్త్యులెల్ల మృ
త్కలితులు ; తీవ్రమారుతము కైవడి నాయువు పోవుచుండఁగా
దెలియవె నెచ్చెలీ ! సురను దెమ్మిఁక నాఁగము వేళ దాఁటినన్.

౨౨౦

శ్రేయము లేదు వాదములచేఁ జెడి రుగ్ణత సెందియుండు జీ
ర్ణాయువు నమ్మియీయిహము నందు నెవండుకృతార్థుఁడయ్యె ? మై
రేయము, తోయజాక్షుల వరించి వినూత్న విలాస సంపదన్
హాయిగఁబుచ్చు నొక్కక్షణమైన ఘనంబనియెంచు మెంతయున్.

౨౨౧

పాడు ప్రపంచదుఃఖములపైఁ దెగ బూడిదఁ బోసివేసి పూ
బోఁడులతోడ మద్యమును బూర్తిగఁ ద్రావుచు సంచరింపుమే
నాఁడు ; "నమా" జదేల వ్రత నైష్ఠికకర్మ మదేల ? చచ్చి పై
కోడకపోయినట్టి నరుఁడొక్కఁడు వచ్చినజాడ యున్నదే.

౨౨౨

కాలరహస్య మెవ్వరికిఁగాని యథార్థ మెఱుంగనీయ దా
యాలయమందునెందఱు "మహమ్మదయాజులు" వచ్చికూలి పోఁ
జాలిరొ ? యాయువన్న దొకసారిదె ; పోయినవారు మళ్ళ రాఁ
జాలరు ; మద్యపానవివశంబునఁ బుచ్చుము జీవితాంతమున్.

౨౨౩

ఇదియె ప్రభాతకాలము చెలీ ! యిఁక నిద్దుర లేవవేమి ? యీ
మదిరను ద్రావి పాడు మల మద్దెల మీటుచుఁ ; జూచు నీ సభా
సదులు సతంబుగారు ; మనఁజాలరు ; పోయిన మళ్ళిరారు ; సొం
పొదవఁగ నేఁగినట్టి నరుఁ డొక్కఁడు వచ్చెనె చెప్పు మంగనా !

౨౨౪

రేయుఁబగళ్ళు నాయువు హరించుచున్నవి ; యింక ముందు నీ
కాయము మట్టిలోఁ గలుపుఁ గావున సంతసమందె పుచ్చు నీ
వాయువు రెండునాళ్ళ, ధరయందున నీవు తిరంబు గావు, యీ
రేయుబవళ్ళు మాఱవు స్థిరీకృతరీతిఁ జెలంగు నెచ్చెలీ.

౨౨౫

ఈవు సురాసవాప్తి మదినెంతయు సంతసమొందు ; మింక రా
జీవవిలోల లోచనలఁ జేరి ముదంబున నుండు ; మున్న నీ
జీవిత మెల్ల సంతసముచేతనె పుచ్చుము ; ధాత్రి మిథ్యగా
దీవు వచింతువేని, మఱి నీవును మిథ్యయె గాదె నెచ్చెలీ.

౨౨౬

కడచిన దుఃఖసంతతులకై పగఁజెందకు ; ముందు వచ్చి పైఁ
బడునను కష్టముల్ దలఁచి బాధ వహింపకు ; నీచమైన యీ
పుడమి ద్వితీయభాగమగు భోగపరంపర లొందు మింక నీ
మెడపయిఁ గాలనాథుఁ డదె మృత్యుకృపాణము నెత్తి వచ్చెడున్.

౨౨౭

ఓయి "ఉమర్ ఖయాము" కవి ! యుర్వియ దుఃఖితుఁగన్నయప్డె పాత్రి
ధేయతఁ జూపుఁగావునఁ బదేపదె మద్దెల మేళతాళమున్
మ్రోయఁగఁ ద్రావుమీ సురను బోసినభాండము లెత్తియెత్తి ; నీ
కాయపుభాండమే పగిలి ఖండములై పడిపోక పూర్వమే.

౨౨౮

లెమ్మికఁ దెల్లవాఱినది ; లీల నిశాంగనకొంగు ముక్కలై
యిమ్మెయి నేల రాలినది ; యేటికి దుఃఖితఁబోలె నుందు ? వో
కొమ్మ ! సురాసవంబు గయికొమ్ము ! ప్రభాతము లిట్లెయుండు నీ
నెమ్మొగమందువాలుచును ; నీ మొగ ముండదు పోవు బూడిదై.

౨౨౯

ప్రాణము పూతమైనది ; పరాత్మనివాసము వీడి మృణ్మయం
బైన త్వదీయదేహ గృహమందున విందుల నారగింపఁగాఁ
బూనిక వచ్చె ; మద్యమును బోయుము లెస్సగఁ దృప్తి దీఱ నీ
మేనున కొక్కవందనము మేలని చెప్పియుఁ బోకపూర్వమే.

౨౩౦

పువ్వులతోడఁ దూఁగు పువుబోఁడులతో జతగూడి, మద్యమున్
నవ్వుచుఁ ద్రావు ; మల్ల మరణంబను వాయువు నీతనూలతన్
జవ్వన రాల్చివేయును ; వసంతమునన్ వికసించు పువ్వునన్
నెవ్వగఁ గాల్చు గ్రీష్మమది ; నేరక పోవిడరాదు కాలమున్.

౨౩౧

రాసక్రీడలఁ గూడి యాడుదము సంరంభంబుతో లెమ్ము ; రా
కాసిన్ గాసిని నెత్తిఁ దన్నుద ; ముషఃకాలం బదే వాయువుల్
శ్వాసన్ బీల్చుద ; మీ ప్రభాతములు కుప్పల్ కుప్పలై వచ్చు ; ని
శ్వాసంబుల్ మనకుండ వెప్పుడు నుషస్సౌరభ్యముల్ చూడఁగన్.

౨౩౨

అనలమురీతి నాకసమునందుఁ జరించిన, మంచినీటి తీ
రునఁ బరిశుభ్రతన్ గలిగి రూఢిఁ దనర్చిన నొక్కనాఁడు బూ
డిన మనపోక తప్ప ; దిల దేహము బూడిద గాన నీ జగం
బనిలమురీతిఁ జేయును ప్రయాణము శీధువు నిమ్ము త్రావెదన్.

౨౩౩

మమ్ము జగంబు వాగుడుల మాయల దింపకమున్నె యొండొరుల్
కమ్మని శీధువానెదముగాక ! మహామరణంబు వచ్చి మా
ఱొమ్మును జీల్చుచుండినను రోసి జలాంజలిఁ దెచ్చి పోయు మం
చెమ్మెయిఁ గోర మెవ్వరిని ; నీస్సితసిద్ధిని విశ్వసింపుచున్.

౨౩౪

ఎన్నాళ్ళీగతి హేతువాదముల నెంతే నమ్మి జీవింతు మా
పన్నుల్ వోలెశతాబ్దముల్ భ్రమఁ దృణప్రాయంబుగాఁబోయెనో
యన్నా శీధువుఁదెమ్ము త్రావుదము నిత్యానందమున్ గూర్చు ; ని
క్లెన్నాళ్ళున్నఁ గూలాలునింటఁ జను మన్నై యౌదు మూహించినన్.

౨౩౫

ఈ జన్మవెనుక ధరపై
రాఁజన దిఁక జన్మ బంధురాజిఁ గలియ నిం
దీజన్మ మహాభాగ్యము
గాఁ జూడుము తిరిగి దీని గానఁగ నగునే.

౨౩౬

ఏమృతి యన్నభీతిఁ బరువెత్తితివేని దళంబురీతి నెం
తే మహి రాలె దాయువను వృక్షమునుండియుఁ; గాన సంతస
శ్రీ మహి నొప్పి లోకమును జిందఱవందఱఁజేయు మింక ముం
దేమగునో, కులాలకుని యింటను మట్టిగ మాఱకుండఁగన్.

౨౩౭

తలయున్ దోఁకయు లేని కాలగతికై తర్కించు చెన్నాళ్లు వి
హ్వాలవృత్తిన్ వగఁ జెందనేర్తు? నిలఁ జావన్ దప్ప; దీచావులో
పల ద్రాక్షరస మిమ్ము; ముఖ్యమగుభావం బిందులో నున్నదో
లలనా! వ్యర్థవివాదపద్ధతులఁ గాలం బేల పోకార్తువే?

౨౩౮

కోయిల కంఠమెత్తి యదె కూయుచు నున్నది; మత్తకాశినుల్
సోయగ మొప్ప మద్య మిడుచుండిరి; దానినె పుచ్చుకొమ్ము; తె
మ్మోయి సఖా! వనాంత వికచోజ్జ్వలపుష్పములెల్ల నేఁడు రే
పే యిటనుండి వేడ్క విహరింపు మటంచు వచించుఁ జూచితే.

౨౩౯

ఏవగలాడి! యా రససముజ్జ్వలమౌ చషకంబు నెత్తి తే
వే! వెస నీనదీతటిని నింపగుశాద్వల వీథులం దొగిన్
ద్రావుద; మెందఱో వికచతామరసాక్షుల మ్రింగ యీంగం
బీవిధి భాండపంక్తి సృజియించుఁ దదీయ తనూలతాళిన్.

౨౪౦

కాలము నిన్ను, నన్ను వెసఁగైకొని ప్రాణము లూడ్చివేయ వే
లీలల వేచియున్నది చెలీ ! సురశాద్వల వీథులందు రా
వేలను ? ద్రావఁబోవుద మదే మనదేహపు మెట్టికైని తీ
పూలును, దీవలున్ మొలక పూర్వమె వేడుక చూత మంగనా !

౨౪౧

ఓచెలి ! నిర్విచార వయియుండుము ; కాల మదేమి చేసినన్
జూచియు ఖేద మొందకుము చూడు ! త్వదీయ శరీరవస్త్రముల్
పీచయిపోవ నున్న వలివేణిరో ! కర్మ. మకర్మ, ముచ్చమున్
నీచము నున్నదే ? జగ మనిత్యము దీనివిచార మేటికిన్ !

౨౪౨

అఱువ దేఁడులకన్న నీ వధిక ముందు
ననకు ; మెటు కేఁగినను, గామి వగుచుఁ బొమ్ము ;
త్వత్కపాల భాండము లమ్మఁబడక మున్నె
పొమ్ము కలశాలి విడక వే యమ్ముకొమ్ము.

౨౪౩

కోవిదకోటి వీడి, యొకకోమలి ముంగురులన్ వరించి, వి
ద్యావిద ! మద్యపానమును హాయిగఁ జేయుము ; కాల మింక నీ
జీవధనంబు గైకొని విశీర్ణత నీరుధిరంబు చేరలన్
ద్రావగనున్న దీమధువు ద్రావుము నీవడి చూడకుండఁగన్.

౧౪౪

అలరు వసంతకాల పవనాహతిఁ బువ్వులకొంగు విచ్చె ; "బుల్
బులు" చని సంతసించెను బ్రఫుల్లసుమాళినిగాంచి కాంచి ; యీ
యలరుల మాడ్చు గ్రీష్మము లయాకృతి ; నీగతె నీకు, నాకు నె
చ్చెలి ! సురఁదెమ్ము త్రావుదము జీవములూడిన వేడ్కలున్నవే ?

౧౪౫

ఓ వెలదీ ! సుగంధరుచిరోజ్జ్వల శీధురసంబుఁదెమ్ము ! యీ
జీవవివాద వాంఛలఁ ద్యజించెద మద్యఘటంబు నిమ్మదే
యీవును, నేను, గాలహతి నీల్గి ఘటంబులు కాకపూర్వమే
త్రావి పలాశపాన్పుల ముదంబునఁ బుత్తము శేషకాలమున్.

౧౪౬

ఓ లతాంగి ! పువ్వులు పూచి యొలయుచుండె
వ్రతసమాధుల వర్జించి హితసమాధి
వననదీతటముల మద్యపానరతులఁ
దేలుమీ ! మిత్తి నెత్తిపైఁ గాళ్లు నదిగో !

౧౪౭

జ్యోతిలో నగ్ని డాఁగినరీతి దాఁగి
యున్న నిను నార్చు మృత్యు వాయుదకమట్లు
వసుధ మృత్పిండ మని పాటు పాడ వేమి ?
ప్రాణ మొక గాలి ; చెలి ! సురఁద్రావరాదె ?

౨౪౮

ఆనందింపవొ యీయుషస్సమయసంధ్యారాగ మీక్షించి తె
మ్మా నీలాలక ! రాత్రి ద్రావఁగను బైనున్నట్టి మద్యంబు తె
మ్మా నానోటను బోయు ; మీగడియ యెంతేవేడ్కఁ జేకూర్పుమీ
యానం దాఁటిన మేలు బూడిదయి పోనైయుంటి మత్యంతమున్.

౨౪౯

ఆ కలశమందుఁ గల మద్యమంత వలవ
దొక్కచషకంబు నాకును నొక్కచషక
మీవుఁ గొను మంతె చాలును ; నీవు నేను
వసుధఁ గలశంబులుగఁ జేయఁబడక మున్నె.

౨౫౦

సామజయాన ! యీదిన ముషస్సును, సంధ్యల వ్యర్థపుచ్చఁబో ;
కా మధు విందుఁ దెమ్ము ; క్షణమైనను మాకిడ నాలసింప ; కీ
యామని గ్రీష్మకాలముల "కైకుసురూ, జమషీదు" లెందఱో
భూమిని నిర్గమించి రివిపోవుచు వచ్చుచు నుండులోపలన్.

౨౫౧

ఇల కృతజ్ఞతఁ జూపెనే యెవరికైన ?
నెందఱో పరీక్ష చేసియే డిందినారు
గాన సాగినచోఁ బ్రతిక్షణముఁ గూడ
మద్యమును, మానినిని వీడి మసలఁజనదు.

౨౫౨

ఏను సురాపణాన నొకవృద్ధునిఁగన్గొని "పోయినట్టి యె
వ్వానినినైనఁ జూచితివె పార్థివ ?" యం చడుగంగ నాతఁడున్
"నే నననేల ? నావలె ననేకులు పోయిరి మున్ను ; వా రిఁకన్
గానఁగరారు చూవె ! సురగైకొను" మంచును జెప్పె బోద్ధయై.

౨౫౩

లెమ్ము చషకమ్ము, మధుకలశమ్ముఁ గొమ్ము
పోవుదము చెలి సెలయేటి పొంతలకును
నెట్టిసుందరులకును గాల మెన్నిసార్లు
కలశచషకంబులుగఁ జేయఁ గలిగెనొక్కొ ?

౨౫౪

గ్రహసప్తంబులు నాల్గుభూతములు నిన్గల్పించె ; నీ వీ మహా
మహి జంబాలమునందుఁ జిక్కితివె యీమద్యమ్ముఁగైకొమ్ము ! యీ
విహితం బెన్నియొసార్లు చెప్పితిని నీవిశ్వంబునున్ వీడినన్
మహి కింకెప్పుడు రావు శాశ్వతముగా మాయించు నీయంశమున్.

౨౫౫

కలుములె గల్గునో, వెతలె గల్గునొ జీవితమందు సౌఖ్యమే
గలుగునొ, లేక దుఃఖములె గల్గునొ యేమని చెప్పనేర్తు ? లో
పనికిని బీల్చుగాలి విడువంబడునో, తెగి యంతరించునో
తెలియదు గాన మద్యమునుదెమ్మిటుఁ బాత్రల నింపు నెచ్చెలీ !

౨౩౬

ఎన్నాళ్ళు వెతలఁ బడియెద
వెన్నాళ్ళీజగతి దుఃఖమెద నేర్చెద వా
పన్నుఁడ వై సురఁ ద్రావు మ
ఖిన్నుఁడవై బ్రతుకు బ్రతుకు గెడయక ముందే.

౨౩౭

క్షణికంబైనది ధాత్రి ; నే నొక క్షణాకాంక్షన్ బ్రవర్తింప నుం
టిని ; యిందెన్నిముహూర్తముల్ గలుగు నేఁడే వేడ్కవెచ్చింపఁ జె
ల్లును ప్రాణంబులు నున్న వింక నిటుపై లోకం బవిశ్వాసి యె
వ్వనివెంటన్ జన దీముహూర్తమె మహాభాగ్యంబుగా నెంచెదన్.

౨౩౮

రహస్యము

అల్పులకు రహస్యంబెల్లఁ దెల్పరాదు
అనధికారులు బోధ కనర్హులు గద !
అవయవంబులలో ముఖ్యమైన కన్ను
కంటిఱెప్పలలో దాఁచు చుంట లేదె ?

౨౩౯

ఈ మహాగ్రంథమున జగతీరహస్య
మెల్లఁ గలదు గాని ప్రజ గ్రహింపలేదు
ప్రజలు వ్యర్థు లియ్యది విన్నఁ బ్రాణహాని
గాన మేమును నిది చెప్ప మానినాము.

౨౬౦

అఘవంతుఁ డైనఁ బుణ్యాత్ముఁ డైనను వారిఁ
జేరి నా హృదయంబుఁ జెప్ప లేను
ఒకరహ్యము నా హృదుదధిలోపల నున్న
దది చాలా పెద్దదై యలరుచుండు
దానికిఁ దగిన వ్యాఖ్యానంబు గావింప
లేని ఫక్కిని నుంటి నేను మఱియు
ఏ యొకనికి నైన నీ రహస్యముఁ జెప్పి
పోవుదమన్నను బొసఁగఁబోదు.

౨౬౧

నిరాశ

హితములు గూర్ప దెప్పుడు నభీష్టములం దొకటైనఁ జేర్ప దీ
క్షితి ; సుకృతాప్తికై యలరి చేరెఁడుగింజలు దైవ మియ్యఁ డం
చితమతి దుష్కృతాప్తికి నిషిద్ధఫలంబులు దయ్యమియ్య దీ
గతి విఫలంబు జీవిత మగాధము ప్రీతి యొసంగ దేయెడన్.

౨౬౨

జీవిత మెల్లఁ బువ్వులును శీధువు వెంబడి నెట్టినామె కా
నీ విధి రెండులోకముల నిష్టఫలం బొకటైనఁ గూర్ప లే
దీ విధి నేది యెందు ఫలియింపకపోవఁగ నేల యీ ప్రయ
త్నావసరంబు ; కాఁగలదియౌ నిఁక మాకుఁ బ్రసక్తి యున్నదే ?

౨౬౩

వనముల మెట్టినాము ; పురవాసములన్ బొనరించి నార ; మే
యనువున మా యభీష్టములయం దొకటైన ఫలింపలేదు ; గా
వున వ్యధచే మలీమనత పొందెడి యీ యిహజీవనంబులో
క్షణ మయినన్ సుఖించుగతిఁ గాంచిన మేలని సంతసంపుమా.

౨౬౪

ప్రాణమా యేల నాలోన వచ్చినావు
పోవలయు నొక్కనాఁ డెటో బొంది వీడి
ప్రతి ముహూర్తంబు మాఱు దుఃస్థితిని దవిలి
హృదయమా నీవు తుదిఁ దెగుటే నిజంబు.

౨౬౫

ఏను నవర్థుఁడన్ గుడికి నేఁగ, మసీదున బండ ; దైవ మీ
మేను సృజించెనెట్టు లుపమింపఁగ "కాపరు" గాను, నే రుజా
ధీన కురూపిఁ గాను ; గణుతింప నిహంబు పరంబులేదు నా
మానసమందు స్వర్గ మనుమాటకె తావు లభింప దారయున్.

౨౬౬

కాలవిధంబునున్ దెలియగాఁ దెరువెద్దియుఁదోప దింత దుః
ఖాలయ మీ జగ త్సకలమారయ రెండవదేది లేదు ; ప్రా
ల్మాలిన యాశలన్ వయసుమాసెను గాని, ఫలంబు శూన్య మిం
తేల ? తదీయగుహ్య మొక యింత యెఱుంగఁగరాదు నేఁటికిన్.

౨౬౭

అరయన్ జందెము సుందరంగుచు నా యంకాన రాజిల్ల సు
స్థిరభక్తిన్ సురశాలకే నరుఁగఁ దచ్ఛిష్యుండు నన్ గాంచి, నన్
దఱిమెన్ బొమ్మని యాసురాలయ మపూతంబైన దంచున్ వెనన్
దొరసెన్ బ్రోక్షణఁజేసె మున్నతఁడు నా దుష్కీర్తి నాలించుటన్.

౨౬౮

కోరిక లాటిపోయినవి కోమలి! జాలి వహింపవేమి? కం
ఠీరవముల్ నశించినవి డిల్లవడెన్ వనవీథి? కాల మిం
పారఁగ నెల్లరాత్రుల సురానవపాత్రలఁ దొంగిచూచు నేఁ
డారయ వట్టిపాత్రలెకటా! మనవంతున కున్న వంగనా!

౨౬౯

కోరికలందు నాయువునె కోల్పడినాఁడ; ముహూర్తమేని నే
నారయ సౌఖ్యమం చెఱుఁగ నక్కటు! ముందయినన్ సుఖించి చె
న్నారెడు నాశలేదు; భయమయ్యెడు దుర్విధిచేతఁకున్ బ్రతీ
కారము సేయనెంచినను గాలము కాల మొసంగ నేర్చునే.

౨౭౦

హృదయవీథి నెత్తురు ప్రవహించుచుండె
కనులలోనుండి నెత్తురు కాల్వలయ్యె
క్షతజమును జిప్పలురలు టాశ్చర్యమగునె
ముండ్లపొదలనె గద గులాబులు జనించు.

౨౭౧

ఏను పిపాసఁ జేడ్పడితపించుచు నీళ్ళకుఁ జేయిచాచినన్
గాని లభింపవయ్యె ; నెద కామ్యఫలాప్తికిఁ జొక్కిపోయినన్
గాని లభింపదయ్యెఁ దుది గమ్యతలంబు, వయస్సు నాశయం
దే నశియించెఁగాని యొక యీప్సితమైన ఫలింప దింతకున్.

౨౭౨

వయసను మాయకాఁడు పలుబాముల దించుచు నెన్నినాళ్లు దు
ర్ణయమగు కల్లుమడ్డినిడి ద్రావఁగజేయునొ యీ వివాద సం
చయ మిఁక ద్రుక్కెఁడాసవము చాడ్పున షేసరి ద్రుక్కియున్న యీ
వయసును నేఁలబోయకయె వాయదు దీని తెఱం గెఱింగినన్.

౨౭౩

ఓవిధి ! దుర్మదాంధమతి నొంపకు మమ్మిటు నీనిపాతమున్
మావిభవాభివృద్ధిఁ గనుమా త్రుటి ; మేము దరిద్ర దుఃఖ దు
ర్భావముచేతఁ జేడ్పడి ప్రభావము దక్కి నిరాశఁ జిక్కి ప్రా
ణావిలతాప్తిచే విసిగి యార్తిఁ గృశించుచునుంటి మీయెడన్.

౨౭౪

చక్రము ద్రిప్పుచుంటివి వెసన్ గడి యన్నమునైనఁ బెట్టకీ
వక్రమఫక్కి నన్నొగి దిగంబరుఁ జేయదు మీనమట్లుగాఁ
జక్రము ద్రిప్పువారు వసనంబులు గూర్తురు ; వారికంటె నీ
ప్రక్రియ నింద్యమయ్యె నిఁకఁ బల్కెడి దున్నదె కాలచక్రమా !

౨౭౫

ఓవిధి ! యెంతకాల మిటు లూరక వేదనలందు డింతు వ
య్యో విరమింపవేమి ? తను వొయ్యన దగ్ధత నొందె దానిపై.
నీవు సతంబు క్షారమును నింపెదవేల దయావిహీనవై ?
కావుమి యీశ్వరార్థమె యకారణవైరము మాని మానివై.

౨౭౬

నీయెడ సంతసంబనెడు నింగి తురంగము నెక్కి పర్వునన్
బోయినఁ గాని నేటి కొక పూటయినన్ సుఖ మబ్బలే దిఁకన్
వే యన నేల ? నీ సహజ విశ్రుతియే తెలియంగ లేదు ; మా
ప్రాయము దొంగదారి నిలయం బిటుచేసితి కాలచక్రమా.

౨౭౭

ఈ జగత్సర్వ మరసి వీక్షించినాఁడ
కర్తృకారణ కార్యముల్ గానఁబడును
వ్యర్థ మియ్యది ; యేవంక నరయుచున్న
నదె నిరర్థక మని బోధ యగుఁనుగాదె.

౨౭౮

ఈ శరీరపంజరమున కెలమి వచ్చి
మానవత్వంబు గోల్పోయి మనుచునుంటి ;
నిట్టిపుట్టుక విసువు పుట్టించె నింక
బ్రతుకవలె నని లేదు లాభంబు లేదు.

౨౭౯

నే నొక లిప్తయేని ధరణీప్రతిబంధము బాయలేదు ; నా
మేను సుఖించుచున్నది నిమేష మెఱుంగను ; పెద్దకాలమున్
దీనత గొల్చినాఁడ నొక తేపయుఁ గాలము నన్ను బోద్ధగాఁ
బూని గ్రహింపలేదు తన ముప్పున దాను పరిభ్రమించుచున్.

౨౮౦

వసుధన్ వచ్చుట పోవుటన్ గలుగు లాభం బేమి ? మా యాశల
న్వసనంబందునఁ బేకయున్ బడుగు సంభావింపగా లేదొగిన్.
వెసఁ గాలాహుతి నీమునుంగున మహావిద్వాంసులే దగ్ధమై
మసియై పోయిరి ; వారిదేహముల ధూమంబైనఁ గాన్పించెనే.

౨౮౧

హృదయ హస్తంబుపై స్వేచ్ఛ నేగలేదు
ఉత్సుకంబను సురనంత దోష్ఠమునకు
నకట ! మా జీవితేచ్ఛ యిట్లరిగెఁ గాని
యొక్కనాఁడైన సంతోష మొందలేదు.

౨౮౨

కాంత ! మదాత్మ పేర్మితమున కంటె విహీనత నొందియున్న ; ద
త్యంతము భూమిలో మృతులు హోయిగనుండెద ; రేను దుఃఖ వి
క్రాంతిని రక్తబాష్ప జలరాశిని నా మలినాంబరంబులన్
బంత మెలర్ప క్షాళన మొనర్చిన నైల్యము పోదు దట్టమై.

౨౮౩

ఈ శ్వ రుఁ డు

పరమాప్తుండు, జగన్నియంత, కరుణావారాశి ; మర్త్యుండు త
త్కరుణారాశిని బాపతాప మలినాంధఃపుంజముల్ వాయు ; నీ
సుర వే ద్రావు వసంతవానరములన్ శుష్కించి ధ్యానించి యీ
శ్వరుఁ బొందన్ దలపోయ కాతఁడు తపస్సంకల్పముల్ గోరునే !

౨౮౪

ఓ "వును" రేల పాపమున కూరక చింత యొనర్చెదీవు ? నీ
భావము తల్లడిల్లినను వచ్చెడు దున్నదె లేశమైన నీ
భూవలయంబునన్ గలుషమున్ బొనరింపనిచో శరణ్య మా
దేవుఁ డొసంగు నెవ్వనికి ? దీనులనేగద యాతఁ డోమెడిన్.

౨౮౫

మావలనన్ సురాలయము మంజువిలాసము లుల్లసిల్లు ; మా
భావము పాపకూపమయి పర్వుచునున్నది ; మేము పాపమే
కేవల మాచరింపుచును గీడ్పడకుండిన, దేవుఁ డెవ్వనిన్
గావఁగ వచ్చు ? వాని కరుణన్ వెలిబుచ్చఁగనైతి నీగతిన్.

౨౮౬

ఓ కరుణాళు ! నీవు కరుణోదధివై మముబోటి పాపులన్
గైకొని గాచుటే కరుణ గావున స్వర్గమునందుఁ బాపులన్
జేకొనవేమి ? నీ తపముచేతనె ముక్తి యొసంగెదేని న
య్యో ! కరుణాళుఁ డన్బిరుద ముండునె పాపులఁ గావకుండినన్.

౧౮౭

ఏను మహాపాపాత్ముఁడఁ
గాన భవత్జ్ఞాన మేడ గల్గును ? నేనున్
దీనుఁడ నీ తేజము నా
మానసమునఁ గల్గునే తమస్సయి యుండన్ ?

౧౮౮

తపసున కుంకువగా నీ
యపవర్గ మొసంగెదేని నది విక్రయమౌ ;
కృప యనఁజెల్లదు ; నీ కది
యపకీర్తికరంబు గాదె యారయు మభవా !

౧౮౯

ఏల మదీయ ప్రార్థనము నీమహిమంబున కంటె మించునే
యేల మదీయపాపములు నీ మహనీయత డిందుసేయునే
యేల నిబద్ధుఁ జేయు దిటు లీశ్వర ! వీడుము పెద్దకాలమున్
దాళియె పట్టెదీవు త్వరితంబుగ వీడెదవం చెఱుంగుదున్.

౧౯౦

నా పాపకథలు దలఁచినఁ
దాపము తలకెక్కి బాష్పధారలొలుకు ; న
న్నా పరమాత్ముఁడు పశ్చా
త్తాపమున క్షమించు నంచుఁ దలఁచెదఁ బేర్మిన్.

౨౯౧

ఉద్ధానదినమునన్ హరి
కృద్ధుండైయున్నఁ బుణ్య లేఁగుదు రటకున్
సిద్ధం బాగతిఁ ; దుదకు స
మద్ధ మహానంద మగుచు నేర్పడు నీకున్.

౨౯౨

ఆదినమందుఁ బుణ్యులు మహాఫల మందినఁ బాపినైన నా
కేదియొ కొంత గల్గునటు లేదియుఁ గాకయె యున్నఁబుణ్యులన్
బాదము లాశ్రయించి యపవర్గము నొందెద ; నొక్కవేళ నే
నే దృఢపుణ్యశాలి నగుదేని మహాత్ముడ నౌదునేగదా.

౨౯౩

పుడమిఁ ద్వదీయభాగ మగు భోగములంగొని సంతసంబు చొ
ప్పడ మధుపాన పాత్రలఁ గరంబునఁ గైకొని కూరుచుండు ; మీ
చెడుగున, కాయుపాసనకుఁ జెల్వము గూర్చుఁ బరాత్పరేశుఁ ; డే
యెడ భవదీప్సితం బనుభవింపుము చిక్కిన వన్నిదక్కఁగన్.

౨౯౪

నే జపమాలఁద్రిప్పకయె నింద్యచరిత్రుఁడ నైనఁ, బాపమే
యోజన జేయుచుండినను నోపరమాత్మ ! త్వదీయప్రేమకున్
భాజనుఁడౌదు ; నేమనిన భవ్యుని నిన్నొకఁడంచు నాత్మలోఁ
బూజయొనర్తు, రెండనుచుఁ బోల్పను నిన్ను యథార్థమీశ్వరా !

౨౯౫

ఓ పరమాత్మ ! నీవు సకలోర్వీఁ బజాహృదయం బెఱుంగఁగా
నోపుదు, వెల్లవారి కలుసౌఘముఁ బాపెదు ; వేఁడుకొన్న నా
పాపముఁ బాపవే ? పరమపావన ! నిన్ బ్రతిమాలుకొందు ; నో
పాపవిమోచనా ! కలుషభంజన ! నామన వాలకింపుమా !

౨౯౬

మధుప్రబోధము

ఏను సురాపణంబునకు నేగఁ బ్రమత్తుఁడు వృద్ధుఁ డొక్కఁడా
జానుభుజుండు మద్యకలశంబును మూపునఁ దాల్చి రాఁగ "నో
మాని ! యిదేమియీశ్వరుఁడుమాన్పనెయీయఘ"మన్న నాతఁడున్
"దీనిని ద్రావి శాంతిలు మిదే హరిదత్తకృపారసం" బనెన్.

౨౯౭

ఏనొనర్చిన దొక్కటేని పుణ్యంబున్న
క్షమియించు పదివేలు కలుషములను
ఏను ప్రజాపీడ నేదే నొనర్చిన
మన్నించు దాని నీమహిమవలన
క్రోధాగ్ని తమసావరోధ ఝంఝామారు
తంబును రగులింపఁ దలఁపఁబోకు
ఆ మహమ్మద్ రసూలల్లా పదాబ్జ ధూ
సరులము మము దేవ కరుణఁజూపు.

౨౯౮

సురనే త్రాపు ; ముపాసనల్, చదువులున్ శోభిల్ల రక్షింప ; వీ
సుర నజ్ఞానవశానఁ ద్రావరు ప్రజల్ క్షోణిన్ బహుప్రాయులై ;
పరమాప్తుం డలుగంగఁ బోవఁ డఘముల్ పాటింపఁ డీలోకులన్
గరుణన్ ధన్యులఁజేసి ప్రోచును జగత్కల్యాణ సంధాతయై.

౨౯౯

కరుణామయుఁ డగు పరమే
శ్వరుఁడు నినున్ బ్రోచుఁ ; బాపభయమిఁకఁ గలదే
దురితుఁడ, మత్తుఁడ వైనను
గరుణించును నీదు నెమ్మికల లయవేళన్.

౩౦౦

ఏను ప్రపంచపాపముల కెల్ల నిదానము నైన, నీదయా
స్థానము నన్నుఁ బూతచరితాత్మునిఁ జేయు నటంచు నమ్మెదన్ ;
దీనుల నీవు ప్రోతునని తెల్పితివే యిఁక నింతకంటె నా
దీనత యేని యున్నది ? త్వదీయ దయన్ గురిపింపు మీశ్వరా !

౩౦౧

ఏనరిషట్కమున్ దెలువనెంచిన, నామతి యేవొ లోపముల్
పూనియొనర్చు మాన ; దఘపుంజము నీదయచేతఁ బాపి నా
పైని ననుగ్రహింపు మభవా ! యటులైనను నీదు ప్రోలనే
నే నొనరించినాఁడ నఘ మేగతి లేదన నేర్తు సిగ్గునన్.

౩౦౨

ఏను మహాఘపుంజములనెన్నిటినో పొనరించినాఁడ ; నా
ప్రాణము, మేను వానికయ యాహుతియయ్యెడుఁగాన యీశ్వరా !
నీ నయభక్తి సల్పుచును, నిన్నతిమాలుచు నాదు పాపముల్
మానుప వేడుచుంటి ననుమానముమాని దయన్ దలంపుమా !

౩౦౩

నీ కరుణాబ్ధిమోల నఘనిర్ఝరికిన్ వగపొందఁబోను ; దు
ర్వ్యాకుల జీవయాత్రను భవత్కరుణార్థము చేతనుండఁగా
నాకు భయంబు లేదు ; భవనాశ ! భవత్కృప నన్ను శుద్ధుఁగాఁ
గైకొని లేపెనేని నఘగాఢ కళంకము నే గణింతునే ?

౩౦౪

ఈవు దలంపకేను బ్రజకిందు భయంపడుచుందు నంచు ; నీ
జీవముపోవునంచు వకజెందను ; చావననేమి లెక్క ? కా
నీ వగ యొక్కమాటుకెనుమీ గల దీబ్రతుకెల్ల ఘోర పా
పావిలమౌను గాని చనదయ్యెను బుణ్యమునం దొకప్పుడున్.

౩౦౫

మధువు గొన హస్తములపైని, మద్యశాల
కరుగు పదములపైని, బద్ధానువుపయి
దగ్ధహృదయంబుపై దుఃఖతలిని మునిఁగి
యున్న నాపైని గరుణింపుమోయి దేవ !

౩౦౬

ఇలను గష్టాలు నామదిఁ గలుగఁజేయు
మోయి నాచెడ్డను బ్రజ నొవఁజేయు
మవని నానందమిడుము లయాంతవేళ
నీ స్వభావైక కృపఁ దేల్చుమీశ! నన్ను.

౩౦౭

ఏను భవన్మహామహిమ నిందు జనించితి నీకతంబునే
నేను ప్రవర్ధమానుడయి నిం డెసలారఁగ నూఱువర్షముల్
పూని యఘంబులన్ సలుపఁబూనెద ; నీదయ హెచ్చొ, మామకా
ధీన మఘంబె గొప్పదొ విధీ! యిఁక నిన్నుఁ బరీక్షఁజేసెదన్.

౩౦౮

చెప్పుము! పాపముల్ నరులు చేయనివా రెవరో జగంబునన్ ;
జెప్పుము పాపముల్ నరులు చేయనిదే బ్రతుకెట్లు సాగునో ?
తప్పులు మేము చేసెదము దండన నీ వొనరింతువేని నీ
గొప్పతనంబు, మా కిడిన కొద్దితనం బన నేది యీశ్వరా ?

౩౦౯

అక్కటు! కాలమెల్ల వృథయై చనె దుర్విషయప్రసక్తిలోఁ
జిక్కి నిషిద్ధసేవనలఁ జేడ్పడి పాపములీమనస్థితిన్
బొక్కి భవన్నియుక్తహితముల్ వొనరింపక ; నేఁడు నీదెసన్
మ్రొక్కఁగ వచ్చినామభవ! మోమునఁ గజ్జల మావహింపఁగన్.

౩౧౦

ఏనొక వృద్ధుఁగంటి నతఁ డెంతయు మద్యము ద్రావి త్రావియ
జ్ఞానవుఁ బాచి దేవగృహగర్భమునన్ దగ నూడ్చి విహ్వలుం
డై నిదురించి యీశ్వరుఁ డనంతుఁడు హింసయొనర్పఁ డెప్పు డె
వ్వాని నటంచు నాడుచును బాడుచునుండె విలాస మేర్పడన్.

౩౧౧

నీ దయపైని భార మిడినేర్తుమె కాని, వృథా తపస్సుపైఁ
గా దల పాపపుణ్యములఁ గాదు భవత్కృప గల్గెనేని నా
మోదముతోడఁబాపియునుమోక్షమునొందు ముముక్షుఁడై యొగిన్
నీ దయలేనిచో నరకనిర్ఝరియే గతి గాదె యీశ్వరా!

౩౧౨

నీవు సతంబు పాపమొనరించుచునుంటివి పుణ్యమెప్పుడున్
భావనచేయఁబోవు; భగవంతుని భారముపైనె యుంటి వా
దేవుఁడు పాపులన్ దరికిఁ దీయునొ మానునొ? పాపి పాపియే
గావునఁ బుణ్యకోటి సరిగాఁ డిలఁ బుణ్యులు పుణ్యు లేయెడన్.

౩౧౩

తపము చేసిన నొక్కఁడే; చేయకున్న
నొకఁడె నీసేవయే శ్రేష్ఠ మూర్వియందు
నీవు నీదయ మాచెడ్డ లెల్లఁబాపి
మమ్ముఁ జరితార్థులను జేసి మనుపు మీశ!

౩౧౪

ప్రళయదినమున నీ నీలవదన మెటుఁగి
ప్రేళ్ళఁ గఱచెద నపవర్గ విభవ మెల్ల
నైహికసుఖాల కమ్మతినని "యుసూపు"
నపుడు పది దినారములకు నమ్మినట్లు

౩౧౫

మధువు దొరకినఁ బ్రతి సభామండపమునఁ
గూరుచుండి ట్రావుము హాయి గూర్చునట్టు
లాపరాత్ముఁడు నీమీస మరసిగాని,
నాదుగడ్డంబుఁ గనిగాని మోద మిడఁడు.

౩౧౬

నీ రహస్యతత్త్వ మెఱుంగనేర రెవరు ;
పాప పుణ్యములకుఁ దృప్తిపడవు నీవు ;
నేను పాపనె గాని, విజ్ఞాని నగుట
నీదు దయచేతనె తరింపఁగాఁ దలంతు.

౩౧౭

తలుపులు విప్ప వచ్చినను దథ్యము నీవయి వచ్చి విప్పఁగా
వలయును ; దారి చూపునెడఁ బాంధుఁడవై చని నీవె చూపఁగా
వలయును ; గాన నే నెవరిపంచలఁ జేరను ; వారలెల్ల రీ
యిల నశియించి పోయెదరు నీవె స్థిరంబు సతంబు నీశ్వరా.

౩౧౭

అక్కట నీవు దగ్ధనరకాగ్నిని బ్రజ్వలనం బొనర్చుచోఁ
బొక్కుచు నెంతకాలము ప్రభో ! కరుణింపు మటంచు వేఁడుచున్
మ్రొక్కెద మిట్టు లీశ్వరుని మ్రోల పదంపడి యో ! యుమర్ ఖయా
మెక్కడనుండి వచ్చితివి యీాశున కక్కటికంబు నేర్పఁగన్.

౩౧౮

ఓసతి ! పానపాత్రల సముజ్జ్వల మద్యము నింపి తేవె ! యా
యాసవ మీా సభాసదుల కందఱకున్ బరమాత్మ దర్శనం
బే సమకూర్చుఁ గొంతవఱకేనియు ; నావల నాతఁడే ప్రసూ
నాసవ మిచ్చి ప్రోఁచు గల పాఘములన్ బరిమార్చి వేడుకన్.

౩౨౦

ఆసవమున్, వధూటియు, వనాంతనివాసము మాకుఁ గూర్చి నీ
కోసము స్వర్గమున్ విలిచికొ మ్మటులైనను స్వర్గనారక
వ్యాసము లాలకింపకుము స్వర్గమునుండి యెవండు వచ్చెఁ ? బె
ద్దోసి యెవండు తన్నరకదుఃఖములోఁ బడిపోయెఁ జెప్పవే.

౩౨౧

నిజభోగంబులె మిథ్య లన్న నిఁక సందేహాస్పదంబౌ తమో
ప్రజమున్ నమ్మి దినాలుపుచ్చుటకు నెవ్వాఁడోపు ? నే నీకరాం
బుజమం దానవపాత్ర పీడను ; ననున్ మూర్ఖుం డటం చన్నచోఁ
బ్రజ మామైకము దెల్వి యొక్కటగదా వాదేటి కెగ్గెంచఁగన్.

౩౨౨

తే పనునది నీయదిగా
ధీప్రొద్దే నీది ; నిన్ననే చింత మదిన్
బాపుము ; విలువగుజీవిత
మేపాటిది ? వ్యర్థపుచ్చెదే వెంగలివై ?

౩౨౩

నన్నుఁబుట్టించిననాఁడేఁడు నుదుటిపైఁ
బంకులుగాఁ దీర్చి పట్టి పట్టి
నను నరకాగ్నికి జనుమని వ్రాసెనో ?
స్వర్గంబునకుఁబోవ వ్రాసినాఁడొ ?
నే నించుకేనియునెఱుఁగను ; గావున
నా కావిచారమెన్నఁటికి లేదు ;
మద్యంబు, మానిని, మంజులగానంబు,
వనవిహారంబు నాఁదనరు నాల్గు
మాకుఁ బ్రత్యేకముగఁ గూర్చి నీకు నిష్ట
మగు నగోచర మపవర్గమంటుఁగట్టు
మాకు వగపేల ? వాదేల ? మాటలేల
మాకు రొక్కంబుతోఁ బని లోకమందు.

౩౨౪

ఆరయన్ దేవవధూరతం బమరబ్రహ్మానందమం చండ్రు మీ
రరయన్ మద్యము ద్రావుటేనిజము బ్రహ్మానందమం చందు నే
నరతిన్ లభ్యమునాది ; మీదివియలభ్యంబౌట వీడ్కొందు ; దు
ర్భరభేరీనినదంబు దూరమునకున్ శ్రావ్యంబుగా నుండదే !

౩౨౫

చెలఁగు వస తకాల వనసీమల సోమరసంబు పాత్రలో
పలనిడి మాకొశంగఁగలభామిని యున్న నిజంబు స్వర్గ మేఁ
దలఁపఁ ; దలంతునేని శపథంబిదె శ్వానముకంటె నీచుఁడం
చలతినిజూడు నేనిటులయాడుట కష్టముదోచు ధాత్రికిన్.

౩౨౬

నెచ్చెలి ! స్వర్గమోయనుచు నీకడియాస యదేల ? స్వర్గమం
దచ్చర, లాసవంబు విభవాదునెయున్నవి వేఱులే ; వవే
యిచ్చటనున్న వింకఁగఱవే ? త్రిగంబులఁ జూపనేర్తువే
వెచ్చని కల్లు, కాంతకును వేఱుగ వైభవమేది యున్నదో.

౩౨౭

చెలి ! నాకామధురాసవంబిడుము ; నన్సృష్టించినాతండు నా
తలపై మద్యముఁ ద్రావుచున్ బ్రణయకాంతాసంగతిన్ గూడి ని
చ్చలు భోగింపఁగ వ్రాసినాఁ, డవియుమాసాన్నిధ్యమున్బొందె ; మా
తలపైవ్రాసిన స్వర్గకాంత సుర వ్యర్థం బర్థిఁ జింతింపఁగన్.

౩౨౮

హాయమో గాయనియో, సురాకలశమోయబ్జాక్షియో, వన్యసం
చయమో కోరుము ; స్వర్గమన్న దొకసాక్షాద్వస్తువేయైన ని
శ్చయ మీభోగమె వేఱులేదట మదిన్సందేహమున్ వీడి యీ
నియతిన్ నమ్ముము ; చల్లబడ్డనరకాగ్నిన్ రేఁపఁగాఁబోకుమీ !

౩౨౯

సుమములపై వినూత్నహిమశోభలుమోదముఁగూర్చుచుండె ; నా
ప్రమదవనాంతసీమ జవరాలు మనోజ్ఞత నొప్పుచుండె ; నే
డమలవిలాసవైభవములందుము ; ఱేపటిమాట వీడు ; ని
న్న మరలిపోయె మేలని మన మున నెంచుము నిత్యతోషివై.

౩౩౦

మదిరాపానవిమత్తచిత్తమె మహమ్మద్‌రాజ్య మంచెంచుకో
ముదితల్ బాడెడుపాటలా "హసనెదావూదీ" యటం చెంచుకో
మది నానందరసాప్తినింపుమిదె సమ్యక్తత్త్వసంకేత సం
పదగా నెంచుము వచ్చిపోవుపదముల్ వర్జింపుమా యీపయిన్.

౩౩౧

ఎంతకాలంబు నదిలోన నీవిధాన
ఱాలు విసరదు ? ఱాలను గుళ్ళయందుఁ
బూజచేసి హతాశునిఁబోలి పోదు ?
నేఁడు మద్యంబుమానిని గూడఁదలతు
నరక మేమిటి ? స్వర్గంబునాఁగ నేమి ?

౩౩౨

జీవయాత్ర వేగంబుగా బోవుచుండె ;
నిందొక నిమేషమానంద మొసఁగెనేని
ధన్యమే ; చెలి ! పరులనిందలఁబనేని
సురను గొనిరమ్ము ! రాత్రియేయరుగుచుండె.

౩౩౩

కలితవసంతవాసర ముఖంబుల మద్యముఁ దేరఁజెప్పుమా !
చెలి ! నరకంబు, స్వర్గమలసిద్ధవధూటులజోలి వీడి ని
శ్చలముగఁ గూరుచుండుము ; నిజంబుగ నిన్నవి వచ్చి వేడ్కతోఁ
బిలుచు, వరించు వానికయి బెంగయొకింతయుఁ బొందఁబోకుమా.

౩౩౪

దివి యుండున్, దివిజాంగనామణులు నందేయుండు, రత్యంతమా
సవముండున్, మధువుండు నందురుకదాస్వర్గాన ; మేమిందు నా
సవమున్, మంజులమానినీరతము, స్వేచ్ఛన్ జేయఁగవచ్చు ; న
య్యవియే స్వర్గములోపలన్ జరుగుఁగాదా మాట లింకేటికిన్ !

౩౩౫

స్వర్గమున సుధాప్రవాహము, సుర స్వర్ధు
నీజలంబు తృప్తినెగడు నంద్రు
గాన మధువు నింపి కలశంబు నాచేత
నిడుమ రొక్క మరువు నుడువు లేల.

౩౩౬

లోకభాగ్య మెల్ల లుప్తమైపోయినఁ
బ్రాణ ముండ నాసవంబు వీడ
సకియ ! నేను జగతిసంతోషినై యుందు
ముక్తి గలదొ లేదొ ముందు నాకు ?

౩౩౭

వ్యర్థము, న శాశ్వతము ప్రాఁతవడ్డ జగము
కొఱకుఁజింతింప నేల! యీవఱకుఁ గడచి
పోయినది పోయె; ముం దేమిపుట్టునొక్కొ?
వచ్చి సంతోషమునఁ బ్రొద్దుపుచ్చరాదె?

౩౩౮

ముందు రానున్న యిబ్బందులకై యిసు
మంతయు మది భయమందవలదు
వచ్చియేయున్న యిబ్బందులు నిరతంబు
స్థిర మని మదిలోన వెఱవవలదు
బ్రతికియున్నట్టి యీ ప్రతినిమేషంబును
విలువైన దని మదిఁదెలియవలయుఁ
గడచిపోయిన కడగండ్లకై వెండియుఁ
దలపోసి మదిని జింతిలఁగవలదు
వచ్చు కష్టాలకై మదివగవవలదు.
ఇట్టు జగదవస్థలపాటు లెవ్వఁ డాప
దలకుఁ దల నిచ్చి, తెగి, కోపతాపములకుఁ
గ్రిందు మీదయి యగచాటు లందఁగలఁడు?

౩౩౯

లెమ్మ! నిజానురాగభవలీలలఁ బుచ్చుము వర్తమానకా
లమ్ము; విశాలవిశ్వము విలాస వికాస వినూత్న చారు స
స్యమ్ములఁ గుల్కుచున్నది; నిజమ్ముగ నీ సమయమ్మునందు మ
ద్యమ్మును బాత్రలోనవిచి హాయిగఁద్రావుము నిర్విచారివై.

౩౪౦

నరకము, స్వర్గ మెవ్వఁడు గనంజనె? నచ్చటినుండి యెవ్వఁడీ
ధరణికి వచ్చె? నీగతి వృథాపరికల్పితవస్తు పంక్తి ముం
దఱ మన కెంతొ భీతియునునమ్మకమున్నది; వానిజాడ యీ
వఱకు నెఱుంగ రెవ్వరు నెపంబునఁ బెట్టిన పేళ్లు దక్కఁగన్.

౩౪౧

కడచినదానికై, తిరిగి కాలవశంబున వచ్చుదానికై
తడయక, జీవితంబును వృథా వ్యసనంబులపాలు సేయ కో
గడియ మనంబు నిబ్బరముగానొనరింపఁగఁగల్గు కల్లు పో
సెడు చషకంబుతో హృదయసీమను రంజిలఁజేయు మెంతయున్.

౩౪౨

ఆనందించెడు మానసంబునకు దుఃఖార్తిన్ వృథాసక్తి నేఁ
దేనేరన్; హితకాల మాపదలయందేదింప; ముందేమి దాఁ
గానై యున్న దెవం డెఱుంగు? నిపుడీకాంతారతం, బీసురా
పానంబున్ గొని యిష్టసిద్ధిఁ దగ సంపాదింతు నర్థార్థినై.

౩౪౩

పోయినకాల మన్నఁదలపోయకు; వచ్చెడి దున్న ముందె వా
పోయినవానిభంగిఁ దలపోయకు; భూతభవిష్యదంతరా
పాయములన్ బునాదినిడి భంగ పడన్ వల దున్నవేళనీ
ప్రాయము వ్యర్థపుచ్చకు నిరంతరమున్ ముద మందఁజూడుమా.

౩౪౪

హతవిధి చెయ్దిముల్ గనుమి యక్కట యెక్కడఁ జూడఁబోయినన్
హితులనువారెలేరు ; మఱి యేడ్చిన లాభము లేదు ; ధాత్రిపై
బ్రతికినయన్నినాళ్ళు మది రంజిలఁజేయుము నిన్నటేపు నా
వెతలకుఁ బాలుగాకు ; కలవేళ సుఖంబుగ గ్రవెళ్ళఁబుచ్చుమా.

౩౪౫

నలువంకలెందాక నిలిచి కన్నులు చూడఁ
జాలునో యందాఁక సహజలీల
శాద్వలంబులును సస్యశ్యామసీమలు
స్వర్గంబుతో నెనవచ్చుచుండె,
సెలయేళ్ళు నిర్మలజలపూరితంబులై
యాకాశగంగనా నలరుచుండె,
నీ యరణ్యంబెల్ల నీక్షించితే స్వర్గ
పట్నమే యని వేటేపలుకవలెనె
ఇచట నరకంబు లను పేరులెత్తవలదు
నీ మనోహరి యొయ్యారినీరజాక్షిఁ
జంద్రవదననుగూడి హర్షమునఁబొంగి
స్వర్గమిదెయని కూర్చుండవలదె చెపుమ!

౩౪౬

ఓయి ! జగద్రహస్యమును నూహ నెఱుంగవు ; దీని విజ్ఞులన్
నీయెడ విప్పిచెప్పరు ; వినిందత వాదమువల్లఁ దేల దీ
న్యాయము ? మద్యమున్ జషకమందిడి స్వర్గముగట్టుకొమ్మ ము
దే ; యల నాకలోకమున కేఁగెదొ, మానెదొ చెప్పనేర్తువే ?

౩౪౭

ప్రజలువచింతు రాసవము త్రాగుట మానుము, కష్టమెందె దీ
వజితలంతాతవేళ నరకాగ్నిఁ దపింతువటంచు నీవిధుల్
నిజములెగాని, యీకడుపునిండఁగ శీధువుద్రావి కైపునం
దెజరుపు ; రెండులోకములు దీనికిమించి శుభంబుఁ గూర్చునే!

౩౪౮

నన్నువియోగబాధ వ్యసనంబుననుంపఁ దలంచితో, భవ
త్సన్నిధి సంతసంబున నొసంగఁదలంచితొ, యేదిగూడ నే
విన్నపమున్ బొనర్పను ; ప్రవీణుఁడ నీవెటులుంచ నెంచితో
నన్నటులుంచు మెంతయునునాకదె శ్రేయము లోకనాయకా !

౩౪౯

నీకు హితంబుచేకుఱిన నీదుప్రవీణతగా దొకింతయున్,
నీ కహితంబుచేకుఱిన నీదురదృష్టముగా దొకింతయిన్
ప్రాటకమైనశాంతి, సహనంబునునేర్చి సుఖానఁ బుచ్చుమీ
లోకము మంచిచెడ్డ గతులు న్మనయత్నములోన లేవిలన్.

౩౫౦

నేరకయిల్లు నిల్లుఁజననేరదు ; మంచికిఁ జెడ్డకున్ సదా
యోరిచి కాలమన్ ఫలకముంచి యదృష్టపుఁ బాచికల్ దగన్
గూరిచి, యెత్తువేసి, వగఁగూరక పన్నిదముంచి యేగతిన్
బారునొ యోడు గెల్పులనుబట్టి నటించుట కర్జమేరికిన్.

౩౫౧

వృథగానిన్నను, మొన్న, పోయినవి ; భావింపంగ సంతోషమున్
వ్యథయున్ లాభము నష్టముల్ గడచె నేఁ ; డత్యంత మీ ప్రొద్దునా
పథమందేచనుఁ, గల్మిలేములకు నొవ్వంజెల్ల దానందివై
వృథుమర్యాద నటింపు మీదినము నల్లేపోవుఁ బూర్వాకృతిన్.

౩౫౨

ఓసఖి! యొక్కగ్రుక్కెడు సముజ్జ్వల శీధురసంబు నిమ్మ ! యీ
శ్వాస ముహూర్తమాత్రమె ; ప్రపంచమునందు సుఖంబు గల్గు వి
శ్వాసమె గల్గ ; దే కొలఁదిపాటి లభించినఁ జాలు ; లోకమం
దాసయె గాని యొక్కటి యథార్థముగా ఫలియింప దేరికిన్.

౩౫౩

చావనిన భయమంద ; నీచావు బ్రతుకు
కంటె శ్రేయఁబు ; దేడుఁడు కరుణచేత
ప్రాణములు పోసెఁ ; దిరిగి యా ప్రాణములను
దీయునెడ వేడ్కతోడ నందించువాఁడ.

౩౫౪

జగతీగర్భవిశాల మెంతగలదో చర్చింపఁగారాదు ; నె
వ్వగచే నిండి మలీమసంబయి సదా భాసిల్లు నీ మద్యమున్
సుగతిన్ ద్రావుము ; చావు వచ్చిపడినన్ శోకింపఁగాఁ బోకుమీ
దగ మృత్పానము నెల్లవారి కెపుడో త్రావించు సంభావ్యమై.

౩౫౫

చెప్పుటకు వినుటకు నాకుఁజెలులె లేరు ;
అశ్రువులె నాకు మిత్రు ; లీ యశ్రుమిశ్రి
తాక్షు లేడ్పునకై యున్న వహరహంబు
నేడ్పునకె స్వాగతంబు గావించువాఁడ.

౩౫౬

నీవు రహస్య మెఱింగిన
నీవిధి వ్యసనంబు నొంద వేకార్యంబుల్
నీవలనఁ గాపు ; కావున
జీవించిననాళ్ళు సుఖముఁ జెందఁగ వలదే.

౩౫౭

ఎల్లర హితంబు గొనుము దీవించునట్లు,
బాధలను, వ్యసనంబును బడయవలదు
కలిమిలేముల ధైర్యంబు గడవవలదు
తుదిఁ గృతార్థుఁడ విట్టు లయ్యెదవు నీవు.

౩౫౮

మధువు

సురయే బలమును, జవమును
సురయె రహస్యముల నెల్ల శోధించును నీ
సురనిడ నిహపరము లొదవు
సుర గ్రుక్కెడుకంటె స్వర్గసుఖ మెటుఁ గలదే.

౩౫౯

ఏ మృతిఁగాంతునేని మధువేకొని నా తుదితర్పణంబు నా
యీ మధుపాత్రచేత నొనరింపుఁడు ; చచ్చినవేళ నన్ను మీ
రేమయినాఁ డటుం చరసిరేని, సురాలయద్వారబంధమం
దే మృదుమృత్తికన్ వెదకుఁ డెంతయు నేనటు నుందు వేడుకన్.

౩౬౦

కావ్యములను బూతంబు "ప్ఖర్గాను", దాని
నెల్లరుఁ బఠింతురెపుడు ; మా కల్లుసాల
నెల్లరుఁ బఠింతు రెపుడు ప్రఫుల్ల మతిని
బరవశానంద సంధానపాత్రలందు.

౩౬౧

ఎపుడు మధుపాత్రఁ గైకొననెంతు నొక్కొ,
యపుడె యానందమున మైకమబ్బుచుండు
జవము సమకూడు ; నాత్మతేజము వహించు
కవిత ధారాప్రవాహంబుకరణిఁ దోఁచు.

౩౬౨

మధుకలశంబు, గాయనియు మద్యనికేతము నున్నవిందు ; నా
పృథుహృదయంబు, నామతము వీనియధీనముఁ జేసివైచి యీ
మధువు స్మరించుచున్ సతముమస్తకమం గిడుకొందు ; నీ మహా
పృథివి సతంబె ? బుద్బుదమురీతిని బొల్చునుగాదె యారయన్.

౩౬౩

శీధువు జాతిచేతను, నిషిదమె యైనను నాకు నిష్ట; మా
శీధువు కాంతయే యిడినఁ జెప్పెడి దున్నదె నాఁటివేడ్క? యీ
శీధువు చేదు, నేహ్యము, నిషిద్ధమె కాని యదేమొ నాకదే
సాధువు, నిట్టివే హితము చాలదినంబులనుండి నాకొగిన్.

౩౬౪

పాఠాంతరము :-

అలరువసంతకాలము, సురాసవమున్ లభియించుహాయనం
బులు నవలాప్రమత్త యదె ముందరనున్నవి; వీనిగూడి యీ
కొలఁదిదినాలు మోదమునఁ గుల్కుము; నిక్కపు జీవితాశయ
బులు నివె యాయువున్ జవము పొల్పెసలారును మద్యపాయికిన్.

౩౬౫

త్రావుము మద్యమాయువు సతంబగు; యౌవనకాంతి హెచ్చి యెం
తో విలసిల్లు; నామనులతో నలరారు దినాలు; మద్యమున్
గ్రేవ లభించు కాల, మల నీరజనేత్ర ప్రమత్త యున్న దిం
దే విహరింపు జీవిత మిదే సఫలం బగు సంతసంబునన్.

౩౬౬

పానసభయందు నాబుద్ధి బహువిధాల
"రోమ, కారబు, యవన" ధర్మోపదేశ
ములు దెలుపునట్లు సురమాన వలయునన్నఁ
జదురె? యీశ్వరుఁడే మెచ్చి వదరె మనకు.

౩౬౭

ఇది యెలజవ్వనంబు ; సుర నేకడుఁ ద్రావెద ; దీనిచేతనే
కద లభియించు ధన్యత ! సఖా ! సుర నెప్పుడుఁ దిట్టబోకు, మే
యదనుననైన నీసుర మహాకటువైనను నాకు నిష్టమై
పొదలు నదేమనన్ బ్రతుకుఁ బోలిన దీసురగూడఁ గావునన్.

౩౬౮

కర్మబాహ్యులుద్రావు కాదంబరిని రెండు
లోకాలు పరిఢవిల్లును సతంబు
ప్రళయసూర్యుఁడు చిత్రవర్ణ సంకలిత సు
రాపాత్రి పేరయి గ్రాలుచుండు
ఏరహస్యము ప్రాణిలో రూఢిగా దాగి
యున్నదో యది చూడ నుంటివేని,
మధుకలశంబును మనసారగాఁ గాంచి
తేని యా యర్థంబు తెలియగలదు
ఏరు బ్రతికెడు తెరువుఁ జూపింపకున్న
సురయుఁ, జషకంబె గురువులై పరగు మాకు
సురయె మిత్రము దీనిభాసురకవోష్ణ
మమృతమున లేదు ; మానస మందు లేదు.

౩౬౯

ఆ మధువే మతంబు హృదయంబుసుమీ ప్రియులారా ! నాకు నీ
వా మధు నిమ్ము నాకతిప్రియంబగు ప్రాణపదంబుసు మ్మిదే
యీ మనుజాళి త్రావి ప్రియమెట్టిదొ నేర్తురు ; నేఁబ్రియంబుగా
నీ మధుపాత్రఁ ద్రావెద, నిదేసుమి భేదము మాకు వారికిన్.

౩౭౦

కలికి ! సురాసవంబె చిరకాలమునుండి హితంబునాకు ; నె
చ్చెలి ! సుర లేక జీవనము చేసెడు పద్ధతి గాదు నాది ; యి
య్యిల సురదాౕవువాని కసలే మతమన్నది లేదఁటుంౖడు ; చే
రలఁ గబళింతు నేను మదిరన్, సురయే మతమౌను నాకెటన్.

౩౭౧

మదిరను ౖదావెదన్ జహాళ మార్గములన్ ౖబజలెల్లఁ గూడ దీ
మదిర యసమ్మతంబు, మతమార్గము గాదిది శౖతువంౖడు ; నా
మది కిది నచ్చె ; శౖతువుల మాంసము రక్తము పీల్చుటే యఘూ
స్పదముగదా ! సదా మదిరఁ బానముఁజేసెద వైర మారఁగన్.

౩౭౨

తుచ్ఛముగాదె యే హృదయతోయజమందునఁ జింత లేదొ ౖపే
మేచ్ఛను నేలతాంగినొ వరించి వియోగముచేత వెంగలై
రెచ్చదొ యేదినంబు మఱియురేయము లేనిదె తేరగా వృథా
వుచ్చునొ కాన యేదినము బూదెను బోయకు మేకతంబునన్,

౩౭౩

మధువును, గాయనీమణిని మానక చూపుఁ దుషస్సునందె యా
మధు విడెదన్ ; ౖబభాతముల మద్యముఁౖగోలుటె భాగ్య మిద్ధరన్
మధువును, మానినీౖపణయమంజుల గానసుధా ౖపపూర్ణన
తృథమును, మైక మిౖతయ మవశ్యము లేయెడ మర్త్యకోటికిన్.

౩౭౪

భానుఁ డుషస్సునాఁబరగు వాగుర వే విసరెన్ జగంబుపైఁ;
బూని యహస్సుకై "కుసురు" పోసెను మద్యము పాత్ర; నీ సురా
పానము గొమ్ము మేల్కొలుపుపాడెడువా రపుడే జగంబునన్
గానము చేసి చాటి పరంగన్ బ్రకటించిరి యీరహస్యమున్.

౩౭౫

నేఁటినిసిఁ గ్రొత్త చషకంబుతోటి సురను
ద్రావెదను, రెండుగుక్కలు త్రావి భాగ్య
శాలినై తుది మతమును జాఱవిడిచి
ద్రాక్షరసపుత్రిక వరించి క్రాలువాఁడ.

౩౭౬

ఏను మృతుండ నైనఁ దనువెంతయు మాయముఁ జేసివేయుఁ; డీ
దీనిని జూచి యన్యులకుఁ దెల్వి ఘటిల్లెడునట్టు లంత నా
మేనగు మృత్తికన్ సురను మేళనమున్ బొనరించి దానిచే
సానికఁజేసి శీధుకలశంబున మూఁతగ మూయుఁ డావలన్.

౩౭౭

ఉదయరాగంబు లుదయించుచున్నయపుడె
కల్లుచషకంబు కేల శోభిల్లవలయు
చేఁదుగాఁ దోచు హితమెప్డు, చేఁదు మధువు
గూడ హితమగుఁ గాదె యేనాఁడుఁ జూడ.

౨౭౮

ఓ చెలులారా ! మీరు ప్రియమొప్పఁగ నేయెడనైన నొండొరుల్
చూచుకొనంగ నోచుకొనుచో నపు డేచెలియైన శీధువెం
తేచషకాళిఁ బోసి యిడెనేనియు నా మధువేళ నయ్యె యెం
దో చనిఁనాడు, లేఁడు నయిదో డని నన్నుఁదలంపు సేయుఁడీ !

౨౭౯

స్వర్గమున నీశుఁ డిడ సుర బానఁజేసె
నిఁక నిషిద్ధ మెట్లగు మధు విందు నందు
"అరబొకఁడు" త్రాగి యొంటెను నరకుకతన
మన "రసూ" లదిగని మాన్పె మధువుఁ ద్రావ.

౨౮౦

మధువె యాహార మిడి నన్ను మనుపవలయు
పలితవదనంబు కడు నెఱ్ఱబాఱునట్లు
నేను జచ్చిన మధువుచే స్నాన మార్చి
ద్రాక్ష పేటిక నిడఁగోరెదను సఖులను.

౨౮౧

వేయిభక్తులపెట్టు మైరేయపాత్రి
"చీనసామ్రాజ్య" మొకగ్రుక్క శీధుపాత్ర
దీనికన్న జగాన మిన్నైన దేది ?
ప్రాణముల కన్నఁ బ్రీతి చేఁదై నమధువు.

౨౮౭

చెలి ! మధుశాలలో మధువుచేతనె యాచమనంబు సేయఁగా
వలె ; నపకీర్తిపాలయినవానికిఁ గీర్తిలభించు టేయడన్
సులభము గాదు, గాన నిఁక శోకము మానుము ; మారహస్యమన్
వలువ చినింగిపోయె నిపుణంబుగఁ గుట్టఁగరాని కైవడిన్.

౨౮౮

నేను జచ్చినఁ బూడ్ప యత్నింతురేని
పృథ్విపై వ్యర్థుఁడని పాఱవేతురేని
గోరిలో వాళ్లు తలక్రిందఁ గూర్తురేని
వానిశీధుపుతోఁ గూర్చి వాడవలయు.

౨౮౯

మధువును ద్రావినవారలు
మధురోక్తుల నాడఁగలరు మఱిమఱి చూడన్
ప్రథిత మహావాఙ్మయమునఁ
గథలల్లుటెదాని సమధికంబులు గలవే.

౨౯౦

ఏను రుజాగ్రస్తుఁడ నీ
మేనన్ జ్వరమంతరించె మిక్కిలి సుర గై
కోనేని నిలువ వసువులు
పోనీ సురకంటె వేఱెపోలదు గొనినన్.

౩౮౬

కాంత, నదీతటంబు, సుమకాండము, ద్రాక్షరసంబులందు నే
వెంతలభించునో కొనియథేచ్ఛ విలాసములందుఁ బుత్తు ని
శ్చింతగ నాఁడు నేడనక శీధువుద్రావుచునుంటి ముందు నీ
వొంతనె త్రావుదున్ బ్రతుకు ముంపెఁక సాగినయంతకాలమున్.

౩౮౭

నాహృదయంబులోఁగలదు నారులప్రేమ ; సుమాసవంబు నా
బాహులలోన నుండుత ; ప్రవక్తలు నన్నివి మానుమందు ; రా
యూహ పరాత్పరుం డిడకయుండిన నేనయి వీనిమాన నా
యూహ పరాత్పరుండునిడకుండుత మేయెడ నెన్నఁడేనియున్.

౩౮౮

శీధువు చెంతనుండిన నిషేదము సేయకు ; మాహితాగ్ని కా
సాధులుచాల నీవెనుకఁ జాగిలమ్రొక్కఁగ వత్తు రీ ప్రఫు
ల్లాధిక పుష్పసంచయ, మనంతఖగాళి కుహూకలస్వనో
పాధికమైన కాలమునఁ బాయఁగ న్యాయమె మద్య మీయెడన్.

౩౮౯

మదిర యేచెలి నా కిడ మానెనేని
యింక కాలంబు నను గౌరవించు నొక్కొ ?
ప్రజలు మధుపానమును మానవలయు నంద్రు
నేను మాన నీశ్వరుఁడు మాన్పింపవలయు.

౩౯౦

ఎపు డరుంధతి, శశి మింట నెసఁగినారొ
యదిమొదలు నేరు సురకంటె నధికమైన
దేది గనలేదు ; సుర విక్రయించువార
లేమి వెలఁగొంద్రొ ? హెచ్చేదొ యింతకంటె ?

౩౯౧

ఆవిధి లోకకర్త భువనాళి సృజించుచు శత్రుకోటికే
తావలమై సమున్నత హితంబునుగూర్చు సురాసవం బొగిన్
ద్రావెడు పాత్ర చేసిన మతస్థుఁడు గాఁడని తిట్టు లోక ; మా
హా ! విధి యేలచేయు సురకా సొరకాయ కమండలంబులన్.

౩౯౨

నాయెడఁ బ్రేమయున్న సుజనంబు వృథావచనాళిమాని నేఁ
బోయినవెన్క మద్యమును బోలెడు దుఃఖరసంబు నింపి, నా
కాయపు మట్టితోడ నిటుకల్ రచియించి పరిగ్రహించి మై
రేయ కుటీరకుడ్యముల రిప్పులఁగప్పుడు రాగమొప్పుగన్.

౩౯౩

సగముపై సురపోసిన నాట్యమాడు ;
సురను దెగడెడువాఁడు భూసురుఁడు గాఁడు ;
అట్టిసురమానుమనుచు నన్నెద రేల ?
సురయె యుసురు శరీరభాసురతఁ గూర్చు.

౩౯౪

వయసను భూరుహంబు తలవాల్చిన నేలకు శాఖలట్టు నె
మ్మెయిఁ దన కాళ్ళు, చేతులును, మేనును వంగి నశించు ; నావలన్
దయఁగని నాదుబూడిదను దద్దయు భాండముఁజేసి యందులో
స్వయముగఁ గల్లుపోసినను ప్రాణమువచ్చు నిజంబు నెచ్చెలీ !

౩౯౫

మరణరహస్య మెప్పుడును మద్యము ద్రావెడువాఁ డెఱుఁగు ; నీ
సుర, సురపాత్రలో మహిమ శుద్ధదరిద్రుఁడెఱుంగుఁ గాని నీ
వెఱుఁగవు మమ్ము మా తెఱుఁగు నీకనుదమ్ములు చూడగల్గునే
మఱి తగవేల ? మత్తులను మత్తులెగాని యెఱుంగనేర్తురే !

౩౯౬

ఈ వసంతంబులో సురఁద్రావు ; మేదొ
ప్రియను దలపోసి త్రావు మైరేయ ; మిదియు
ద్రాక్షరక్తంబు, తనరక్తదాహమునకు
వగవ నని చెప్పు నదె త్రావవగవ కింక.

౩౯౭

తిరిగి కర్మబాహ్యులఫక్కి మరగినాము
జపతపంబులపై మట్టి చల్లినాము
ఎచట మధుపాత్ర యుండునో యచట మేము
కలశమట్టుల తలవంచి నిలుతు మెపుడు.

౨౯౮

వెలఁదితోఁగూడ సురఁద్రావి, ప్రియులఁగూడి,
యరుల నిర్జించి, యేసుందరాంగినో వ
రించి, మమకారపదము వర్జించి, గర్వ
మనెడు నంగిని దీయుమీ తనువునుండి.

౨౯౯

నేను సురాపానము విష
యానందముకొఱకుఁ జేయ నమలమత శ్రీ
పోనాడఁజేయఁ బరవశ
మూని ప్రమత్తమతిఁ గాలమును బుచ్చుటకే.

౩౦౦

మానసికంబు లౌవగలమానుము ; జీవితవాంఛ యోగిచం
దానఁ బరిత్యజించి ఘనతాపస ముఖ్యసభాంతరంబు లా
స్థానముగా వసింపుము ; స్వతంత్రతత గల్గి చరింపు ; మా సురా
పానము చేసి సంతసము పారముముట్టఁగ నుండు మెప్పుడున్.

౩౦౧

ఈసురను నా "ఖిజరు" గౌరవించె, నమృత
మనెను దీనిగడు "నిలియాస్" ప్రవక్త ;
యసుల కాహార మిది ; హృదయ బలకారి
నరుల కిది లాభ మనుచు నీశ్వరుఁడు పలుకె.

౪౦౨

బ్రతు కను పానపాత్ర శిఖిఁ బాచనమయ్యెడు నంతదాఁక నే
నతిముద మందుచున్ జషకమందు భుజించుచు నుందు నావిషా
దతతిని ; నోకులాలక ! పదంపడి నాతనుమృత్తుచే ఘటు
ప్రతతి రచింతువేని మదిరారస మమ్మెడువారి కమ్ముమిా.

౪౦౩

కాల మడుగనిచోఁ బోరఁగలను ; కీర్తి
రానిచో నపకీర్తి రానీ ; నవాస
వంబదే సిద్ధమైయున్నదది గ్రహింప
నట్టివాని నెత్తిని ఱాయిఁబెట్టు మదిగో.

౪౦౪

మధుకలశంబు నాకొసఁగి మంజులగానము సేయుమింక నీ
మధుసమయంబు కోయిలలమాడ్కిఁ గుహూకల కాకలీసుధా
మధురరవంబులన్ గలియ మద్యము ద్రావెడువేళ గానమే
వృథ యనుచో సురాకలశ మేటికి గల్లఁబాడు వంచినన్ ?

౪౦౫

మతముల్ "మానసమున్ గలంచి చెఱుచున్ మద్యం"బటంచాడు కు
త్సితవాదంబుల నాలకింపకుము ; నీ జీవాన కాహారమున్
సతతాధ్యాత్మవిహార సమ్మద సముత్సాహంబు వాంఛించినన్
గృతకాద్రిన్ జని శీధుద్రావి యటు నెంతే పాట లాలింపుమిా.

౪౦౬

"నేను సురఁ ద్రావ ; సుర గోస్తనీరుధిరము
గాన రుధిరపానము సేయ మానినాఁడ"
నన్న మతగురు వడిగె "సత్యంబె" యనుచు
"కాదు విరసోక్తి సుర మానఁగలనె ?" యంటి.

౪౦౭

అచ్చపువారుణీ రసమునం దభిలాషయు, వేణుగానమం
దిచ్ఛయుఁ బోదు నాశ్రవణ మేయెడ రాగరసంబునే సదా
మెచ్చుచు నుండు ; నాతనువు మృత్తికచేఁ గలశంబుఁ జేసిరే
నచ్చపు రూపుదాల్చి కుసుమాసవ మందున నిండి యుండెడిన్.

౪౦౮

అవనిన్ సర్వముమిథ్య ; నేనొ మటుమాయన్ గాలమున్ బుత్తు ; నా
సవమున్, ప్రేమయు, రాగభోగము లుపాస్యంబయ్యెడున్ నాకు ; న
న్నవి వర్జింపుమఁటుందు రీశ్వరుఁడు తానై వీని మాన్పింపఁ డ
ట్లివి మాన్పించిన నేను మానఁ బ్రజ లెంతే వచ్చి నిందించినన్.

౪౦౯

ఎమ్మెయి దుఃఖభాజితుల కేద్వఁగ నోపను ; స్వచ్ఛమైన మ
ద్యమ్మును, లోహితంబయిన ద్రాక్షరసంబును ద్రావ నెంతు మ
ద్యమ్మన లోకమన్ పురుషునందలి శోణిత ; మీజగమ్ము ని
శ్కమ్ముగ మమ్ముఁ ద్రింగురిపు గావునఁ ద్రావెద దీని రక్తమున్.

౪౧౦

మృతిపాదంబులపైని బోరగిలి, జీవేచ్ఛా విహారాది సం
గతి నిర్మూలము గాఁగ బూదియగు నా కాయంబుతో భాండసం
తతియే కాని మఱొండు చేయకుఁడు ; తద్భాండంబులం దెవ్వఁడే
ని తమిన్ మద్యము దెచ్చి పోయునెశలన్ జీవింతు నే నయ్యెడన్.



౪౧౧

సురగర్వాపహరంబు ; శీధువు దృఢాస్త్రౌకోగ్రదుర్వార దు
ర్ధర దుర్గ్రంధుల విప్పు మంత్రమిది ; సైతానప్పుడే గ్రుక్కెఁడీ
సుర నేఁద్రావిన నొక్కలేమి శతముల్ జోహారు "లాదమ్" లస
చ్చరణాబ్జంబుల కాచరింపఁడె సముత్సాహంబు శోభిల్లఁగన్.



౪౧౨

లెమ్ము ! మృదంగ చారుమురళీనినదంబులఁ బాడుకొంచు మ
ద్యమ్మును ద్రావుచుంద ; మహహా ! యపకీర్తిఁ గీర్తికాంత నే
డమ్మి సురన్ సురాపణము నందునె కొందము ; గౌరవంపుభాం
డమ్ము నగౌరవం బను తటంబున బ్రద్దలు గొట్టివేయుమా !

౪౧౩

చెలి రానన్నను నామె పైఁటచెఱఁగున్ జేపట్టి మధ్వాసవం
బుల సేవించుచు, శౌచశీలతపముల్ పోకార్చి కృష్ణాజినా
వళులన్ గ్రుక్కెడు నాసవంబునకునై బాజారులో నమ్మి యే
శిలపైనో యశ మన్న భాండమును విచ్ఛిన్నంబు గావింపుమా !

౪౧౪

అదిగో ప్రభాతకాల మదుగడ్డునకున్ సురఁ ద్రావికొంచుఁ బో
వుద మిఁక రండు ; కీర్తి యను ముంతను ఱాతినిబెట్టి కొట్టి సం
పద లను పెద్దకోర్కె లెశఁబాసియు, జాణ, విలంబకేశ సొం
పొదవు మృదంగగాయనిని బొందఁగఁ గోరుద మామె గైకొననన్.

౪౧౫

స్వచ్ఛచషకగర్భంబులోఁ బ్రాణమున్న
దదిగో ! యెఱని కాంతిమధ్వాసవంబు
పరిఢవిల్లుట ; నిది సీటికరణి నున్న
నగ్నివలె మండి జాజ్వల్యమై తనర్చు.

౪౧౬

నిన్నటిరేయి నా హృదయ నీరజమున్ వికసింపఁజేయఁగా
నన్నులమిన్న యోర్తు మధురాసవమున్ గొని పానశాలలో
గిన్నెడు తెచ్చి త్రావు మన ఖిన్నుఁడనై వలదంటిఁ ; గాని, యా
కన్నె "మదీప్సితార్థ మిదిగైకొను" మంచన దాని ద్రావితిన్.

౪౧౭

మధువును ద్రావి మానినుల మధ్యమున న్విహరించువార లా
విధి విదు లాహితాగ్ను లగు విజ్ఞులకంటెఁ బదాఱువేల రె
ట్లధిగుణు ; లీ సురన్ గొను మహాత్ములె యా సురలోక మేగకే
వ్యథఁ బడుచో సురాలయము నారయనోపునె యొక్కఁ డేనియున్.

౪౧౭

ఎఱుఁగవు నీవు నేను మధువేటికి మాననొ ; నాకు మద్యమున్
గరము నిషిద్ధ మెప్పుడును గాదు నిషిద్ధము బాహ్యభక్తితి
త్పరుల ; కనన్య భక్తులగువారికిఁ గా దటులైన నేనె యా
యురుతర పాపపుంజములకు త్తరవాదిని గాకపోదునే.

౪౧౮

కొనెదము మేము మద్యమును గ్రొత్తది ప్రాఁత దటంచు నెంచకే ;
గొనకొని స్వర్గశౌద మొక గోదుమగింజకు విక్రయింతు ; మో
వనిత ! గతానుఁ డైన తరువాతను చెక్కడి కేఁగుదందువా ?
మును సురఁ దెచ్చి యిమ్మవలఁ బొమ్ము త్వదీప్సిత మున్న చోటికిన్.

౪౨౦

ప్రేమ యను నెల్లసభల దర్శించినాము
ఘన మహాలోకదుఃఖముల్ గడచినాము
ప్రేమయను సురఁద్రావి నిద్రించినాము
ఎల్లరకు స్వేచ్ఛ, యానందమెసఁగ నహహ !

౪౨౧

ప్రాఁత సుమాసవంబు నవవైభవరాజ్యముకంటె శ్రేష్ఠ మీ
భూతలతిక్త కామ విషభోగము లావల నెట్టివేయు ; మా
శాత మధుప్రపూర్ణకలశంబు "ఫరీదును" లక్ష్మీకంటె, నీ
మూఁత ప్రపూత "కైఖుసురు" మూర్ధకిరీటముకంటె మించదే !

౪౨౨

మానితి ; దానినే తిరిగి మన్ననఁజేసితిఁ బెక్కుసారు ; లిం
పైన యశంబు దుర్యశమటంచుఁ గవాటము మూసికొంటి ; నే
దే నొకతప్పు చేసితినయే న్విడనాడకు ప్రేమ ? యా సురా
పాన ప్రమత్తచిత్త మలవాటయిపోయెను మాకు చెచ్చెలీ !

౪౨౩

ఆసవమున్, దదీయకలశావళి నీనిసిముట్టనంచు నే
బాస యొనర్చుచుంటిఁ బ్రతివారము ; కాని వసంతకాలపున్
మాసము లేగుదెంచినవి ; మమ్ము యథేచ్ఛను వీడుఁడింక నీ
మాసములందు మద్యమునుమానుదురే యెవరైన నెచ్చెలీ !

౪౨౪

సొంపగుపానపాత్రయును సోమరసంబును దెచ్చి హస్తమం
దింపుగఁ బెట్టవేమి హరిణేక్షణ ? యీ సురశృంఖలాకృతిన్
గంపితమై మృదుక్వణనికాయముతో నలరారు ? దీని నో
యింతిరో ? నాకరాన నిడుమీ మతిసంచలనంబు దీఱఁగన్.

౪౨౫

ఓ ప్రియ ! యీ ప్రభాత విభవోజ్జ్వలమౌ సమయంబునందు మ
ద్యప్రియుఁడైన నాకు మధురాసవమిమ్ము ; కృతఘ్నపాళి లో
కప్రచయంబు ; నిందు గుణకర్మవిహీనుఁడ నంచు నన్ను వి
శ్వప్రజలందుఁ జాటుచును వారుణిఁబోయుము ప్రేమ యేర్పడన్.

౪౨౬

భంగు కుమతికెకూర్చు ;నీభంగు త్రాగు
నట్టి మూర్ఖురికంటె మధ్వాసవంబు
కణము మేలని విబుధలోకంబు దలఁచుఁ
బాటు మేల్గాదె యాసవపాత్రకంటె !

౪౨౭

సురకన్యంబగు వస్తువులన్నియును నేశోధించి వర్జించితిన్
సురయే సుందరవీరకాంత యిడినన్ శోభించు నెంతేనియున్
దిరిపంబెత్తిన నిస్పృహుందవిలి భ్రాంతిన్బోల మేలేయగున్
సుర బ్రహ్మాండముకంటె మేటియని నే స్తోత్రంబు గావించెదన్.

౪౨౮

ఏ నిందుంటిని ; నా మనోహారియు నిందేయున్న ; దీ సత్ప్రభా
తానందప్రతిపాదకంబయిన మద్యంబిందు రాజిల్లుఁ ; గాం
తా ! నన్నేటికి వీని మానుమను దత్యంతంబు ప్రావడ్డ గా
ధానైత్యంబుల నేలచెప్పెదవు ? మద్యంబిమ్ము హృచ్ఛాంతికిన్.

౪౨౯

దీపము మండుచున్నది ; ప్రదీప్త సుధాంశుఁడు వెల్గుచున్న వాఁ
డోపిన మద్యభాండ మటు నున్నది ; యాసవపానమత్తయై
యా పడకింటఁ ప్రేయసి ప్రియంబున రమ్మనుచున్న దీ మన
స్తాపము పోవ దిం కిచటఁ జంపకు మోసఖి తెమ్ము మద్యమున్.

౪౩౦

తరుణి ! వారుణీరస మిమ్ము తప్తహృదయ
మార్పుదును దెల్వి ననుబాయ నంతవఱకుఁ
ద్రావుచునెయుందు ; నాదు హస్తంబుఁ జూడు !
పానపాత్రను జూడు ! వేఱానె యెపుడు.

౪౩౧

ఓసకియా ! మనోహర కుహూకల నిస్వనపూరపూరితం
బై సను సుప్రభాతమిది ; యాసవమమ్మెడు వీథియందు మ
ధ్వాసవ మున్నదిప్పుడు వ్రతాదుల యూసులు కట్టిపెట్టు మీ
వీ సమయంబునన్ మధువునేగొని వీడుము స్వర్గవాంఛలన్.

౪౩౨

ఆసవపానమత్తమతినై విహరించెడు నన్ను నీశ్వరో
పాసన, శౌచశీలములఁ బాయనిదే దరిఁజేరఁబోకు ; మా
వాసము స్వైరచారుల నివాసము ; నీవు గ్రహింపలేవు దు
ర్వ్యాసములన్ బిభీషిక లటంచును నెంచకు రాకు మాకడన్.

౪౩౩

పుట్టుచు నేమి తెచ్చితివి ? పోవుచు గైకొనిపోయెదేమి ? యీ
మట్టునఁ జెప్పు మద్యమును మానుము చావు నిజంబటంచు నన్
దిట్టెదు గాని యీ సురను దేరగఁ ద్రావినఁ ద్రావకుండినన్
గిట్టుట నిక్క ; మింకఁ బరికింపుము తెల్వియె యున్న నెచ్చెలీ !

౪౩౪

ఓసుర ! నీవు భాసుర సముజ్జ్వల సుందర కాచపాత్రలో
భాసిలుచుండి కోపిదుల పాదయుగంబుల శృంఖలంబవై
గాసిలఁజేయు దెంతయును గైకొను వారి నిజస్వరూపముల్
పూసను గ్రుచ్చినట్లు వెలిపుచ్చక వీడవు కోటి చెప్పినన్.

౪౩౫

ఓ పరమేశ్వరా ! బ్రతికియుంట కుపాధినొసంగి, వైభవ
ప్రాపితఫక్కి నిచ్చి, పరవంచనపా నొనరింపఁబోక సం
తాపము దీర్చు మద్యమున ధన్యునిఁజేయుము మైకమిచ్చి ; యీ
రూపమునన్ బ్రమత్తతను రోఁత జనింపఁగనీయ కేయెడన్.

౪౩౬

ఓ నవమద్యమా ! సముచితోన్నతకీర్తివి నీవు ; నిన్ను నే
నీ నిఖిలావనీప్రజలు నెంచఁగఁ ద్రావెద ; నన్నుఁజూచి యో
హో ! నవమద్యపాయి యిదిగో చనుదెంచుచు నున్నవాఁడటం
చీ నరు లాడుకొంచుఁ బ్రకటింపఁగ దిక్కులు గీర్తినిండఁగన్.

౪౩౭

యతి కాకుండ సురాపణంబునకు డాయంబోకు ; మద్యంబు, సం
తత గానంబు, వధూటులన్ వలచి మూర్ధంబందు మద్యంపు భాం
డతతిన్ దాలిచి, చేతఁ బాత్రగొని పేడ్కన్ మద్యమున్‌దాఁ్రవుచున్
గుతుకంబొప్పఁ జరింపు ; వ్యర్థపదమున్ బోనాడు మెల్లప్పుడున్.

౪౩౮

తరుణీసంగమమున్, సురాసవము నెందాఁ కీవు కాంక్షింతువో
మురళీగాన వినూత్నవాద్యముల యామోదంబులం దాఁక నీ
చెఱుఁగున్ వీడవు ; వమ్ము లీపథము లిస్సీ ! యైహికాపేక్షలన్
దెరలన్ ద్రోయక యున్న మిథ్యసుమి యీ దృశ్యంబు నశ్యంబగున్.

౪౩౯

"షావానురజ్జబుల" సురఁ
ద్రావఁగ వలదందు రవియుఁ బ్రభువైన రసూన్,
దేవుని నెల లని ; సరె నేఁ
ద్రావెద సుర స్వేచ్ఛగాఁగ "రజాను" నెలన్.

౪౪౦

వారముల నెల్ల సురఁ ద్రావవలయు ; శుక్ర
వార మని మానవలవ ; దే వారమైన
సమమె మా మతమందు ; వారముల కీవు
భక్తుఁడవు కాకు మీశ్వర భక్తుఁడగుము.

౪౪౧

దొన్నెలను వీడి కలశంబుతోడ మధువు
ద్రావు మిగి శుక్రవారము ప్రతిదినంబు
కన్నఁ బదిరెట్లు సురఁద్రావఁ గర్జ మిందు ;
వారముల ఱేఁడు గద శుక్రవార మన్న.

౪౪౨

మధువు నెప్పులు భక్తుఁడు మానఁబోడు
అతని కది యమృతాభమై యలరుఁజూవె
పర్వదినముల నీశ్వర ప్రార్థనంబు
మానెనేనియు నిర్వాణమూను నతఁడు.

౪౪౩

పండుగ నేఁడు వచ్చెఁ ; బనిపాటుల వేడ్కలభించు ; మద్యమున్
గుండలనిండఁ బోసి యిడి కోర్కెలఁ దీర్చు "నుమర్ఖయా" మదే
చండతపస్సమాధి ఖరసన్నిభులై వ్రత మాచరించు పా
షండుల నోటికళ్లెములఁ జక్కడఁగించు విలాస మేర్పడన్.

౪౪౪

ఈ యుపవాసవాసరము లెంతయుఁ దీవ్రతతోడ వచ్చె న
య్యో ! యెటుతోఁచకున్న ; దలయూహలుశృంఖలలందుఁజిక్కె ; దే
వా ! యిఁక లోకజాలమునకంతకుఁ భ్రాంతిని బెట్టి పర్వపున్
హాయన మట్లు మార్చుమతి నబ్బురపా టొదవంగ నెంతయున్.

౪౪౫

ఉపవాసపునెల వచ్చిన
యపుడు నిషేధంబు మద్య ; మా ముందే త్రా
వి పరుండెదఁ బండుగవలు
కపరానందంబు మదికి నబ్బెడురీతిన్.

౪౪౬

ఈ సుర కర్మబాహ్యులకు నెంతొ జవంబు, బలంబుఁ గూర్చు ; ము
న్నీ సుర బుద్ధియన్నఁ దరళేషణమోమునఁ జేరుచుక్క గా
దే ! సుర "రమ్మజాను" నెలనించుకఁ ద్రావఁగఁబోవ నా "షవాల్"
మాసము రాత్రిపండుగ ప్రమాదము గల్గునె యెంత ద్రావినన్.

౪౪౭

ఉపవాసంబుఁ దపంబుపై నెపుడు నాకుత్సాహ మేపారునో
యపుడే ధన్యత గూడె నంచు మది నూహల్ పుట్టునె గాని, మ
ద్యపు సంపర్కముచేఁ దపశ్శుచి విలియ్యంబయ్యెఁ; బానాప్తిచే
నుపవాసంబు నశించెఁ జేయునది యోమో తోఁచ దింకేపయిన్.

౪౪౮

డెబ్బదేఁడుల యీడు మూఁడినది మాకుఁ
బాపభీతియు, శుచియుఁ దపస్సు విడిచి,
యింక సుర నభ్యసింతు ; నెంతేని సుఖము
లిపుడె పడయనియెడల నింకెపుడుఁగూడు ?

౪౪౯

నీవు రాజాధిరాజువై నెగడుచున్న
మద్యమహిమం బెఱుంగ ; వా మహిమ నెఱుఁగఁ
జెప్పెదను నేడువారాల నెప్పుడైనఁ
ద్రావిన మనంబు వికసించి తనరుఁ గాదె !

౪౫౦

ఎంతకాలంబు బాధల యెసకమెసఁగఁ
దుచ్ఛ లిడు నగచాటుల త్రోవఁ బోదు ?
కటికి యుపవాసముల నెలల్ గడచిపోయె
పండు గిదె వచ్చె సుర ద్రావవచ్చు రమ్ము.

౪౫౧

ఏనొకనాఁడై నను సుర
మాని యెఱుంగ ; నిది వ్రతతమస్సైన్న, సురా
పానము సేయుచు నీ నిసి
నానందించెదను జషకమం దిడి కరమున్.

౪౫౨

పులిసిన ప్రాఁతశీధువును బుణ్యదినంబులఁ ద్రావువాఁడ వి
హ్వాలమతిఁ గాక, ద్రాక్షరస మన్నది నిండు పవిత్రమైన దా
కలశమునందుఁ బోయుటను గాదె వికారము చేదు వచ్చె నీ
చెలువము దేవుఁ డేటి కిడెఁ జెప్పుము చెప్పినఁ ద్రావ మానెదన్.

౪౫౩

పండుగదినంబు మద్యంబు రెండు మూఁడు
కలశములు ద్రావుద మనుంగుఁ జెలులఁ గూడి
తాళకాహళ భేరీ మృదంగ చారు
నాదములు మ్రోయ సంతతామోద మెసఁగ.

౪౫౪

సు ర - దా రి ద్ర్య ము

మట్టిబొమ్మలఁ జేసి యీమాడ్కి మమ్ము
దుఃఖదారిద్ర్యకుహరాలఁ ద్రోసి వేసె ;
మమ్ముఁ బేదటికమె సురన్ మాన్పుచుండ
నింక సుర మాను మని ప్రభోధింప నేల ?

౪౫౫

ఒకతృణమైన నా కడను నుండిన, దానిని విక్రయించి త
ప్పక సురఁ గొందు ; "ఊపు మధుపానముచేయగ డబ్బులేదే, నీ
విఁక నొనరింతు వే" మనుచు నీప్రజ నింద యొనర్పకుండఁగా
నిఁక నల "ఏసుతల్లి" వడికిచ్చిన నూలుకుళాయి నమ్మెదన్.

౪౫౬

తెలివిచేతనె భాగ్యంబు గలుగబోదు
పేదవానికి బంది పృథ్వీయువనంబు
పేద "బెనఫషా" కుసుమము ఖేదపడును
నవ్వును గులాబిలోన స్వర్ణంబుకతన.

౪౫౭

పురుషుఁడు ప్రయోజకుఁడు, కళాపూర్ణుఁ డిద్ధ
వంశసంజనితుండు గావలయు నంద్రు
కాని, యివి యెల్లఁ బొల్లు లీకాలమందు
గనక ముండినఁ జాలు సంకరము లేదు.

౪౫౮

మధువుచేఁ జరితార్థతమాకుఁ గలదు
మధుకలశ మెప్డు మాతోడ మాటలాడు
నందుచేత ద్రావెద మడుగడుగునకును
మధువుచే మేము, మాచేత మధువుఁగలదు.

౪౫౯

ఇంతనరాని యీమధువు నేకడుఁ ద్రావెద ; దానిచేతఁ బ్రా
ణాంతకమై, సమాధి నిడినప్పుడుగూడఁ దదీయమృత్తికన్
వింతగ మద్యవాసనయె వీవవలెన్ సురఁ ద్రావువార లా
ప్రాంతముఁ జేరిరేని నలవాసన మైకముఁ గూర్చుఁ గావుతన్.

౪౬౦

సురఁ నిషేధమె యైన భాసురమృదంగ
తాళములు మ్రోయఁ ద్రావు మేవేళఁగూడ
మధురమధురసమే చిక్కుమార్గ మున్నఁ
ద్రావు మొకచుక్కయును నేల రాలకుంకు.

౪౬౧

ఏను సుర ద్రావకుండ జీవింపలేను,
మేను భరియింపలేను, నామించుబోఁడి
వచ్చి సుర దెచ్చి యిచ్చిన వలదటుంచు
నాడ మైకములోనున్ననాఁడ నబల !

౪౬౨

సురఁ ద్రావమాను మందురు
సుర నా ప్రియవదన మనుచుఁ జూచెద నిఁక మీ
రరఁయుడు దీనికిమించిన
పరమార్థం బేది గలదొ పరికింపంగన్.

౪౬౩

నిసిని ద్రావినసుర మైకమెసగదేని
పవలు ద్రాఁవగ నోపను ; పవలె సురను
ద్రావు మనెదవు గాని, నేఁద్రావఁబోను
పగలు సుర ద్రావుటది శుభాస్పదము గాదు.

౪౬౪

మధుసమయంబు సొంపయిన మారుతముల్, జలదంబు దూసరిన్, బృధుకుసుమావళిన్ గడిగె ; వేడుక "బుల్ బులు" వచ్చిపొందుర ప్రథితసుమాళితో "మధువుద్రావుఁడు ; మీరుజ శాంతిబొందు" నం చధరము విప్పి విప్పి మధురామృతగానము సేయుఁ జూచితే !

౪౬౫

మధువు నీచులతోఁ ద్రావమానుకొనుము
దానఁ గష్టాలు కలుగు ; మద్యంబు రాత్రిఁ
ద్రావి కలహించి పగలు తద్వర్తనమునఁ
బ్రజలు బ్రతిమాలవలయు శిరంబునొవ్వ.

౨౬౬

కల్లుం ద్రావిన నీచమానవుల సఖ్యంబందుఁ గూర్చుండఁగాఁ
జెల్లన్‌బోవదు ; ప్రేమగానకలనన్ శ్రీరాగరాగాంచితో
త్ఫుల్లాస్యల్, నళినాక్షులం గలసి సంతోషించుచున్ ద్రావఁగాఁ
జెల్లున్ వేడుక నప్పు డప్పుడు నముత్సేకంబు సంధిల్లఁగన్.

౨౬౭

సుమములపైని మేఘపు ముసుంగు తొలంగ గలేదు ; నాదు హృ
త్కమలము మద్యవాంఛఁ బరితాపము నొందుచు నున్న దింక నీ
సమయము నిద్రకుందగ దుషస్సిది, పండెడువేళగాదు మ
ద్యము చషకానఁబోయుము ప్రియా ! మనకున్నదిప్రొద్దుచాలఁగన్

౨౬౮

మధువు గైకొని మతిమాలి మసలఁబోకు ;
మైకమునఁ బామరుండవై మాటలాడ
కాసవమునఁ ద్రావనీకు బేరాసయున్నఁ
ద్రాగి పీడింప కొరుల మర్యాద మాని.

౨౬౯

దయయే స్వర్గము, విధి ని
ర్దయయే నరకంబు ; స్వర్గరాజ్యము విధి కా
లయ మే ననఘుఁడను సురా
లయమునఁ జొరనీయరేల లలనా ! నన్నున్ ?

౪౭౦

గగనము నగమై చుక్కలు
బెగడి మలీమసములైన విలయంబున నన్
మగువా ! యే తప్పునకై
తెగగార్చితి వనుచు నిలువఁదీసి యడుగనే.

౪౭౧

ఏనాఁడైన మముపీడి పోయితివొ యింతీ ! నీవు నిష్కారణం
బై, నింద్యం బగుకోపభారమున నాహా ! యొక్కనాఁడైన మా
దీనావస్థఁ దలచినావె ? కబురున్ దెప్పించుకొన్నావె ? య
య్యో ! నీలేమిని మేము పొందు వ్యథలేవో వింటివే యెన్నఁడేన్ ?

౪౭౨

కరచరణంబులు, నూహల
నెఱిఁగిన దశనుండి కాల మెంతయు నన్నున్
బొరిగొను ; సురయును, సుందరీ
దరిలేని దినాలు జీవితంబున వమ్ముల్.

౪౭౩

బ్రతుకు విచారదుస్సహభరంబున వేడుకఁ గూర్చఁబోవ దో
యతివ త్వదీయఘోరవిరహాగ్ని మదాత్మను గాల్చె ; నా కిలన్
గుతుకము లేదు ; నిన్నుఁగని కూరిమి రంజిలుచుండెదన్ ; ద్వదా
కృతి గనరాని యీ బ్రతుక దేటికి ? లోక మదేటి కారయన్?

౪౨౪

లలన ! నాకీవు పూజ్యురాలవు ; ధరిత్రి
నిన్ను శిరసావహింతు నేమన్నఁగాని
యనువుకన్నను నధిక మీయవని లేదు
కాని, నీకన్న నను వధికంబు గాదు.

౪౨౫

నీ విరహాగ్నిచేఁ గరఁగి నేలను గాలిని రాలినట్టి యా
రావిదళంబుకై వడిని గ్రాలుచు సంచిలనంబు నొంది మ
త్తావిలచిత్తవృత్తి నురియాడెడు నాకడ కిప్పు డెవ్వ రీ
త్రోవను జాటు మాటు నినుఁ దోడ్కొనివచ్చిరొ చెప్పు నెచ్చెలీ !

౪౨౬

నవ్వులదివ్వె ! నీదుచరణంబుల ముద్దిడుటన్న వేలుపుం
బువ్వులబోండ్ల వాతెఱల ముద్దిడుకంటెను మేలు ; రేలు ని
న్నెవ్విధినైనఁ బట్టుకొన నెంచియు దిక్కులు బాఱుచుందునా
నెవ్వగ సిగ్గుఁ జెంది దిన మెంతయుఁ బుత్తును నేకతంబునన్.

౪౨౭

నా మది వలచినచెలి వే
రే మార్గమునందుఁ బడి కృశించెడు ; నిఁక నే
నేమని యత్నింతు ? రుజా
స్తోమశరీరుండ నగుచు స్రుక్కుచు నుంటిన్.

౪౬౮

ఓసుర ! నావధూటి యధరోష్ఠమధుద్రవ మంటుచుంటి వా
హా ! సుకృతంబు ; నీహృదయ మంతయుఁ బ్రేమరసంబుతో సుధా
వాసితమై చెలంగుటను వాతెఱకెందొవ నాశ్రయించి నీ
వీ సహజాకృతిన్ బడసి తింకఁ గృతార్థవుగాదె మద్యమా !

౪౬౯

నాకడ నుంపఁబోవ రొకనాఁడును నిన్నుఁ ద్వదీయబంధు ల
య్యో ! కడు బాధలన్ గుడుపుచుండిరి నాహృదయాంతరంబునం
దేకరణిన్ ద్వదీయతరళేక్షణముల్ ప్రసరించు నింక ? హా !
నీకయి వేచియుండిరి యనేకు లదే పరమ ఖులట్లుగన్.

౪౭౦

నామదిఁ బ్రేమబీజమును నాటితి వంతముదాఁక దీని నే
నామది దాచియుంతు ; నెలనాఁగ ! త్వదీయ విలాసచేష్టలం
దేమఱి నన్నురోయ, కెపుడేనియు నీమఱుఁ గాశ్రయించి నీ
పై మతి నిల్పి నీచెఱఁగుఁబట్టి తరించెద వీడ నేయెడన్.

౪౭౧

ఓయిభయాన ! నీదు మధురోష్ఠసుధన్ గొనుమంచుఁ జెప్పు మై
రేయము మానఁబోవను శరీరమునం దసు వున్నదాఁక, నో
గాయని ! నిన్నుఁ జూడఁ గడుఁ గాసిలుచుంటిని ; యిట్టులాడు టే
నాయపరాధమైనను, మనంబున నెంచకు ప్రేమ యేర్పడన్.

౮౭౬

అండజయాన ! నీదువిరహంబున లజ్జఁ బరిత్యజించితిన్ ;
వెండియు బుద్ధిహీను లపవిత్రులతోడఁ గుతర్క మేల ? వీ
రుండు సతంబు ప్రేమరసరూపసుధన్ గడుఁ గ్రోలుచుండు ; హీ
నుండు నపుంసకుం డెఱుఁగనోపునె యీ పరమార్థ మారయన్.

౮౭౭

చెలి ! నీబాస తిరం బని
పలుకులు నిజ మంచు నెదను భావించితిని ; నో
లలనా ! లోకమువలె వి
హ్వాలమును, నాభాస మనుచు నరయఁగనైతిన్.

౮౭౮

చెలి ! నీముంగురు లెందటిన్ వలపుమైఁ జెండాడెనో చూచితే
చెలి వక్రాలకముల్ గదా గరువమాజిన్ వంపగా రాదె య
న్నులమిన్నా ! ఫల మేమి నీవలన నేనున్ జూడలే దెప్పు డ
న్నులమిన్నల్ ఫల మిచ్చు టెవ్వరయిన్ జూడన్ దటస్థించెనే.

౮౭౯

పదివేల్పుల్, గగనాలు తొమ్మిది, మహాస్వర్గైకలోకంబు లె
న్మిది, నక్షత్రము లేడు, షడ్దిశలు, తూణీరాభపంచేంద్రియా
స్పదముల్, నాలుగుభూతముల్, త్రిగుణశక్తుల్ గల్గు నీ భూనభః
పదమం దీశుఁడు నిన్నుఁబోలె నొకతెన్ బద్మాక్షి సృష్టించెనే ?

౪౦౬

రోమకులు ప్రళయము దెచ్చు రూపమరయ
ముంగురులు నీదువదనంబు మూసె నదిగొ
అబ్జనేత్రాలు వెలయు సింహాసనమున
మత్తను ఖలుండు వచ్చె సామ్రాజ్యమునకు.

౪౦౭

మనము వసించెడి యీ జగ
మునఁ జూచితిఁ గాని నీదు మొగమునకును బో
లునె చంద్రుఁడు ? నీ తీరున
కును బోలునె "సరువు" తరువు కోమలగాత్రీ !

౪౦౮

పడతి ! త్వదీయనార్తను ప్రభాతసుధాపవనంబు దెచ్చి నా
కడకు ; మదీయమానసముఁ గైకొనిపోయెను నీకొసంగ ; ని
ప్పు డది దలంప నన్ మఱచిపోయెను నీ సహవాస వాసనం
బడి సహచర్య మూరకయె పోయదుగా యెటువంటివారికిన్.

౪౦౯

నీచెక్కిళులు సుమంబుల
దోఁచుకొనున్ ; నీదుసొగసుతోఁ బొల్తురె చీ
నా చెలువలు ; చూపుల
తో చతురంగము విధానఁ దూఁగదె జగమున్.

౪౯౦

నాహృదయంపుదివ్వె లలనా ! భవదీయ ముఖైకకాంతిసం
దోహముచే వెలుంగు ; నది దుఃఖముచే ఘనమైనఁ, గ్రమ్మఱన్
మోహవశాన వెల్గు రవిబోలెఁ ; బతంగములీలఁ గాలి బో
గ్గైహరియించు వారలకె యర్థమగున్ వివరింపు మచ్చటన్.

౪౯౧

నే మరణించెడు విధ మో
భామిని వచియింతు రెండు పదములలోనన్
నీ మోహంబునఁ జచ్చెద
నీ మోహముచేత లేచి నేవత్తు నొగిన్.

౪౯౨

సగము చచ్చినవెలుతురు సమ్ముఖమున
ప్రేమ శారీరకంబైన విమలకాంతి
యలరఁబోదు ప్రియా విరహానలమున
నిద్ధసుఖముల సతము వర్జించు ప్రియుఁడు.

౪౯౩

ఏగతిఁ జచ్చు మానవుఁ డదేగతి లేచు నటుంద్రు, గాన ని
చ్ఛాగతి మేము మద్యమును జక్కనిచానను గూడి రేబవల్
భోగపరాయణత్వమునఁ బ్రొద్దులుపుచ్చెద మాలయాంతమం
దీగతి లేచి వచ్చెద మొకింత విచారము గల్గకుండఁగన్.

౪౯౪

తిలకము దిద్దితంచు భవదీయ ముఖేందుకళా విలాసమం
దలఁతి ఘటింపలేదు ; ప్రమదాకృతిఁ జెక్కిళులన్ గులాబు లిం
పొలయఁగ మున్నె నీదు వదనోజ్జ్వలవన్య నెలర్చి రాజిలున్
గలికిరో ! దాని కిప్డు తిలకం బనుశాఖ వికాస మిచ్చెడున్.

౪౯౫

మృగనాభిన్ బురుడించు నీకురులు ; నారీ ! నీదు బింబోష్ఠమె
న్నఁగ జీవప్రతిపాదకం బగుచుఁ జెన్నారున్ ; భవద్వ్యక్తిసొం
పగు వందారు "సరూ" తరూపమముగా భావింతు నే ; నందుచే
నెగడున్గర్వముతో "సరూ" తరువుపై కాకాశమున్ జూచుచున్.

౪౯౬

ఏ మిషనైన నీ వలవు నే ప్రకటించెద ; నిన్నుఁగూర్చి నే
నే మృదుగీతి పాడినను నింతిరో ! మైకము గూర్చుచుండు ; న
న్నీమహిఁ గూల్చివేయుటకు నీక్షణబాణచయంబు లేటి కో
సామజయాన ! నీభ్రుకుటి సంజ్ఞ యొనర్చు టొకండె చాలదే ?

౪౯౭

నీ యాయువు నా దుఃఖము
చాయన్ ప్రియ ! పెరుఁగుఁగాత క్షణమాత్రమయేన్
నీ యనురాగముఁ జూపితి
వే యిది సుకృతంబు నీటనిడినట్లు సుమీ.

౪౬౮

ఒకనిట్టూర్పున కెల్ల జీవితము నుద్యోగింతు నేనమ్మఁగా ;
నొకదుఃఖంబున కెల్ల సంతసము నుద్యోగింతు నేనమ్మఁగా
నొకటన్ నా శతజీవముల్ కలిపి యుద్యోగింతు నీ పాదధూ
ళికి వేడ్కన్ బలిసేయు నెయ్యమున వేలీలన్ సరోజాననా !

౪౬౯

అరయ నానాతి ; వేదాంతి నగుదు నేను ;
వినను బాషండ వాదముల్ వీనులారఁ ;
గాని, నావంటి వెంగలివాని కీ ని
షేధములు కూడ వనుచు వర్ణించినాఁడ.

౪౭౦

నీ ప్రేమకొఱకు బాధల
నేప్రొద్దు సహింతు ; శపథ మిదె లయమగుదాఁ
కీ ప్రాణమున్న నీ విడు
నా ప్రాణాపాయ వేదనావళి కోర్తున్.

౪౭౧

ఓ వగలాఁడి ! నీదు విరహోదధిబాధల డిందు మైకమం
దీ విధి నా విపత్తనెడు హీనపుబంతును నీ తురంగ మెం
తే వెనఁ గట్టివేసినది ; నీవిడు నేనుఁగు రాజు నడ్డె ; నే
నీ వదనంబుఁ జూచుచును నిల్చిన నిరయి యుంటి నీగతిన్.

౨౦౨

నీకురులన్ గ్రహింపఁ దరుణీ ! కరయుగ్మము చాచినాఁడ ; నీ
నాకరపాళి భౌతిక మనం దగదాత్మమయమ్ము సుమ్ము ! నే
నాకురులందు నా చలితమైన మనంబును జూచినాఁడ ; నోఁ
గాక ! మదాత్మపైఁ గరయుగంబులు చాచినపోలి కయ్యెడున్.

౨౦౩

నన్ను నీవాడఁగాఁ జేసికొన్న నేను
వలచి వేఁడొదునే ? నాదు బాష్పవారి
నిముసమైనఁ గన్నెత్తి యే నెలతనైనఁ
జూడ నీయందు ప్రేమ నేజాడనైన.

౨౦౪

ప్రేమరసైకవీచికల వేఁగి చలించిన దీనమానసం
బేమటి మూర్ఛలో మునిఁగి యేటికో లేవదు నేఁటిదాఁక ; నో
హో ! మృతికాంత వచ్చి మధురాసవమిచ్చిన లేచివచ్చునో
యేమొ యెఱుంగరా దెడఁద నేఱయి నెత్తురు పొంగిపొర్లఁగన్.

౨౦౫

మృతుల పోరిన్ శరీరము ధరించిన, నేను పలాశ పుష్పసం
తతిఁ బురుడించు బాష్పములు ధారలు గట్టుచుఁ గాఱుచుండఁ ద
త్క్షతజములోని మేల్మసుఁగు కైవసమున్ బొనరించి తాల్చుచున్
గుతకము మీఱ లేచెదను కోమలిమెట్టిన వీథిముంగిటన్.

### ౨౦౬

నీయధరంబునం దమృతనర్ఝరి యేర్పడ దాఁగియున్న దో
గాయని ! దాని నంటఁ జషకంబిడ కాసుధఁ బీల్చివైచు ; నో
హో ! యిదియెంతప్రోడ ! తనయోష్ఠమునన్ జెలియోష్ఠమానగాఁ
బోయెను ! దీనిరక్తమును మ్రుచ్చిలకుండినఁ బూరుషుండనే ?

### ౨౦౭

చూచెద వింక నేఁడు చెలి, చూడ్కులతో నను గాఢవిస్మృతున్
జూచెద వింక నీకురులసొంపును పూజ నొనర్చు నంబినిన్
జూచెద వింకఁ దచ్చషకశూన్యకరాబ్జుఁ గిరీటహీనునిన్
జూచెద వింక నీచరణచుంబితఫాలు, ధరావలీఢునిన్.

### ౨౦౮

అలరాకాశశి డిందఁజేయును ద్వదాస్యాబ్జంబు ; పర్వంబులం
దలరుం బోఁడు లలంకరించుకొని యొయ్యారంబుగా నుండ్రు ; నీ
వల పర్వంబు లలంకరింపఁగల వొయ్యారంబు లొప్పారఁ ; నీ
యిల నెవ్వాఁడు సృజించెనో చెలిమి నిన్నేణాక్షి వీక్షింపఁగన్.

### ౨౦౯

కరుణ యెన్నాళ్ళకైనను గలుగదాయె
నబల ! స్మరియింపవు పరాకు నైనఁగాని
యింక నీదయ రాదని కొంక కరులు
నన్ను నిందింతు రని యెంతు ఖిన్నమతిని.

౨౧౦

ఈనిసి నీదురాక తరళేక్షణ ! ప్రాణికిఁ దేటు దెచ్చె ; నా
శ్రీనిభభాగ్యరేఖ రిపుచిత్తములన్ దురపిల్లఁజేయు ; నేఁ
డీ నిముషానఁ గ్రుంకి శశియేగిన, దీపము లాటిపోయినన్
మానిని ! నీవు గల్గఁగ దమస్సిటుఁ జేర దిదే దివంబగున్.

౨౧౧

నేనే నిక్కపుభాగ్యశాలి నయినన్ నీపాదపద్మాళికిన్
బ్రాణా లాహుతి చేసివైచెదఁ దృణప్రాయంబుగాఁ ; గాని, యో
చానా! మత్తనుదగ్ధధూళిపయి యుష్మత్పాదమున్ మోపెదో,
హీనం బంచును రోసెదో, యెదను శంకింతుస్ పముత్సాహినై.

౨౧౨

ఓ వగలాఁడి ! నా వగలయోషధి ! యించుక కూరుకుండు ; మా
హా ! వగగూరువారివిధి మారయ నేర్తువు ; నేను నిన్ను వి
ద్యావతిఁ బ్రేమచేత "ఫరహాదు" వలెన్ వరియించినాఁడ ; నా
జీవితమూర్తి ! నిక్క మల "షీరిని" కంటెను మిన్నగావొకో.

౨౧౩

పాపముచేత రూపు చెడి భాగ్యము వాసినవాఁడ నైన మా
యాపథ విగ్రహార్పకుని యట్టి హతాశుఁడగాను ; గాని, యే
మాపును సుందరీమణిని, మద్యమునున్ దలపోయువాఁడ ; నా
కీ పరతంత్రతనన్ నరకమేటికి స్వర్గమనంగ నేటికిన్.

౨౧౪

కామి సతంబు మైకమునఁ గాతరు రీతిని నిల్చి నిందలం
దేమణియుంటఁ జెల్లు ; క్షణమేనియు మేల్కొనియున్న దుఃఖ కీ
లామహితంబు లెల్లయెడలన్ గనుపట్టును గాన మైకమం
దేమటియుంట లెస్సయగు నెంతయుఁ గాఁగల దాఁగ దేడ్చినన్.

౨౧౨

ఈ మధుశాల మద్యమును, నేనును, నాయిభయాన చిక్కియు
న్నాము ; మదాత్మ, నాతనువును, నామతి దీనికె యమ్ముకొంటి, నిం
కేమిటిలెక్క యీశు దయకేనియు, నాతని శిక్షకేని ? యీ
భూమిని నగ్ని వాయుజల భూతములన్ దెగవీడనాడితిన్.

౨౧౬

తోయజనేత్ర ! నీ వలపు దుఃఖముచే హృదయంబు దగ్ధమై
పోయి ప్రమత్తతన్ గలఁగిపోయెను ; మద్యపు మత్తుకంటె న
య్యో ! యిది మించిపోయె ; నధికోత్తుల నాదురవస్థ చెప్పఁగాఁ
బోయిన దానికంటెను నపూతమెనా వగ దైవసాక్షిగన్.

౨౧౭

మత్తమతులెల్ల నరకాన మ్రగ్గుదు రను
మాట నీవెద నెంచఁగా మానుమింక ;
మత్తులే నారకంబున మ్రగ్గనెడల
స్వర్గ మొక్కయెడారి గావలయుఁగాదె ?

౨౧౮

సుర నాకు నిత్యజపమై
పరఁగును ; మాయాస్తి సురకు వ్యయపటిచెదఁ ; గొం
దఱు నీకు బుద్ధి కాదం
దురు ; వారలబుద్ధి నాకుదుచ్ఛము కంటే.

౨౧౯

తెలివితేటలు గలవారు కలఁడు, లేఁ డ
డన్న భ్రాంతులఁ జెడిపోయి రజ్ఞులగుచు
నార్య ! విజ్ఞానివై త్రావు మానవంబు
ప్రాణ మిచ్చెద నెందఱో దీనికొఱకు.

౨౨౦

నీవే దేవి వఁటన్న నీప్రతిమ నెంతేఁ గొల్చుటే మేలగున్
నీవే మద్యమొసంగెదేని మమతన్ సేవించుటే లెస్స ; యో
దేవీ ! దీని కతాన నీప్రియ మహాదివ్యాగ్నిలో దగ్ధమై
పోవన్జూచెద నస్థికంటె నసదై పోఁజూతు వేయేటికిన్.

౨౨౧

సొగసుమిటారులన్ గలసి సోమరసంబును ద్రావుటే హితం
బగు ; నగచాటులన్ బొగిలియార్చుచు నేడ్చుటె యెంతయో హితం
బగు జగదీప్సితతార్థముల యన్నిఁటికంటెఁ ; గృతఘ్ను వేడి నిన్
జగతి యొసంగనీ దన వజ్రసము మైకమునుంటు పోలదే.

౨౧౨

ఓ వగలాడి ! యేరయిన నూహ నెఱింగిరె నిన్ను సుప్తిలో ?
భావనఁజేసిరే తెలివివల్లఁ బ్రియాసవమందు మైకమున్
గేవలమున్న నిన్ దెలియనేర్తురు ; గావునఁ దెల్వికంటె నీ
పావనమైన ప్రేమరస భావ ప్రమత్తత మేలు గాదెకో.

౨౧౩

ఏనును గందు నాస్తికత యేమియొ, నాస్తిక మేమియో, యధో
ర్ధ్వాన రహస్యమేమియొ ; పదంపడి యీవిధమైన భావ వి
జ్ఞానముకంటెఁ దన్మయత గల్గిన యావలఁ గల్గు గౌరవ
స్థాన మెఱుంగవచ్చునెడఁ జాలును దక్కినవెల్ల వ్యర్థముల్.

౨౧౪

కర్మకషాయశాటిక వగన్ సురలోపలఁ బాఱవైచి, యా
నిర్మల మద్యశాల ధరణీపృథుభూతి నలందికొందు ; నీ
ధర్మము వీడి వీత మధుధాత్రి మనస్సును వ్యర్థపుచ్చితిన్ ;
గూర్మిని మద్యశాలఁ జని కూర్చెదఁ బోయిన యాయువంతయున్.

౨౧౫

గడ్డమె పెద్దచీపురుగఁ గట్టి సురాంగణ మూడ్తు ; మంచికిన్
జెడ్డకు స్వస్తిచెప్పితి నిసీ ! త్రిజగంబులు బంతులట్లు చే
డ్పడ్డవిధానఁ గూలిన లవంబుగనైనను లెక్కసేయ ; నే
నొడ్డిలి నిద్రపోవుచునె యుందుఁ బ్రమత్తుఁడనై తలోదరీ !

౨౧౬

మతిగలవాఁడవేని ! మృతిమానిని మద్య మొసంగి మత్తతన్
మతిని వెలార్చుపూర్వమె ప్రమత్తత నేరిచికొమ్ము ; నైజసం
గతిని బ్రమత్తభావములు గల్గుట దుస్తరమౌను నీకొగిం
బ్రతి మతిలేనివాఁడు మతిమాలినవాఁ డనరాదు నెచ్చెలీ !

౨౧౭

జాగ్రదవస్థ భోగములు సంతసముల్ గనరావు ; నిద్రలో
వ్యగ్రత నొందు బుద్ధి ; యుభయాంతరవస్థల సంధి నొక్క యూ
హాగ్రపదం బ దున్నది ; తదర్థము నే స్మరియించుచుందు ; నెం
తే గ్రహింప నాపదమునే బ్రతుకందురు వాస్తవంబుగన్.

౨౧౮

ఓ మృదుగాత్రి ! మాసుర త్వదుజ్జ్వల రాగసమ్మసుమ్ము ! నీ
కేమియు దృష్టిదోషములు నేర్పడకుండుత ! నీదుమోవియే
ప్రేమతటాక ; మెందఱో ప్రవీణులు "క్రైస్తవ కాఫరాదు" లెం
తో మధువాంఛఁ ద్రావెదరు నొయ్యన............

౨౧౯

ఓ యిభయాన ! నీ విరహ మొయ్యన నా హృదయంబుఁ గాల్చియే
పోయెను ; వచ్చిచూడు మిఁకఁ బోయెడుప్రాణిని దెచ్చు వెజ్జు నా
ప్రేయసి వీవె, నీకొఱకు వీడెద గ్రుక్కెడు ప్రాణ మీయభి
ప్రాయము ప్రాణిఁ బ్రాణములు ప్రాకెడుదాఁకను బోదు నెచ్చెలీ !

౨౩౦

ఓ సుమగాత్రి ! నావగ మహోగ్రగతఁ దాల్చెఁ బ్రమత్తభావముల్
మోసులు నెత్తి నా చికురపూగము పండియెపోయెఁ గాని, నీ
వ్రాసినలేఖ యీ ముదుకవాలకమంతయు మార్చి నూతనో
ల్లాస వికాస భాసురవిలాసములన్ గడుఁ గూర్చె నెచ్చెలీ !

౨౩౧

చెలి ! భవదాననంబు "జమషీదు" సుధాకలశంబు మించె ; నీ
తలఁపునఁ జచ్చుటే సుధను ద్రావుటకంటెను మేలు ; నీ పదం
బులఁ బడు ధూళి నాదుదినముల్ వెలుఁగొందగజేయుఁ ; దత్కళా
కలితరజంబులో లవముకాంతిలు కోటిరవిప్రకాశమై.

౨౩౨

ఓ గజయాన ! నీదు నధరోష్ఠము కెంపులసొంపు నింపుఁ ; ద
ద్రాగవిచార మాత్మకు బలంబును, బ్రాణికి గ్రాస ; మెవ్వఁ డీ
రాగ మహానిలాబ్దములఁ బ్రాణమొసంగఁడొ వాఁడు "నూహునా
కాగ్రహ" మున్న జీవములు గల్గిన జచ్చినవాని పోల్కియే.

౨౩౩

ఆహా ! నాప్రియ ! నీవిచార మెద లే, కావంత నిన్జూడ కీ
దేహం బోప దదేమొ ? నీపటుమె మద్దీక్షాస్వరూపంబు ; సం
దేహం దేటికి దైవసాక్షిగను మచ్చిత్తంబులో నీవె, నా
యూహన్ నీవె మఱేకళంకమును లేకున్నావు వీక్షింపుమా !

౫౩౪

ఓ యువతీ ! త్వదర్థము వియోగమహాగ్నికి నింధనంబునై
పోయితి ; నీ వదెచ్చటికిఁ బోయిన నా కరమెప్డు పయ్యెదన్
బాయదు ; నీవు వాసితివి బాపురె ! ప్రాణము లెన్ని నాశమై
పోయెనొ చూడు మాయుసురు పోయుము నేబలియౌదు నీకొగిన్.

౫౩౫

నీదానుండను జూడవేమి యువతీ నీముందె నాశీర్షమా
మోదంబారఁగ వంచినాఁడ నొరులన్ మోమెత్తి వీక్షింప ; నీ
వాదే నిందలపాలు చేసినది విశ్వంబెల్ల ; నీచేత నే
వాదున్బొందను జాలుఁ దక్కిన వసంభావ్యంబు లూహింపఁగన్.

౫౩౬

మగువా ! నీదు కటాక్షవీక్షణములన్ మాబోటి నిర్భాగ్యులన్
వగలన్ గూరెడువారి నారసియుఁ దాపం బార్చుమీ ! మేము నె
వ్వగ నిర్జీవఝుషాకృతిన్ గలము ! మాపై నీసుధావృష్టి సొం
పుగ వర్షింపుము ! ప్రేమపూర్వకముగా మోదంబు సంధిల్లఁగన్.

౫౩౭

పడతీ ! నీదుకవాటమున్ వదలిపోవంజాల నెచ్చోటి కే
ర్పడఁగా, నాతలఁద్రుంచినన్ నెపము నీపై మోపఁగాఁబోవ ; నె
య్యెడలన్ నాతల ధూళి బ్రుంగిననరే నీవెత్తఁగా జేర ; వీ
యెడలన్ నాతల నీదుపాదములపై నేనుంచి యెత్తన్జుమీ !

౨౩౮

దీపముభంగి మండుచు సతీ ! నిసిఁ బుచ్చిన మాకు గ్రుక్కనీ
రోపఁగఁ బోయుదేని హృదయోదితదాహము దీఱు ; లేనిచో
నే పృథులానిలంబునో హరింపఁగాఁ బంపుము దీప మాఱిన
ప్లేపటి యాఱిపోయి భవదీప్సితసిద్ధికిఁ బ్రాణ మిచ్చెదన్.

౨౩౯

అప్రభాత మద్య మాహార మాత్మకు
నీదు దర్శనంబు నిజముగాఁ బ్ర
భాత తరణి ; లెమ్ము భవదీయపదముల
కెరఁగి ప్రాణమిడెద నిదియె సతము.

౨౪౦

మధువును ద్రావవేని, వినుమా మధుపానము సేయువారలన్
వ్యథఁబడి తిట్టఁబోకు ; మెపుడైన యథావిధిఁ ద్రావువాఁడె స
త్పథమునఁజేరు ; నీవు శతథా మధుపానము సేయకున్న నా
మధువును మించు పాపములు, మాయలు సేయుట మానినావొకో.

౨౪౧

కాలం బనుకూలించిన
జాలన్ బ్రజరువ్వి సాశిరముమోదనిచో
పాలుఁడు సుర పీడిన వి
ద్యాలయమున భంగభావ మగు టచ్చెరువే.

౫౪౨

"తూసు" కంటెను కైకుబాదోకటు" కంటె
"కావుసును" ప్రాజ్యరాజ్యము కంటె మధువె
ఘనము ; కరిష్ఠి బాహ్యప్రార్థనముకంటె,
కర్మబాహ్యుని యొక యశ్రుకణము ఘనము.

౫౪౩

జలధినిబోలెడు హృదయము
వెలియై చెయిజాఱి యెందు వెడలును గర్వాం
బులు నిండి ? దీనికిడ సుర
తలతోడను నడచిపోవుఁ దలబోరలయై.

౫౪౪

భూతలభోగభాగ్యములు పోయెను ; బోయెను పానపాత్ర ; లి
చేతము చేత లేదు ; మఱి చెచ్చెఱ వీణను లేక వేణునం
దీటిత లేదు యోగులు నిసీ మధుపానము మానివేసి రా
భూతలనాథుఁ డొక్కఁడె ప్రపూర్ణ మధుద్రవ మాని చొక్కెడున్.

౫౪౫

అతుకులమారి బొంతలు సుమా ! మతకర్మలు చేయువారు స
ద్గతి హితమార్గమం డెపుడుఁ గాల్మిలుపన్ దలపోయ రజ్ఞులై
శ్రుతులను, "అలులో" లనెడు సూక్తులఁ గొన్నిఁటినేర్చి యీవివా
దతతి మహాత్ము నొక్కని వృథా యపవాదముఁ జేసి రెంతయున్.

౩౪౬

కాలం బెఱుఁగని యర్థం
బేలే దెల్ల రహస్య మెఱుఁగును ; దీనిన్
దూలించి మాయసేయఁగఁ
జాలుదువే ? ప్రజల కర్మసాక్షియె గాదే.

౩౪౭

ఒకనిసియైన నిష్ఠ నెద నూహ యొనర్పఁడు ; తామసంబు లే
కొకయడుగైన వేయఁ ; డల యుర్విజనంబులకంటె మించి తా
నొక యపురూపపూజ్యుఁ డని యువ్విళు లూరును ; నిట్టివారిచే
నకలుషులైన యోగులు, మహాత్ములకెల్లఁ గళంక మయ్యెడున్.

౩౪౮

అవనిజనంబు క్రూరులు, మహాకలుషాత్ములు, తుంటరుల్, మృదం
గ విధము వాగుచుంద్రు మొనగాండ్రని ; లోన లొటార మిట్టివా
రవిరళ పూజ్యభావమున నంఘ్రులు ముట్టఁగఁ గొల్చు కోరికన్
దవిలెద వేని పుణ్యచరితంబును నేర్పుము వారి కర్థివై.

౩౪౯

ఆ మధుశాల మాధ్వులు మహాత్ములతో విలసిల్లుఁగాత ! మా
యామతు, లాహితాగ్నుల పటాంచలముల్ శిఖి దగ్ధమౌత ; నా
నామహితప్రపూత సుగుణ ప్రతిపాదిత రక్తశాటి యెం
తే మధుపానమ త్తశయనేప్సితుపాదములన్ నశించుతన్.

౨౨౦

ఎవఁడు కీర్తినిదలఁపఁడో, యెవఁడు యజ్వ
శాటిగట్టఁడో, "సీయుర్గు" సాటి మింటి
కెగయఁడో, లోక మను గుడి కెవఁడు శ్వాశ
తార్చకుఁడు గాఁడో వాఁడె సౌఖ్యప్రదుండు.

౨౨౧

కావిగుడ్డలుకట్టి, సిఖ్యాతులైన
వారలకు రెండు రొట్టెలు భంగొసంగె
నేనిఁ జాలును ; నుబుసుల మౌనులంద్రఁడు
కాని, కాఠిన్యమున వారుఘనులు నిజము.

౨౨౨

ఎవఁడు కృష్ణాజినంబుఁ బూజించు, వాఁడు
గాడిదయి మోయు వైరిషట్కముల బరువు
ఆర్యనటనచే ధర్మమ్ము నమ్ముకొనెడు
నతఁడు చండాలుకంటెను నధముఁ డరయ.

౨౨౩

మధుకలశంబుపై మునుఁగు మండిత "జంషిదు" రాజ్యధాటికే
నధికము ; కల్లుకంపు "మరియాంబ" కొసంగినపండ్లకంటె న
త్యధిక ; "మబూసయిాదు, అరహంబుల" ప్రార్థనకంటె వేయి రె
ట్లధికము మద్యపాయి యుదయంబునఁ బేరెదఁ బుచ్చునూదుపుల్.

౩౩౪

కోవిదముఖ్య ! సాటిజనకోటి ననూయతఁ జూడఁబోకు మం
దీవు యథార్థమున్ దెలిసితేని శ్రుతిస్మృతులన్ వచించు వా
రే వివిధార్థముల్ దవిలి హీనవధూబుతురక్తసిక్తభా
వావధి ముట్టి పాయరు మహాకలుషైకమలీమసంబులన్.

౩౩౫

ఎంతకాల మజ్ఞానినై యెసఁగుచుందు ?
మతివిరక్తిని పడి, ముసల్మాను మతము
విడిచి, జందెమ్ము వేయుదు ద్విజునిభంగి :
నేల యన "మోమి" ననఁగ లజ్జించుచుంటి.

౩౩౬

వింటె యొకనీతి చెప్పఁగానుంటి, నొరుల
మాయసేయకు స్వార్థంబు మాటుపఱచి
యిహ మశాశ్వత మిట్టి యైహికముకొఱకుఁ
బారమార్థికపదవి, గోల్పడఁగవలదు.

౩౩౭

ప్రజలు వచింత్రు నన్ను మదిరాసముపాసకుఁ డంచు ; గొందఱ
ప్రజలె వచింత్రు నన్ నతము బ్రహ్మవిదుండని ; యిట్టివన్నియున్
నిజములొ కావొ బాహ్యముననీవు ననున్ గని నిశ్చయించి చె
ప్పఁ జనకు మంతరంగ మెటువంటిదొ నే నటువంటి మానిసిన్.

౨౨౮

ఆసలు నూహ లన్ తలుపులన్నియు మూసితి ; నుత్తమాధముల్
చేసెడు సాయపాటులకుఁ జేతులుచాచు నవస్థలన్నియున్
బాసితి ; నే "మసీదుముతవల్లి" ని గాను, శివార్చకుండఁ గా
నోసఖి ! యిప్పు డే నెవరినో యదె సాక్షిని నేనె దీనికిన్.

౨౨౯

మధురవనంబులన్ దిరిగి మద్యము ద్రావెడువారికెల్ల నే
నధిపతి ; నీశ్వరార్చనలనన్నిటినిన్ విడనాడి పాప దు
ష్పథమున నుంటి ; నిండుమధుపానముఁ జేసి హృదంతరాళపున్
రుధిరము గ్రమ్మగాఁ దమి నిరూఢసమాధిని నుందు నారయన్.

౨౩౦

ఓ ప్రభూ ! మేము నీకంటె నుత్తమోత్త
ములము ; నీవు ప్రజారక్తమును గ్రహింతు ;
వేము ద్రాక్షరస బు గ్రహింతు ; మిందు
నెవరు ఘోరపాపులో మన మెఱుఁగలేము.

౨౩౧

ఏదియొ కోర్కెతోడనె "మసీదునకున్" జనుచుంటిమంతె ; యా
మోదముతో నమాజునకుఁబోవుట లే దొకనాఁడు నేను మ
స్జిదు కవాటమందు నొకచెప్పును దొంగిలిపోయి యిప్పు డా
పాదుక పాతగిల్లె నని వచ్చితి రెండవసారి యర్థినై.

౫౬౨

ఏమల ఖాను నా బిరుదు సిద్ధకిరీటము విక్రయించు చు
న్నా మల నిల్వుటంగియును, నైజముగాఁ దలపాగ వేఱునా
వామలగీతి కమ్మితిని ; యారయ మోసమటన్న వాహినీ
స్వామి జపౌఘమాల మధుపాత్రకునై తెగ నమ్మినా మొగిన్.

౫౬౩

ఏటికి మమ్ముఁదిట్టెద విసీ ? మతిమాలిన కర్మఠుంఠ ! ము
మ్మాటికి మేము వాద్యముల మానినులన్ మధుపానశాలలం
దాటలఁ బాటలన్ బ్రతుకు హాయిగఁ బుత్తుము ; నీవు మాలికల్
బూటక వేషభాషలును బూనియుఁ బొక్కుచునుందు వెంతయున్.

౫౬౪

ఆహితాగ్ని, ప్రమత్తుఁడనైన నగుదు
నర్చకుఁడు కుత్సితుండనునైన నగుదు
నెల్ల తెగ లాడు నన్ను నించించుకైన
నే స్వతంత్రుఁడ నేను నే నేను సతము.

౫౬౫

పుణ్యకీర్తి గడింపుట పోలుఁగాల
నిహతిఁ బొక్కుట పోలదు ; నిరుపమాన
బాహ్యజపతపముల గర్వబడుటకంటె
మద్యవాసనచే మేనుమఱవ మేలు.

౩౬౬

కెంబెదవి గల్గు నారత్నకం బ దేది
ప్రాణమును బోయు మధ్వాసవంబ దేది
మద్యపు న్ని షేదము ముసల్మానమైన
మధువుగొను మేశ్వకీఁఠ ముసల్మాన మేది.

౩౬౭

పరకీయంగని యోగియొక్కఁడు "మహాపాపంబులన్ జేయుదే
తరుణీ!" యంచన నామె "పై కెటులు నేఁదర్కింపఁగా నుంటి నా
కరణిన్ లోపలనుంటి ; నీ వెటు పయిన్ గాన్పింతువో లోన నా
కరణిన్ గ్రాలెదవొక్కొ చెప్పు" మన దిగ్భ్రాంతింగనె న్యోగితాన్.

౩౬౮

సంతతము నీవు నన్నుఁ బాషండుఁ డనుచుఁ
దిట్టుచుందువు గాని నాయట్టి నేనె
యలరుచుందును ; నెందు న్యాయైకబుద్ధిఁ
జూడఁ బరదూషణము నీకు శోభ యిడునె ?

౩౬౯

మలిన మశాశ్వతంబయినమాయజగంబు, ధనంబుపై మదిన్
నిలిపి నరుండు భ్రాంతుఁడయి నీరసవాంఛల మున్గితేలు చే
కలననొ హాయిగా నొకటఁ గాలముపుచ్చఁగ నెంచియున్న నా
కలననె మృత్యుదేవి కరకంజము గైకొని వాని లెమ్మనున్.

౨౭౦

అస్తియటన్న దాన నిసుమంతయు లాభము లేదు ; దానినే
నాస్తియటన్న దాన నిసుమంతయు నష్టము లేదు ; దేని మీ
రస్తియటంౘ్రడొ యయ్యదియె నాస్తిగ నెంచుఁడు ; దేని మీరలున్
నాస్తియటంౘ్రడొ దాని నొగినస్తి యటంచు గ్రహింపుఁడెంతయున్.

౨౭౧

రేపు లభించునన్నదొక రేణువు నున్నదె భ్రాంతిగాని ? యీ
రూపమహాపవాదములు రూఢియె మిథ్యలుగాని ? భ్రాంతులన్
రూపఱనట్టికోవిదులు రోసి జగంబొకలిప్తయంచు నే
మాపును, రేపు, నెంచెదరు మానసవీథిని సానుభూతులై.

౨౭౨

పెక్కుకళాగుడారములు వీఁగఁగ మాయఁగఁజేసితో "ఖయా"
మక్కట జాఱిపోతివి వ్యథాగ్నిని దగ్ధము లయ్యె రాటలా
ఫక్కినె మిత్తికత్తెర గుభాలున నాయువుత్రాళ్ళు త్రెంతె నా
చక్కనె నాశనంబనెడు సాహుడు నూరక విక్రయించెడున్.

౨౭౩

తనువు గుడారువంటి దది తాల్చిన జీవుఁడు జేనిలీల నం
దనువుగ నుండిపోవు దివికారయ జేఁడు గుడారమందు లేఁ
డని మృతియన్న కాలభటుఁడంతట వచ్చి గుడారమెత్తి వే
యను ; నిఁకనొక్కచోట నిడనూహను యత్నము చేయుఁ గ్రమ్మఱన్.

౫౭౪

అరిగెడు కాలచక్రమిదియాగ ; దొకేగతి నెన్ని యేఁడులో
తిరిగెడు ; నీ ప్రమాదసముదీర్ణ వినాశనమైన కాలపున్
రిరుగుడుచేత మేను చనుదెంచితి ; మిందు దినంబులట్టు లే
మటి క్షణ ముండిపోయెదము ; మానము వచ్చిన త్రోవచొప్పునన్.

౫౭౫

అవనిని జూచి చూడఁబడు నట్టిపదార్థము లెల్ల వ్యర్థముల్
వివిధము లైనవాక్యములు విన్నవి, చెప్పిన వెల్ల వ్యర్థముల్
భువి యొకమూలనుండి, యొక మూలకుఁ బాఱుట లెల్ల వ్యర్థముల్
భవనమునందె మెట్టుచును, బాడుచుఁ గుందుట లెల్ల వ్యర్థముల్.

౫౭౬

అక్కట ! యీశరీరమున కాకృతి యన్నదె లేదు ; భూమిపై
నొక్కెడఁ జప్పరం బిడఁగ నుండిన దీనికిఁ దావె లేదు ; ఈ
చక్కి వివాదపుంబ్రతుకు చావుల కూపిరి యాడుచుండుటే
తక్క మఱేమి యున్న దిది దాఁటిన నేమియు లేదు చూఁడగన్.

౫౭౭

పుడమిని సౌఖ్యమున్ వెదకఁ బోకుము ; జీవిత మొక్కలిప్తలోఁ
జెడుఁ ; బ్రతిమృత్కణంబు "జమషీదు" శరీరమొ "కైకుదాదు" పే
రొడలొ ; మనుష్యజీవితము నుర్వి నిజంబుగఁ బృచ్ఛ చేసినన్
గడ కొకస్వప్న భావ మిదిగారుడయంత్రము ; మాయ గాదొకో.

౨౭౮

ఈవ యెఱుంగవే ధరణి నేమి స్వలాభము వచ్చెనాకు ! లే ;
దీవ యెఱుంగు దే బ్రతికి యీ యొడి నింపిన దేది ? ధిప మ
ట్లీవిధి వెల్గుచున్న, నెపు డేనియు నాఱినదేమి లేదు ; "జం
భూవరుపాత్ర" నే పగిల పోయిన నేమియు లేదు చూడఁగన్.

౨౭౯

ఎందఱో వచ్చి రెందఱో యేఁగినారు
పూర్వులు, నపూర్వులును యత్న పూర్వకముగా :
నొక్కొకరు కృతార్థు లగుదు ; రుర్వి కడుఁ గృ
తఘ్న యెవరితో నిల్వ ; దెందఱు జగాన
వచ్చి వెళ్లిరి : వెళ్ళఁగా వత్తు రింక ?

౨౮౦

ధరణి జనించి యెందఱో ముదంబున నాడుచుఁ బాడుచున్ మనో
హర మగుభక్ష్యభోజ్యతతి హాయిగ మెక్కి, యొకొక్కఁ డ్రుక్కెఁడు
క్షురసము ద్రావి మూర్ఛిలిరి : శూన్యసుషుప్తివధూటి వారి నం
దఱ నొకచోటఁ జేర్చి ప్రమదంబున నిద్దురఁబుచ్చె నెంతయున్.

౨౮౧

ముసలితన మూహలను, బుద్ధి మోసగించే
మన్మనోహరసుమకాంతి మాపివేసె
దేహగేహాభిత్తికలపైఁ దీర్చినట్టి
కప్పు శిథిలమై పోయెను ముప్పు గదుర.

౫౭౨

ఇలు విడనాడి, ప్రాణచయ మేఁగిన, వస్తువు లన్ని పూర్వపు
న్నిలయములందుఁ జేరుకొను : నెమ్మి శరీరకళాకలాప సం
చలనభరంబు లీ ప్రకృతి శర్వరి కాలహుతిన్ దహించి ము
క్కలయి గణింపరాకయ వికావికలై నశియించుఁ గ్రమ్మఱన్.

౫౭౩

లలితమనోజ్ఞయౌవనవిలాససముత్సవకాల మేఁగె ; నా
కలితకలాపసమ్మదవికాసవినూతనయౌవనంబు నాఁ
జెలఁగువిహంగ మచ్చెరువుఁ జెందఁగ నెప్పుడు వచ్చె ? వచ్చియున్
బొలుపుగఁ జెప్ప కే యెగిరి పోయిన దెప్పుడు ? చిత్ర మయ్యెడున్.

౫౭౪

అరిగిరి ప్రేమపాత్రపరమాప్తు లొకొక్కరు మృత్యుకామినీ
చరణములందుఁ ద్రొక్కఁబడి చచ్చిరి మైకము గ్రమ్మ ; వార లం
దఱు మనతోడనే తినుచుఁ ద్రాగుచు నుండినవారె కాని, ముం
దఱ మఱి రెండుముద్ద లిడుదాఁకను నిల్వకపోయి రంతియే!

౫౭౫

బందుగులతోడ నానంద మందిరముల
యందు వయసెల్ల భోగభాగ్యములఁ గడపి
తుదకు విడనాడి పోక తప్పదు ; జగంబు
స్వప్న మిది చూచుచుంటివి బ్రతికియుండి.

౫౨౦

జగతిపను లెల్లఁ గడచె నిష్టములఁ బడసి
యాయు వరిగెను, మృతి వచ్చె ననుచు సంత
సింపు ; మీా వట్లు చేయవు ; చేయఁగలిగి
తేనిఁ జేసితి నని నిశ్చయించుకొనుము.

౫౨౧

అనుకొనుము కృతార్థత నభ మంటినాఁడ
ననుకొనుము భోగభాగ్యాల నందినాఁడ
ననుకొనుము కోటిఁ గంటి నిష్టార్థనిధుల
ననుకొనుము వీని విడనాడి చనవలెనని.

౫౨౨

అవని యీా మూలనుండి యా మూలదాఁక
మణులు, రత్నాలు నారఁబోసినవిధాన
నున్న, "సహారా" యెడారి మంచున్నరీతి
వానిపైఁ గూరుచున్నఁ బోవలయుఁ దుదకు.

౫౨౩

జగతి సమస్తవస్తువులు స్వాంతమ ! చక్కఁగఁ గూర్చుకొంటి ; వే
యగడును లేని సమ్మదమహోవని బచ్చనిపైరుపైఁ గడున్
సొగసులఁ గుల్కు మంచువలె సొంపుగ నీ వొక రాత్రి వానిపైఁ
దగ శయనించి వేకువముదంబున లేచియె పోదు వెంతయున్.

౨౯౦

శతమొ, సహస్రవర్షములొ చావక యుండిన నుండవచ్చు ; నీ
క్షితిని, బురాతనంబయిన క్షేత్రముఁ బాయక తీఱదెప్పుడో
క్షితిపతి యైన, జానపద సీమల యాచకుఁ డైన నొక్కటే
మృతి యొకరీతిగాఁ గలిసి మ్రింగును గాలము మూడివచ్చినన్.

౨౯౧

నీవు నొకప్పు డన్నమును, నీరును, నిద్ర యుఁ గోరకుంటి ; వా
హా ! విధి పంచభూతముల యందిడి నిన్నొక కట్టగట్టె ; న
య్యో ! వెస వీని నన్నిటి నొకొక్కటె గైకొను ; మీవు పూర్వమే
భావముతోడ నుంటి వలభావమె వచ్చు విధాయకంబుగన్.

౨౯౨

మానవుఁ డొక్కసొంపయిన మంజులసత్కలశంబు ; దీనిపై
మానస మెంతొ ప్రేమనిడి మాటికి ముద్దులుపెట్టు ; నిట్టి సొం
పైన ఘటుంబు చేసి పొలుపారినకాలకులాలుఁ డుర్విపైఁ
బూనిక మోది మోది తుదిముక్కలఁ జేసియె పాఱవేసెడున్.

౨౯౩

యౌవనసత్వసంప దుదయంబగు కాలము రూపుమాసె ; నా
జీవన మెల్లఁ దిక్తమయి చీఁకపోయె ; శరంబువంటి మే
నీ విధిగా ధనుస్సువలె నెంతయు వంగెను ; గట్టిచేతనే
లేవఁగ నయ్యె ; నిల్వఁబడ లేను ; ననహ్యత నీడ్తుఁ గాయమున్.

౨౬౪

కాలము పెక్కుజీవన నికాయపటంబులఁ గుట్టుచున్న : దీ
కాలము పెక్కుజీవన నికాయపటంబులఁ జింపుచున్న : దీ
కాలము పెక్కుమానవనికాయము లప్పులవల్లఁ జేయు : నీ
కాలము వాని బూడిదను గల్పుచు నున్నది యెల్లవేళలన్.

౨౬౫

అక్కట ! మేము పాడయితి మాశసమన్న ఘరట్ట మంతయున్
నొక్కుచుఁ బిండి చేసినది నోరిటు నొవ్వఁగ మోదుకొం చొగిన్
బొక్కుటకంటె మార్గమిఁకఁ బోలదు ; చెల్లరె ! తప్పుపాటులోఁ
జిక్కి నశించినాము ఫలసిద్ధియొకింతయుఁ జూడకుండగన్.

౨౬౬

బాల్యమునందు నొజ్జలను బట్టితి నధ్యయనార్థ ; మంత నా
బాల్యము పోవ నొజ్జనయి పాఠముఁ జెప్పితిఁ బెద్దకాలమున్
శైల్యము దోఁప నాతెఱఁగు నాఁటికి నేఁడు విభూతిఁ బుట్టు సౌ
శీల్యము వీడి బూడిదయి చెన్నఱి గాలికిఁ దూలితిన్ గటా !

౨౬౭

చూతితి భూమిపై నిదుర సొంపుగఁ బోయెడువారిఁ గొందఱన్ ;
జూచితి భూమిలో నిదుర సొంపుగఁ బోయెడివారి కంటికిన్
గోచరమైనఁ గాని మరు కుడ్యము ; లెన్నగఁ జూడ నెందఱో
తోఁచిరి ; వారు వచ్చి యిటుఁ దొట్రిలి క్రమ్మఱఁ బోయి రాఁగ కే.

౧౯౮

ఎఱుఁగవు నీవు ; నీ వెఱుఁగ నేనెఱిఁగించెద నాదినుండి యీ
నరుని యథార్థ మంతయు ; ననంత మహావ్యసనాగ్ని చే సదా
దురితభరానుషంగమగు తోరపురూప మొకండు చేసి యీ
ధరణికి దింపి కొంత వ్యవధానము నుంచియు నెత్తుకోఁబడెన్.

౧౯౯

దరణి నభీష్టసిద్ధులనుదాల్చితి వంతమునందు నిల్చెనే?
పరఁగ "ఉమర్ ఖయామను" బహుభంగులఁ బాడితివైన నిల్చెనే ?
శరములునూఱులున్న, వరుసన్ మఱినూఱు శరంబులున్న భూ
భర మగుఁగాని, నాఁడయినఁ బాయకతీఱదు నిల్వనేర్తువే ?

౨౦౦

ఇద్ధదయానురాగములు నెవ్వని మానసవీథియందు సం
సిద్ధి వహించు నాతఁడు "మసీదున" నున్న, గుడిన్ వసించినన్
శుద్ధుఁడె : వేని పేరు పరిశోధనఁజేసిన ప్రేమసంహితన్
బద్ధగతిన్ లిఖింపఁబడువానికి లెక్కయె బంధమోక్షముల్ ?

౨౦౧

నే నల ప్రేమకాఘరుఁడ నిక్కము : సోయగమొప్పు నా "ముసల్
మానుఁడు" వేఱు ; వృద్ధపరమాణుపిపీలిక నేను ; "అ సురే
మానుఁడు" వేఱు : శోభచెడి మాడినమానస మొండె మాకు : సా
మానులు, దంభశాటికలు మార్చెదునంగడి వేఱు చూడఁగన్.

౧౦౨

చూపులకున్ గురూపమును సోయగమొక్కటె ప్రేమయున్న ; ను
ద్దీపితనాకమున్, నరకదీధితి యొక్కటె పిచ్చిప్రేమకున్
రూపటియున్నవారి కపురూపపుశాలువు ఖద్ద రొక్కటే
యీ పదినాళ్ళ కే యుపల మే యుపధానము నైన నొక్కటే.

౧౦౩

ఝరులతటంబులన్, వనుల, సామజయానల శాద్వలైక సుం
దర మధుమాసవాసర వితానములన్, గనెదేని యీ దెసన్
బరుగునఁ బొమ్ము షస్సులను బట్టినమద్యముద్రావి ; గుళ్ళు గో
పురముల కే మసీదులకుఁ బోయిన వ్యర్థము నిన్నుఁబిల్తురే ?

౧౦౪

"కాబా" యైనను, మద్యశాల యయినన్ గాదే తపోమందిరం ?
బా బింబాధర వేణుగానము తపోధ్యానైక గీతంబు గా
దే ? బుద్ధాలయమైనఁ యీాధుగుడియౌ నేనిన్ దపోవాటి కా
దే ? బంగారపు క్రాసెయైన, జపమా లేనిన్ దపశ్చిహ్నమే !

౧౦౫

ప్రేమ మహామనీషులకు పీతరుజా మధుశృంగపాత్ర ; మీ
ప్రేమ నవీనయౌవనము పేరిటి గీతములోని భావ ; మీ
ప్రేమ మనీషిలీల లరరే ! రవమేనియు నీవెఱుంగ వీ
ప్రేమయె జీవితం ; బిదియె వెంటనెయుండు సతంబు నీడ యై.

౧౦౬

ఏవొ రహస్యముల్ గలిగి యేర్చనిశీర్షము నుండఁబోదు ; వా
పోవఁగ హెచ్చుతగ్గులను బొందనిమానస ముండఁబోవ ; దే
త్రోవలొ తోఁచుఁ బాంధులకు దుర్లభమైనను, గాని ప్రేమకున్
ద్రోవయె తోఁచ దీ పథముఁ ద్రొక్కినధీరులు లేరు చూడఁగన్.

౧౦౭

యూధులు, పారశీకులును, యోనులు, బౌద్ధమహమ్మదీయు లా
రాధనమందిరావళిని రౌరవభీతి విచంచలాత్మలై
గాథలఁద్రవ్వి స్వర్గమును గట్టఁ దపస్సులొనర్తు ; రీ మనో
వ్యాధుల డింద రీశ్వరరహస్య మెఱింగిన తత్త్వవేత్తలున్.

౧౦౮

ప్రేమను నన్ సృజించె విధి సృష్టిదినంబునఁ బ్రేమపాఠమం
దేమరకుండ నేర్పె తుది నీహృదయంబును గోసి ముక్కలన్
బ్రేమరహస్యరత్నముల పేటికలన్ దెఱువంగ బీగపున్
స్తోమ మొనర్చె నా వితత శోభిత ప్రేమరసానుభూతికై.

౧౦౯

అది మధువై యొసంగవలె నయ్యది కైకొన నర్థి పౌరుష
ప్రద విభవంబు గావలె నపారదయార్ద్ర వికంపితైక సద్
హృదయము గావలెన్ సతము ప్రేమచరిత్రము వల్లెవేయుచున్
గదిసి ప్రియాంగణంబులను గ్రాలెదుదూగరొ మన్నొ కావలెన్.

౬౧౦

మతి విరహాగ్నిదగ్ధమయి క్రమంది, పరిభ్రమ నొంద నేఁ డిదే
వితత ప్రియాంగనా విపణి వీథుల మద్యము ద్రావుచున్ మదాం
ధతను నిజేచ్ఛచేతను స్వతంత్రుడనై చెడి తొంట్రిప్రేమకే
మతిమరలించి యాకుహరమార్గమునన్ శరణంబుఁ జేసితిన్.

౬౧౧

అతివిపరీతసంఘటన లందు ననున్ జెఱఁబట్టెఁ బ్రేమ ; నా
మతి చని "నేను వచ్చితి సుమా ! నడు" మంచును దాని నెట్టి, యు
ద్ధతిని బ్రియాగ్ని కింధన విధంబున మార్చి, తదింధనంబులన్
జితి నిడి, యగ్నియై రవిలి చెచ్చెఱ దగ్ధమొనర్చె సర్వమున్.

౬౧౨

ప్రేమసురాపణం బనినఁ బ్రేమ ; ప్రియానన దీపమాలికా
స్తోమమునన్ బతంగతితి దూరి దహించుట యన్న ప్రేమ ; యా
ప్రేమసురాంబుధిన్ మునిఁగి ప్రేయసి సొంపగు మోమువంక నా
మోమును వంచి మ్రొక్కినతమున్ స్మరియించుట ప్రేమ నాకొగిన్.

౬౧౩

ఆస్తికులెల్ల రీశ్వరయథార్థ విచారము సల్పుచుందు ; రా
నాస్తికు లెల్లఁ దార్కిక పదార్థ విషాదము నొందొచుందు ; రీ
న్యాస్తిపథాలు రెండును నిజంబులు గావని వ్యోమవాణి వి
న్యస్తవిముక్త కంఠమున నచ్చెరువొంద వచించు వింటిరే.

౭౧౪

చెఱ విడిపించి, నీ తెరువు చెప్పి, త్వదీయపరత్వమైన సు
స్థిరతను గూర్చి బంధములు త్రెంచి స్వతంత్రత నిచ్చి పోవుమో
హరి ! నను బాపపుణ్యముల నంటుని మైకములోన ముంచు మీ
యెఱుకను వచ్చుకర్మముల కే నిఁక బాధ్యుఁడఁ గానికైవడిన్.

౭౧౫

క్షమ యను నశ్వ మెక్కిన దిగంబరిఁ జూచితి ; వానికిన్ నిషే
ధములును, శౌచశీలములు, ధర్మ, మధర్మము, నస్తి, నాస్తిక
క్రమములు లేవు ; లే విహపరంబు లహో ! యిటువంటి ధీర సం
యమి గలఁడే జగత్త్రయమునందు యథార్థము చెప్పవచ్చినన్.

౭౧౬

మేమందఱము సదా ప్రేమ నర్చింతుము
మధ్వాసవము మాకు మార్గదర్శి
విధినిషేదము లను వెఱ్ఱులు లేవు క
ల్లంగడియే మాకు నాలయంబు
ఇంపు సొంపులలెక్క యిసుమంతయును లేదు
తెలివితేటలు మాఁకు గలలకలిమి
మేము విజ్ఞుల మని యేమఱి తలఁపకుఁ
డతిపవిత్రత మాకు నాత్మవిద్య.

౭౧౭

ఓ మతీ ! నీవు ప్రియురాలి యోలగమున
కరిగినప్పుడె స్వాతంత్ర్య మరిగిపోయె ;
నామెతోఁగూడికొనిన దద్ధాసవమున
విధినిషేదంబు లన్నియు వెడలిపోయె ;

౧౧౮

వసుధ వెలార్చు వస్తువుల భాతిని నూర్ధ్వజగంబు లీశ్వరా
వసథము, స్వర్గమున్, నరక వర్గము లున్నవటంచు నెంచు మా
నసమును గాంచి నాగురువు నవ్వి త్వదాత్మను నిట్టి వెన్నియో
యెసఁగుచు నుండె నంచు వచియించెను నాతనితత్త్వవిద్యచేన్.

౧౧౯

బింబాధరోష్ఠి నీ ప్రియతమ యొడిని నొ
యార మొప్పఁగ వచ్చి కూరుచున్న
మధ్యాసవమునకు మాఱుగా నెదుటను
నమృతభాండము నలరారుచున్న
యల యరుంధతియే స్వయంబుగా వసుధ కే
తెంచి పాటలు వినిపించుచున్న
క్రీస్తు మున్నగు మహాఋషులు స్వస్తిప్రవ
చనశతంబు పల్కి తనరుచున్నఁ
జిత్త మొకచోట లగ్నంబు సేయకున్న
సుస్థిరతవంక నెదఁద్రిప్పి చూడకున్న
సర్వ మాభాస మానందసాంద్రమైన
విభవ మబ్బునె యెట్టికోవిదునకైన.

౧౨౦

నా యపకీర్తిభేరి యల నాకముదాఁకను మ్రోగిపోయె : నా
ప్రాయము ముప్పదేఁడులకు బ్రాకె : క్షణక్షణమంతొయింతొ మై
రేయ మొగిన్ లభించిన సరే, కుతుకంబు జనింపకున్న : దీ
యాయువె కాలగర్భమున నంతము నొంద నిఁ కేమి మోదముల్.

౬౨౧

మా యధర్మైకజీవితప్రమాదమునం దొకయూర్పె సాగి, కన్
దోయిని నించు నశ్రుకణ తోయమె జాహ్నవి ; మా వృథావిషా
దాయతకీలిలోని యొక యంశమె యానరకంబు ; మాసుఖ
శ్రీయుతకాలమం దొకవిశేషమె స్వర్గము చెప్పవచ్చినన్.

౬౨౨

ఏ హృదయంబు సంగమును, నీప్సితముల్ విడనాడకుండునో
యా హృదయంబు ఛిద్రముల కాస్పదమై వెతలొందు ; నే నరుం
డైహికకర్మవాసనల యందు స్వతంత్రనొందు నాతఁడే
మోహముఁబాసి మోదమును బొందును దక్కినవన్ని దుఃఖముల్.

౬౨౩

బ్రతు కొకనాఁటి దొక్క త్రుటిపాటిది ; యైన ముదంబుతోడనే
బ్రతుకుము ; చూడు జాగ్రత ! ప్రపంచముసర్వము భోగభాగ్యముల్ ;
బ్రతుకుటలోనె యున్నది : నిరంతరమున్ భవదీయజీవిత
ప్రతతుల నెట్లు మార్చినఁ బ్రపంచ మదేగతి మార్చు వ్యక్తులన్.

౬౨౪

"జమ్మ"ను పానపాత్ర కయి సర్వజగంబులు చుట్టి వచ్చి దుః
ఖమ్మున రేబవల్ గరఁగి కంటికిఁ గూర్కను, నొంటికిన్ సుఖం
బిమ్మెయి మానియుండ గురుఁ డీ "జము" గూర్చి వచింప సర్వలో
కమ్ముల కాశ్రయంబయిన కాయమె జమ్మని తోఁచె నా కొగిన్.

౬౨౫

పుడమి విపత్తుదెచ్చు పెనుభూతము యేమఱి దీనిపజ్జలో
నడువకు ; ఖడ్గధార నొకనాఁడు త్వదీయ నికృత్త కంఠమం
దిడకయె పోదు ; జాగ్రత ! యిదే యిపుడైనను నోట బెల్లమే
నిడుననుకొమ్ము ; దాని దినకెంతొ విషమ్మగుసుమ్ము నెచ్చెలీ !

౬౨౬

పరిపక్వమై యెఱ్ఱఁబారిన ద్రాక్షార
సం బిది దీనివాసఁబుడంబు
కాచపాత్ర విలాసకాంతులఁ దనరారు
నట్టులు జీవదేహముల నెఱుఁగ
వలయు ; సొంపగు కాచపాత్ర మధ్వాసవ
రసపూరపూరమై గ్రాలుచుండఁ
గాంచెడువారి నర్థించుచు నవ్వెడు
చాడ్పునఁ గడువికాసమును గూర్చు
దానివాస్తవ మేమన్న ద్రాక్షరసము
నొక్కబాష్పంబు పూరమందున్న యెఱుపు
ప్రథితహృదయాంతరాళమౌ రాగరసము
రసముతో నైక్యమైన తద్రక్తమహిమ.

౬౨౭

సంకంటెస సొగసైన మో మెవరికైన గల్గునే యంచు శో
భాకాలాన గులాబి గర్వమున సంభావించుచున్ బల్కె, నా
లోకింపన్ "బులుబుల్" వచించె నవునౌ లోకంబులోనొక్క నాఁ
డే కాశింబలె నవ్వి వత్సరము దుఃఖింపంగ వీక్షింపమే.

౪౭౮

కాల మది మోసకత్తె, దుఃఖములనెలవు
కష్టములఁ దోడుపడు తేరుఁ గాంచనైరి ;
వెతల కలిగిన మఱి కొన్ని వెతలుగూర్చు
రక్షపై రక్ష నిడు నంతరాళమందు.

౪౭౯

ఒక్కపనినైన నెఱవేర్ప నోప నియదు ;
ఒక్క గ్రుక్కైన సంతోష మొప్పునట్లు
త్రిప్పనీయదు ; నే నెప్డు తిరగలేదు.
దుష్టకాలఁబు తుద కెప్డొ త్రుంచువెతల.

౪౮౦

వెతలను ముంచుకంటె మఱి వేఱుప నేమియు లేదు కాల దు
ర్మతి ; కిది పాడి గాదనిన మానదు ; ముందిలఁ బుట్టుబోవు సం
తతులకు నీరహస్యము శ్రుతం బగునేని ధరిత్రిఁ బుట్టఁగా
మతిఁ దలపోయ రెవ్వ రనుమానము మానుమిఁకేమి చెప్పుదున్.

౪౮౧

జగమన రెండుద్వారముల సౌధము ; పుట్టెడుదారి వచ్చిపో
వఁగ నొకదారి యిందు బహు బాధలు, చావులె వేఱుగల్గ ; వీ
వగరునకంటెఁ బుట్టి యొక వాసరమైనను నుండ కేగినన్.
పొగిలెడి ధాత్రిలో నసలె పుట్టకపోయినమేలు నెచ్చెలీ.

౬౩౨

పగలు, రేయు విచారాలఁ బొగిలి పొగిలి
వ్యర్థనిర్మోన్నత పథాలఁ బాటి పాటి
యంతులేని ప్రయాణాల నాస లనెడు
వ్యసనములకన్న వేఱేమి వసుధఁ గలదు ?

౬౩౩

కడచిన నాఁటికోరికలకై వగగుందెడు జీవటోలముల్
గడవగనున్న కాలమునకై విలపించుచు ముక్కముక్కలై
పడెడు మనంబు నెచ్చెలి ప్రపంచక జీవిత సంగ్రహంబు లీ
వడువున దుఃఖమున్ భయము వచ్చుచుపోవు దినాలవెంబడిన్.

౬౩౪

"వన మను గ్రీసుదేశమున వర్థిలు యూసుఫువంటిదాన, నా
మణులనుబోలు వాతెఱయు మంజులచారు హిరణ్యగర్భ మిం
పునఁ గల" దంచు గర్వపడు పువ్వును "నీవెటు యూసుఫాదు వం"
చన నది రక్త సిక్తవసనాభములౌ తన రేక లిందనన్.

౬౩౫

చచ్చెడుదాఁక నీధర విచార విషాద విసంకటంబులే
వచ్చెడు ; సౌఖ్యమన్న దొకవానరమైన నెసంగఁ బోవ ; దిం
దిచ్చుపుసౌఖ్యమే పడయ నెంచిన వేగమె చచ్చిపోవుటో,
ముచ్చిలు ధాత్రిపై నసలె పుట్టకపోవుటొ మేలు నెచ్చెలీ.

౬౩౬

మేమిల భూతపంచక సమీకరణంబునఁ బుట్టినార ; మీ
భూమి నశించిపోవుటను భూరిరుజాపరిపీడితాత్ములై
యేమఱియుంటి ; మీవగపు లీతను వుండెడిదాఁక నుండు ; నా
పై మఱి యుండ వీ తనువుఁ బాసిన పూతులమౌదు మన్నిటన్.

౬౩౭

ఓ విధి ! నీవు నాహృదయ మూరక దుఃఖములందుఁ బెట్టుచున్
బోవుచు సంతసంబనెడు పూతదుకూలము లెల్లఁ జించి, నే
నేవలనైన గాలినొక యించుక పీల్చిన దాని నగ్నిగాఁ,
ద్రావెడునీరు నోట నిలఁ ద్రవ్విన మట్టిగ మార్తు వక్కటా.

౬౩౮

ఏమి త్వదర్థభంగ మొనరించితినో నిజమాడు మోవిధీ !
తామసమొప్ప నన్నుఁ బరితాపములన్ విషమస్థలంబులం
ద్రాముచుఁ బంచపంచలకుఁ బంపుచు నాకటికూటి కక్కటా
మోమునువాయ వాసిచెడ మొత్తెదు ద్రుక్కెడు నీళ్ళపంగకే.

౬౩౯

జగ ముపకారమున్ సలుపఁజాలు నటంచు భ్రమింపఁబోకు ; నె
వ్వగ లిడుకాలచక్రము శుభంబగునంచుఁ దలంపఁబోకు ; మే
తెగులునకైన మందులిడి తీర్చుశ్రమన్ బరువెత్త కోర్చుకోఁ
దగునలవాటు సేయుమది ధన్యతఁ గూర్చు రుజాప్రశాంతియై.

౬౪౦

ఒహిక వాంఛలం దిటుల యాత్రివహింపఁగనేల, యందు నే
దేహినినైనఁ గాంచితిరె దృక్కుల మృత్యువు లేనివాని ? నీ
దేహమునందుఁ బ్రాణమొక దివ్యవరంబు, వరంబురీతి నం
దేహము మాని దీనిఁ గడుఁ దీయని దారిని వాడుకోవలెన్.

౬౪౧

చావిల వచ్చు వచ్చినను జావఁగవచ్చును ; గాని బాధలన్
జావఁగనేల ? నిత్యభవ సంసృతి స్థూలశరీర మారయన్
గేవల రక్తమాంస మల కిల్బిష చర్మ వసావికారమే
కావున నిట్టి వ్యర్థతమతంబునకై విలపింప నేటికిన్.

౬౪౨

చనినదినాలు వేగముగఁజన్న నదీసలిలంబురీతి, చే
తిని గల గాలిచందమునఁ దెంపునఁ బోయెను ; నాదు జీవితం
బునఁ బనినట్టికాలమును ముం దిఁక వచ్చెడికాలఫక్కికై
మనమునఁ జింత సేయఁ ; గొఱమాలిన భూతభవిష్యదర్థముల్.

౬౪౩

కాలపుఁ బళ్ళెరంబున వి కాసమనోహర వస్తుజాల మే
పోలికనైనఁ గానఁబడఁ బోదు ; ధరిత్రిని నిర్విచారియై
పోలినవాఁడు లేఁడు ; సతమున్ మృతి భీతి యొసంగుచుండు, జం
బాలజగంబులో మసలువారల కేమిప్రయోజనం బగున్.

౨౪౩

కనఁబడులోక మా స్తికము గాదిది కేవలభ్రాంతి ; భ్రాంతిలో
మునిఁగియు దీర్ఘదుఃఖములఁ బొంది నశించెద వేల ? ప్రాప్తమం
చనుకొని యోర్చుకొమ్ము ; ప్రతియాపద నొ్స్టలిఖించినంతె వ
చ్చును ; బ్రతిపత్తిమార దెటుచూచినఁ దృప్తిని బొందు చిత్తమా !

౨౪౪

లెమ్ము ; నశించి పోవు నవలీల, జగమ్మునుగూర్చి సుంత దుః
ఖమ్ము వహింపఁబోకుము ; సుఖంబునఁ బుచ్చుము కొన్నినాళ్లు శాం
తమ్ముగ ; విశ్వ మన్నది కృతఘ్నతసేయనిదేని నిన్ను ని
క్కమ్ముగ నేరవచ్చునె యొకానొక వ్యక్తిని డాసియుండకే.

౨౪౫

పాడుధరిత్రి దుఃఖములఁ బాడొనరింపకు జీవితంబు ; నే
నాఁడొ నశించునట్టి స్వజనంబును వేఁడకు ; నీమనంబు వె
న్నాడఁగ నే సరోజనయనాలకలందునొ కట్టివైచి మా
ఱాడక మద్యపానవివశాత్ముఁడవై చరియింపు మర్థివై.

౨౪౬

సుంతయు వ్యర్థదుఃఖముల స్రుక్కకు ; సంతసమందు జీవితం
బెంతయుఁబుచ్చు ; మీజగము న్యాయములేనిది ; యైన న్యాయమం
దెంతయు నీవు నిల్చి కనుమీ యిది శూన్యము ; నీవు శూన్యమే
యింతకుమున్నె ; యీనిజ నెఱింగి స్వతంత్రుఁడవై చరింపుమా.

౧౪౭

గగనముక్రింద నున్న భయకంపము లేదు ; ప్రమాదసంసృతిన్
దగిలితివేని మద్యమును ద్రావుము తీఱును ; నీకు నాదియున్
నెగడిన, నంత మున్న నది నేలనె గాదొకో నేఁడు నేలపై
వగరిన నేలలోనవె నివాస మటంచుఁ దలంపు మెంతయున్.

౧౪౮

పాపము, పుణ్యమున్ నరుల భావములన్ గల ; వార్తియున్, సుఖ
ప్రాపిత, మర్థసంచయము ప్రాప్తముపై విధిపైని లేవు, నీ
వై పరికింప నావిధి యనంతమహాకలుషానుషంగమం
దోపక వేగుచున్న దదిగో ! మనకంటెను వేయిరెట్లుగన్.

౧౪౯

వివిధవిలాస రూపముల విశ్రుతిఁ జేసి యెటింగి, హెచ్చుత
గ్గవమము లేలపెంచెనొ కటా ! యివి చక్కనఫక్కి లేనిచో
నెవనిప్రమాద మయ్యెది యవే కడుఁజక్కనిఫక్కి నున్నచో
దవిలి నశింపఁజేయుట యధర్మమె యావిధి చెద్దయ మారయన్.

౧౫౦

ప్రేమ దురంత దుఃఖములఁ బెట్టెడిదే విధిప్రేరితంబునై
యీమహి సొంపునింపు నదియేల నిషేధమొనర్తు రీశ్వరుం
డే మనపుణ్యపాపముల నిచ్చెడువాఁ డగునేని, యంత్యమం
దేమిపరీక్ష సేయు నిది యేమిరహస్యమొ తెల్ప రెవ్వరున్.

ఉ౨౧

విధికన్న నెవరధికులయి
యధికారము సేయనేర్తు రందఱఁగని దీ
పృథివిని లేదు ; స్వభావా
వధి మాఱును, మాఱ వన్యపథమున నెవియున్.

ఉ౨౨

మముసృజియించునాఁడె విధి మాగతి యేమగు నన్నమాట ని
క్కముగ నెఱింగియుండెరు ; నఘంబులు నాతనియాజ్ఞలేక యే
తమి నొనరింపనేర్తుము ? పదంపడి పట్టి లయాంతమం దదే
మము నరకాగ్నిఁ గూల్చు ననుమాట కొకింతయు నర్థమున్నదే.

ఉ౨౩

ప్రాప్తఫలకంబుపై మున్నె వ్రాసె నన్నె
యింక విధిలేఖినికిఁ బనియేమి గలదు ?
నుదుటఁ గల దేదొ యదెవచ్చు నెదుటి కెపుడు
కుమతి ! వగచెద వేల యత్నముల, శ్రమల ?

ఉ౨౪

విధిచెయ్దంబుల కెల్ల నొప్పుకొనకే వేఱేది గత్యంతరం
బు ధరిత్రిన్ ప్రజతోడ మైత్రి నెద నామోదాన లేకున్నచో ?
వ్యథ నీబుద్ధికిఁ దోఁచినన్ని పెడత్రోవల్ ద్రొక్కితిన్ గాని, యే
పథమందైనఁ బ్రమాదముల్ గడచు విశ్వాసంబు లేదయ్యెడున్.

౧౫౫

గుడిలోఁ జీకటియున్, మసీదుగల వెల్గున్, నారకావాసమం
దిడుమల్, స్వర్గసుఖంబుఁ, గూర్చి నుతు లింకెన్నాళ్లుసాగింతువో
బడుగా ! నొస్టను మున్నె వ్రాసి విధి సంప్రాప్తార్థముల్ ; వాని వెం
బడి నీవేఁగుట తప్ప దా లిపి యదే వర్లింపు మింకేటికిన్.

౧౫౬

భవదీయం బగుప్రాప్త మెంత గలదో భద్రంబుగా ముట్ట కే
లవమున్ దగ్గదు, హెచ్చ ; దున్న తృణమేలక్ష్యంబులో నుంచి తృ
ప్తి వహింపన్ దగు ; లేనిదానికయి చింతింపంగఁబో ; కెప్పు డీ
యవనిన్ గోవిదు లన్నవారెకడు మూఢాత్ముల్సుమీ యీయెడన్.

౧౫౭

ఏ పనియైనఁగాని మన యిచ్ఛకుఁ బోలినరీతిఁ గాదు కా
దేపనికైన యత్నమును నేడ్పును గూడదు ; మానవుండు ము
న్నీపృథివిన్ జనించుటకు నెంతయొ కాలము పట్టెఁగాని నేఁ
డీపృథివిన్ వడిన్ విడిచి యేఁగుచునుండె క్షణంబులోపలన్.

౧౫౮

కాలహయంబు పేఁపున నిగారపుజీను రచించినప్డె యీ
లీల నభంబు భంబు లవలీల సృజించినాఁడె తీర్చి మా
ఫాలముపై లిఖించె విధిపంక్తులు మూఁటిని నేఁటిదాఁక నా
వ్రాలనె యానవాలుగను గ్రాలిన మాపయిఁ దప్పు లుండునే.

౬౫౯

నను సృజించునాఁడె విధి నాయెడ నుంచిన విప్లవంబులే
పనివడి పెట్టుచుంటి ; నది పాపమొ పుణ్యమొ వాని మీఱఁగా
నను వగునే ? ప్రబోధనయ యానము వచ్చునె ? మట్టి నన్నుఁ జే
సిన యలమూస మార్చుటకుఁ జిక్కునె ? మూసనుబోలి యుండితిన్.

౬౬౦

ఏ నను మట్టిబొమ్మను నిసీ ! విధి మూసను బెట్టి తీసి, యె
న్నేనియు విప్లవంబు లొనరింపఁగఁ బంపెను ; మున్నుఁ జేయుచో
నే నెటువంటి రీతిని వహించితినో మఱి మాఱనేర్తునే
పూని యిదేప్రకార మల మూసయు నన్ను రచించెఁ బ్రేమడిన్.

౬౬౧

మధువు ద్రావుచు నుంటి నా మాడ్కిఁ దెలివి
గలుగువా రిది యెగ్గుగాఁ దలఁపఁబోరు
పుట్టినప్పుడె విధికి నాగుట్టు తెలియు
నింక మధువు మానిన విధి యెఱుక చెడదె !

౬౬౨

తనకున్ దోచినరీతి వ్రాసె విధి మత్ఫాలంబుపై నే నెఱుం
గనివాఁ డందలి పుణ్యపాపములు నన్గారింపఁగా నేర్చునే
మునుజన్మట్టివి, ముందురాఁగలుగు తప్పుల్ ముప్పులున్ నే నెఱుం
గను ; దామై చనుదెంచువానికయి నన్ గారింతురే దేవతల్.

౧౧౮

నుదుటను వ్రాసియున్న యొకనూకకు మించి లభింపఁబోదు ; నీ
మది విషయాభిలాషలను మాడ్చి దురాశల త్రేఁగ ; కీ జగ
త్సదనముమాయ ; మాయమయిసాగియుఁ గ్రమ్మఱ వచ్చిపోవుచున్
బొదలెడు ; దీనికై వగవఁబోలునె స్వాంతము తన్ను ద్రుంచ్చిలన్.

౧౧౯

విధి యీవిశ్వము మున్ను నిన్నడిగి తృప్తిన్ బూర్తిగావించెనే
విధిగాఁ గాఁగలదైన దింకవగవన్ విభ్రాంతియే గాదె యీ
పృధివిన్ గల్గుదినాలు సంతసముతో నీక్షించుచున్ బుచ్చుమీ
పృధువాంఛారతి నీమతిన్ నిహతిగావింపంగఁబో కయ్యయో.

౧౧౧

వగవకు ముందు రాఁగలుగు బాధలకారసి ; దీర్ఘదర్శికిన్
వగపు సతంబు గల్గు ; నదివ్యర్థము, స్వాంతము లోకవాంఛ లన్
తెగుళులఁ గాల్చివేయకుము ; తృప్తినిగాలము బుచ్చు మింతకున్
వగచినఁ బ్రాప్తమందు నొకపంక్తియు మాఱదు కోటిచెప్పినన్.

౧౧౨

నేను గోరిన విధి పడనీయ దెపుడు
నింక నాకోర్కె చెల్లుటకేది దారి ?
యరయ విధివిధానంబె గత్యంతరంబు
దేనికిని మనయత్నంబు లేనెలేదు.

22

౭౭౮

నావిగ్రహము ధాత్రి నయ మొప్ప స్వయముగా
జేసితి వే నేమి సేయఁగలను
నా తను వస్ప్రత్తి నయ మొప్ప స్వయముగా
వడికితి వేనేమి నుడువఁగలను
నా ముఖ ఫలకాన నయ మొప్ప స్వయముగా
పాపపుణ్యంబులు పట్టి పట్టి
వ్రాసితి వవి నేఁడు చేసి చూపెడుదాఁకఁ
బాయవు నే నెట్లు పాయఁగలను
హతవిధీ ! నేను స్వయముగా నవతరింప
లేదు లే ధీ వ్యథాభూమి మీఁది కీవె
చేసి పంపితి వే నేమి వేయఁగలను
ఏ నెవఁడను నెందుంటినో యెపుడు గలనో ?

౭౭౯

ప్రతిదినమున్ ప్రభాతమును బాయక నే మధుశాల కేఁగి యం
చిత మస్పృతానులాపములఁ జిత్తము బుచ్చెద త్రాగుబోతులన్
హతవిధి ! సర్వమున్ సలుపునట్టి మహాత్ముఁడ వింకనైన నా
గతి సవరింపఁగావలదె కావఁగఁజెల్ల దె నిన్ను మ్రొక్కెదన్.

౭౮౦

ఓచెలి ! రమ్ము రమ్ము ! మదినుంచకు జేపటిచింత ; నేఁడె యే
దో చరితార్థమైన పదమొంది చరింపుము ; పాపపుణ్య సం
కోచము లెంచ ; కన్ని విధిగూర్చెడివే భయమేల ముందు నే
దో చరమాంగమందు వ్యథలుండు నటంచు వచింప నిక్కమే ?

౨౭౧

వ్యథ లనువక్రదండము లహర్నిశమున్ నినుఁగొట్టుచుండ నే
పథముననైన బంతివలె బాధలఁ దూలుచు నేల రాలుచున్
గథకునిరీతి నుంటి ; నిఁకఁ గార్యము లేదు నటింపు మట్టులే ;
విధి నినుఁ గ్రిందమీఁదఁ బడవేయుచునుండె నతండె దిక్కిఁకన్.

౨౭౨

ప్రజలకుఁ జూపఁగా జపతపంబులు, గర్మలుఁ జేయుచుంద్రలే
నిజముగ దోషదూషితులు నెచ్చెలిరో ! మధురాసవంబు దె
మ్ము జపసరాళికన్న నిదె ముఖ్యము ; మున్నె పరిష్కరించె న
య్యజుఁడు తపంబొ, లేక మధురాసవమో గొనుమంచు ధాత్రికిన్.

౨౭౩

జపతపంబులు, కర్మలు సలుపు మెంతొ
మంచిదే గాని చేయ నా మన సదేమొ
వెళ్ళకున్నది లోన లెన్నాళ్ళకైన ;
విధియె యీలోటు నాలోనఁ బెట్టినాఁడు.

౨౭౪

స్థావరజంగమస్థ వసుధాతలమున్, నభమున్, త్రికాలముల్
నీవ ; త్వదన్య మొక్కయణువేనియు లేదు ; మహాత్మ ! నేను పా
పావిలవృత్తినైనను ద్వదర్థము దాస్యము సేయుచుందు ; నా
దేవుఁడ వీవు రక్షక ! త్వదీయుఁడ దోషము లేవి నాకిఁకన్.

౧౨౦

పుట్టుటకు మున్నె నీకథ పూర్తిచేసి
వర్తమానభవిష్యత్ప్రపంచమందుఁ
గడచు పరివర్తనములు నిన్నడుగకుండ
విధి విధించె నూరక వగ వెఱపు లేల.

౧౨౧

ధరణిని బుట్టుటన్నది స్వతంత్రతలోఁ గలదేని నేను నీ
ధరణికి రాను ; వచ్చిన స్వతంత్రతలోఁ గలదేని దీని నే
మఱి మరణింపఁబోను ; పలుమాటలికేటికిఁ జావుపుట్టుకల్
పెఱుఁగుట మున్నగాఁగలుగు వేదనలే పడ నొక్కనాఁడికిన్.

౧౨౨

సాధులతోఁ బ్రమత్తులగు జ్ఞానులతోఁ బరిహాస మాడుచున్
బాధలఁ బెట్టఁబోకు ; కడుఁ బాపము ; మద్యమునైనఁ ద్రావి స
ద్బోధల నాలకింపు ; మిది ముక్తిపథంబున కడ్డ ; దడ్డినన్
గాథలె గాని మద్యమును గైకొనకుండిన ముక్తి వచ్చునే.

౧౨౩

చెలిప్రేమాగ్నికి దగ్ధమై చనిన యీ జీర్ణాంగపున్ ధూమక
జ్జలమే మానసవీధి మాపె ; నిఁక నాసల్ లేవు లేవింక ; నే
వలనైనన్ నినుఁ గాంతునో యనుచు మున్ భావించితిన్ గాని, ని
ష్ఫలమయ్యెన్ పృథుయత్న ; మీ తెఱఁగు సంప్రాప్తించెనాదుర్దశన్.

౧౭౯

పాపము లాచరింపఁ డనిపల్కెడు పామరులందు జ్ఞాన మే
రూపుననైన లేదని నిరూఢి నెఱుంగుఁడు; పాపమందు నే
దో పరిలోకసిద్ధు లణిగున్నవటంచు వచిం చుదుర్మతుల్
కాపురుషుల్, మహావ్యసనగాఢతమస్సునఁ జిక్కకుందురే.

౧౮౦

ఈతమసావృతంబగు మహీతలమందుఁద్వదాస్యమందె తే
జఃతతియున్, సుధారసము జానగుచున్నవి పద్మగంధి! నీ
చేతులతో నొసంగు మలశీధువు ప్రాణమునిల్పుఁ; బ్రాణితో
భూతల మున్న దీభువియెముక్తి; మహమ్మదు నీవె నెచ్చెలీ.

౧౮౧

జ్ఞానసుధారసంబు తమకంబునఁ గాంచి తరింప ధాత్రిపై
మానవు లుద్భవించిరి; ప్రమాణముగా నిది లేనివార ల
జ్ఞానులు, వ్యర్థు లెంతొకలుషంబులఁబొందుశఠాత్ము లౌదు రో
మానిని! నేను తత్త్వమను మద్యమునే కడు గౌరవించెదన్.

౧౮౨

ఓచెలీ! నీ వదాన్యవిమలోదధిలో నొక ఫేనమాత్రమై
తోఁచునభంబు నీవుగల దుర్గపువీధి సజీవమైన "కా
బా" చయ మున్నదచ్చొటు ప్రపత్తిని బోయెదఁ; బోవలేనిచో
నాచరమాంగ మాపథమునన్ బడి చచ్చినభాగ్యము యగున్.

ఉ॥ ౩

లలన ! దయావిలోకనములన్ నను జూడుము ; చూచినంతనే
కలుషము లాఱు, సంతసముగల్గు ; సదుక్తుల మామనంబులన్
దెలుపకయే గ్రహింపఁగల తేజము నున్నది లోన నీకు ; నీ
చెలువగు మానసంబు "జమషీదునిరుక్మకలశంబు" నెచ్చెలీ.

ఉ॥ ౪

చెలి ! మధ్వాసవ మియ్యవేమి ? హృదయక్షీణైకదీపంబు ప్ర
జ్జ్వలనం బందదు మేటిద్రాక్షరస జాజ్వల్యాగ్ని ముట్టింప కే
వలనన్ శోభయెరాదు నీమధుర నవ్యప్రేమ మధ్వాసవో
జ్జ్వల చంచత్కలశంబుపై నిడినయోష్ఠంబింక రానేర్చునే.

ఉ॥ ౫

మానవజన్మ నాశము, ప్రమాదభయాన్విత, మట్టినాశమం
దే నవజీవనంబు నుదయించును గానసతంబు నా ప్రియ
ధ్యానము "జీససై" వెలసిప్రాణముఁ బోసెను దానఁజావు నా
ప్రాణముఁ దీయవచ్చియు హతాశను బోయె జితోస్మియం చొగిన్.

ఉ॥ ౬

కొందఱు తత్త్వవేత్త లతి ఘోరమృషోక్తుల నాడుచుంద్రు సీ !
కొందఱు కర్మలన్ సలుపుకూళలు రంభలఁ గూడనెంతు ; వీ
రందఱు మూర్ఖు లీశ్వరునియాలయవీథికి నెన్ని యోజనా
లుందురొ యైహికంబనెడు నూఁగెడు నీ తెర యెత్తివేసినన్.

౬౬౯

మధువు నిషేధమైన నది మంచిసుహృద్గణమందు నానుధా
మధుర రసానుభూతిని బ్రభాతములన్ సుమనోజ్ఞ మాధురీ
మధుకలఁశాలిబోసి నిజమానినులన్ దగఁద్రాగవచ్చుఁ ద
ద్విధివిధిగాని నీచజనవీథులఁ ద్రావుట కూడ దెప్పుడున్.

౬౭౦

కొందఱు మద్యపానమునఁ గుందుచునుందురు ; కొందఱీశ్వరుం
బొందఁగ రేబగళ్ళును దపోదనులై పడియుందు ; రిట్లు వీ
రందఱు మాయలో మునిఁగి యంతముగానక నిద్రలోపలన్
జిఁదులు ద్రొక్కువారె ; యలచిన్మయుఁ డీశ్వరుఁ డొక్కఁడేసుమీ.

౬౭౧

మధుశాలన్ వదరన్ దలంచెడు నపస్మారప్రలాపంబు లా
పృథుయజ్ఞాది తపస్సమాధులభవ ద్వైశ్వానరాహిత్యమా
కథకంటెన్ బరమంబు లో యభవ ! నీకన్నన్ బరం బేది ? నన్
వృథగాఁ గాల్చిన, లేక సాకినఁ ద్వదావిర్భావమే యీశ్వరా.

౬౭౨

నే నొకశ్వాన మా దివిని నింగిని వీడి యొకింత నిమ్న సో
పానములందు మెట్టుటకు వచ్చితిఁ ; గాని తదీయగుహ్య మే
లేని గ్రహింపరైరి, మఱి యేటికటంచు నిరాసఁ బొంది నే
నానభ మంటి పోవుటనై తలపెట్టితిఁ ద్రోవ గానకే.

౭౧

తోలుబొమ్మలు మేము ; మాతోనభంబు
నాటకము వేసి, యస్తికవాటమందు
ముగియ నొక్కొక్క బొమ్మను మూశివేయు
పెట్టెలోఁ బెట్టి తాళంబువేయు నిజము.

౭౨

అవనిని వీడిపోయి యొకరైనను గ్రమ్మఱిరారు ; వచ్చినన్
దివి తెరమాటుమాటలను దెల్పెడివారు త్వదర్థ మాదయా
ర్ద్రవసతిపైని మాజుపయిఁగ్రాల సమాజు దయార్థలబ్ధికై
నవయుచు నుండినట్టు లగునన్నను బాలబిభీషికల్ గదా.

౭౩

ఏమిటి యాస్తికంబు నిదియేమిటి జన్మమటన్న నీకథా
వ్యోమము పెద్దగాథ యయిపోవును ; దీనినిజంబు నిర్ఝరీ
స్తోమమునందు బుద్బుదముతో నెనవచ్చుఁ దదీయవీచికా
స్తోమమునందు లీనమగు తోయము మానవజీవితం బనన్.

౭౪

మాకై సృజింపఁబడె నీ
లోకము ; మే మఖిలలోకలోచనయుత ది
వ్యాకాంక్షఁ జూపు ద్రేవేలై
యీకరణిని నారగింతుమెల్ల యథేచ్ఛన్.

౬౫౫

ఏము విధూతపాప మలినేచ్ఛ లహంబును బాసి వాసిమై
సోమరసంబుఁ ద్రావి దివిఁ జొచ్చి యధోర్విని లేచి పోయినా ;
మీమలినంబు పోయిన దిసీ ! తొలిమట్టిని బుట్టినాము మే
మై మఱి మట్టిలోఁ గలిసిపోయితి మింక విచార మేటికిన్.

౬౫౬

ఒకచేతన్ "పురఖాను" తక్కకరమందో శీధుపాత్ర ప్రదీ
ప్తకళా ప్తిన్ విధియున్, నిషేదమును సంప్రాప్తింపఁగాఁ బట్టియే
నొకటన్ గాలహతిన్ ప్రభిన్నతను నుద్యోగించి నిక్కంపు నా
స్తికుండన్ గాక యథార్థపద్ధతిని ముస్లింగాకయున్నా నిటన్.

౬౫౭

ఆదిఁ బవిత్రవస్తుసఖమై జనియించి ధరిత్రి భౌతికో
పాధివిధూతపూతమతిఁబాడయిపోయితి మిందువచ్చి యా
మోదము మాఱుగా వ్యసనముల్ లభియించె నలభ్యవాంఛ లా
పాదశిరంబుఁ గాల్చె నిటు వ్యర్థముగా నశియించె జన్మమున్.

౬౫౮

ఎంతెంత యహము వదలునొ
యంతంత ప్రవర్ధమానమబ్బును ; నా కెం
తెంతగ వినయం బేర్పడు
నంతంతగమైక మబ్బు నానందసుధన్.

౧౯౯

ఏను నామణి వెలతగ్గి యీయలేను
నీ రుజాశాంతికిఁ జికిత్సయే రసాత్మ
కంబు ; "జంపీదు రాజ్యంబు" కన్నఁ బ్రియము
కలికి ! నీ వేణి యుభయ లోకముల పెట్టు.

౨౦౦

ఆపిపీలికా బ్రహ్మ పర్యంతమైన
శక్తి నీతేజముననుబ్రజ్వలన మొందు
నీశ్వరునకు నీకునుభేదమేమి లేదు
నిన్నుఁజెందని సద్గుణ మున్న దెందు ?

౨౦౧

నీవు చరాచరంబయిన సృష్టి నెఱుంగవు ; నీవు శూన్య సం
స్థావసథాన గాలివలె సాకుచునుంటివి ; యాది నంతమం
దీ వను నాస్తికంబు కల ; యేమియు లేనిది ; మధ్యభాగమం
దావిలయంబు శూన్యము లయంబులఁ బుట్టుచుఁ జచ్చు మిథ్యలన్.

౨౦౨

ఓయి ! శరీరమున్ విడిచి యూహ యెఱుంగనినింగిఁ బ్రాణముల్
పోయిన, వానిలోఁగలుషముల్, పొరపొచ్చెము లేమియుండు ? నీ
పోయినమూల మా నభముపొంతనె యున్నది ? ధాత్రిపైని నీ
కాయము వచ్చి స్థావరముగాఁ జనునన్నది సిగ్గుగాదొకో.

౨౦౩

నీయెడ లోకమందు వ్యసనేచ్ఛలఁ గాలిడుధూమ మొక్కటే
రాయిడువెట్టు ; నీవగలఁ గ్రాలుచుఁ బోయిన నెన్ని నాళ్ళకున్
శ్రేయముగాదు ; తన్నివృతి శ్రేయము ; గాన జగంబు మిథ్యగాఁ
జేయుమి ! యట్టి శూన్యమునఁజేరు మదేకద శాంతి ధామమున్.

౨౦౪

చావక పూర్వమె యేదో
ప్రో వొనరింపుము గడంగి పుణ్యము ; లేదే
నావల శూన్యకరంబులఁ
బోవల దీవెలుతు రుండఁబోలదు సతమున్.

౨౦౫

పాంచభౌతిక దేహ సత్వమవు నీవు ;
దయ్యమో, దేవరో, జంతువయ్యు మాన
వత్వమున రూపనివృతిని బడసినావు
ఏది కావలె నన్న నీ వౌదువుగద !

౨౦౬

ఓయి ! త్వదీయమైత్రిని సముజ్జ్వలతన్ బొనరించినాఁడ వ
య్యో ! యిపు డేల శత్రుసగనొంచెద వేమిటిమాట ? ధాత్రిపైఁ
గాయము దాల్చి యీ యవనికానిచయంబుల దూరఁజేసి నా
ప్రాయమ దుఃఖభాజముల పాలొనరించు టదేమికర్జమో.

౨౦౭

అంత్యదినాన నీనిజమునందు మహౌఘము గ్రాలెనేని నీ
దంతములందు వ్రేళ్ళునిచి దాఁగుడుమూఁతల నాడుదోయి ? ని
శ్చింతముగాఁ గటా ! పరమ చెచ్చెర లోకసుఖాలకమ్మి దు
ర్దాంతతఁ దెచ్చికో ; కలవరాల "యుసూఫును" నమ్మినట్లగున్.

౨౦౮

కోకిల ! నీ మనోహర కూజితములు
క్రుంగఁ బంజరబద్ధవై కూలినావు
కాన, నీ సతీసఖులతోఁ గలయనేర
వకట ! నీయాన లెల్లఁ జల్లాఱిపోయె.

౨౦౯

ఏ నొకనాఁడు నీశ్వరుగ్రహించెడి విద్యనుబట్టి నేర్వఁగాఁ
బూని ప్రధానుఁడైన యొకబోధకుఁ జేరితి ; వానినుండి య
జ్ఞానవినాశకంబులగు సంజ్ఞలయాను లెఱింగినాఁడ నా
కా నిరవద్య శూన్యముల నాతఁడెఱుంగఁగఁ జెప్పె నయ్యెడన్.

౨౧౦

"రంజాను" న నుపవాసము
లం జచ్చుటకంటెఁ దిని కలంగని మది ని
న్నుం జర్చించుట మంచిది
సంజాత దయాప్రపూర్ణ సంగతమతినిన్.

౭౧౧

చెఱువెండ నందు చేఁపలు
తిరిగి జలం బిందు వచ్చితీఱు ననన్ ; ద
త్పరిణామము విధి పలికెను
గుటియౌదురు మిత్తికంతకున్ జనకున్నన్.

౭౧౨

శూన్యజగాన మాయునికి శోభిల దెప్పుడుఁ ; గాన గాయనీ
ధన్యతమోనివృత్తపరిధానము, నాసవపానమత్త సా
మాన్యము జీవితావధిగ మార్చుము లోకము ప్రాఁతక్రొత్తలన్
దైన్యతఁ జూపుఁగాక మనదారికి నడ్డమురా వవేవియున్.

౭౧౩

ఇది వసంతాగమంబు సమీక్షితాగ
మంబు శాద్వలయుతభూరజంబు మాఱి
పుష్పముల వెలార్చి ప్రభాత పూతవాత
ములఁ జలించెడు మేఘాలమెలఁగుఁ గనులు.

౭౧౪

మాకు సుమంబులున్ దొరకుమార్గములేనిచో ముండ్లెచాలు ; చీ
కాకు వదల్చు తేజ మెదఁగల్గనిచో నరకాగ్ని చాలు ; న
స్తోకతపస్సమాధిజపతోయజముల్ లభియింపవేని నీ !
మాకు నిషిద్ధజీవనము మౌంజియు జన్నిద మున్న మేలగున్.

౨౧౫

ఆసచెలంగుపట్టు టడియాసయటన్న జగాన నింక వి
న్యాసవిలాససంగతి మనంబునఁ దట్టుటకైన నోపదీ
యాసవపానమత్తమతినై నిదురించుటె కర్జమైన న
య్యో సముపాసితం బయినవ్యోమము సోమము ద్రావనిచ్చునే !

౨౧౬

కోరిక తీఱ నీజగముకోరినతీరున నెల్లకోర్కెలీ
డేఱిననైన వచ్చుటకునేఁగుటకై తెరలున్న, వెన్నియో
సారులు పచ్చగడ్డివలె శాద్వలవాటికఁ బుట్టి చచ్చున
ట్లారయ వచ్చియుండెద మహర్నిశ మీదృశముల్ దలంపఁగన్.

౨౧౭

వనములఁ, బర్వతాల, మునిపల్లెల నెల్లెడ మెట్టినార మా
దినముల నొక్కరేని దివిఁదీర్చి ధరిత్రికి వచ్చినట్లుగా
ననుకొనలేదు : తత్ప్రథమునం దొకరైనఁ గృతార్థు లున్నయ
ట్లును గనుపింపలేదు ; పరలోకము చేరెడు బాటసారులన్.

౨౧౮

ఓయి ! ధరిత్రినుండి చనియుంటివి కొండొకనాఁడు ; నేఁడు నీ
కాయము గార్ధభాకృతినిగన్నది ; నీ నఖపంక్తి డెక్కలై
పోయెను ; నాటిగడ్డము ప్రపూతము తోఁకగ మాఱిపోయె ; నా
హా ! యిల లేరు నేఁడు నొకరైన నెఱుంగరు నిన్నుఁ బోల్పఁగన్.

౨౧౯

అల మహాకల్మషుఁడు కషాయాంబరుండు
వచ్చి, నామధుకలసంబు వ్రచ్చినాఁడు
నామధువు పాఱఁబోసె సన్న్యాసవిబుధ
బ్రువుఁడు నావంటి విప్రుని మోసగించె.

౨౨౦

నీవు నామధుకలశంబు నేలఁ బగులఁ
గొట్టి, మధువంతయును నేలఁ బెట్టినావు
నామనోవ్రణమును రేపినావు నే నిఁ
కీశ్వరునిఁ గూర్చి మొరనిడ నేఁగుచుంటి.

గ ద్య

ఇది శ్రీయిస్లామిక ఖాదరియా గోత్రపవిత్ర మదీన్ కబీర్ గురువంశ
పయః పారావార రాకాసుధాకర మహర్షి మొహియదీన్ బాద్షా
చాన్బియాంబికా గర్భశుక్తిముక్తాఫల చతుర్విధ సంస్కృ
తాంధ్ర నానాపాశ్చాత్య పారశీకాంగ్ల భాషా కూలంకష
మహాపండిత కవి మౌలవీబిరుదాంకిత శతాధిక
కావ్యవిరచన శతావధానాది కళానిపుణాఖిల
భారత శాసన మహా సభా సభ్యా
ధ్యాత్మిక విద్యాపీఠాచార్య ఉమర్
అలీషా క వ్యాంధ్రీకృత
"ఉమర్ ఖయ్యామ్"
పారశీక మహా
కా వ్య ము
సంపూర్ణము

